నూతన మంత్రిమండలి. 1962 మార్చి 12వ తేదీన మొదటిసారి సమావేశమైనప్పుడు తీసిన చిత్రం.



ఆంధ్రప్రదేశ్ గవర్నరు, 1962 మార్చి 20 వ తేదీన రాష్ట్ర ఉభయ శాసనసభల సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం.

# విషయసూచిక



ముఖచిత్రం: హైద్రాబాదుజిల్లా మేడ్చల్ తాలూకాలోని నేతపారిశ్రామికులు పనిలో నిమగ్నులైవున్న దృశ్యం

వెనుకఅట్ట: ఆంధ్రప్రదేశ్ నూతనమంత్రిమండలి. హైద్రాబాదు రాజ్‌భవన్‌లో గత మార్చి 12 వ తేదీన మంత్రుల పదవీ ప్రమాణ స్వీకారానంతరం తీసిన ఛాయా చిత్రం.



ముఖ్యమంత్రి
శ్రీ సంజీవరెడ్డి



# ఆంధ్రప్రదేశ్ నూతన ప్రభుత్వం



దేశంలోని ఇతర ప్రాంతాలతోపాటు ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా రాష్ట్ర శాసన సభకు 293 మందిసభ్యులనూ, లోక్ సభకు 43 మంది సభ్యులనూ ఎన్నుకోడానికై గత ఫిబ్రవరి నెలలో సార్వత్రికంగా ఎన్నికలు జరిగాయి ఈ ఎన్నికలు ఫిబ్రవరి 19వ తేదీన ఆరంభమై 25 వ తేదీన సమాప్తమయ్యాయి.

రాష్ట్రంలో ఒక కోటి తొంభై లక్షలకు పైగా ఓటర్లు వుండగా, వారిలో నూటికి 64 వంతుల మంది తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు శాసన సభలో వివిధ పార్టీలకు లభించిన స్థానాలు ఈ ప్రకారం వున్నాయి :

కాంగ్రెసు : 176 స్థానాలు; కమ్యూనిస్టులు 51; స్వతంత్ర పార్టీ 19; సోషలిస్టులు 2; ఇండిపెండెంట్లు 51. మార్చి 7వ తేదీన శ్రీ నీలం సంజీవరెడ్డి శాసన సభ కాంగ్రెసు పార్టీనాయకులుగా ఎన్నిక అయ్యారు. కొత్త మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసే విషయంలో తనకు సూచనలు చేసే నిమిత్తం శాసన సభలో మెజారిటీ పార్టీ నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డిని గవర్నరు ఆహ్వానించారు. మార్చి 12 వ తేదీన హైదరాబాదులోని రాజ్ భవనంలో గవర్నరు పది మంది మంత్రులచేత, అరుగురు సహాయ (స్టేట్) మంత్రుల చేత పదవీ ప్రమాణ స్వీకారం చేయించారు. మంత్రుల పదవీ ప్రమాణ స్వీకారం 35 నిమిషాల సేపు జరిగింది. ఆ రోజు సాయంత్రం మంత్రి మండలి సభ్యులు మొదటిసారిగా సమావేశమయ్యారు, ఈ సమావేశంలో వివిధ మంత్రులకు పోర్టుఫోలియోల కేటాయింపు దిగువ విధంగా జరిగింది:

| | |
|---|---|
| 1. డాక్టర్ నీలం సంజీవరెడ్డి (ముఖ్యమంత్రి) | సాధారణపరిపాలన, పోలీసు, హోం, లెజిస్లేచర్, ఎన్నికలు, సర్వీసులు, సాంఘికసంక్షేమం, ఖాదీపరిశ్రమలు. |
| 2. శ్రీ ఎన్. రామ చంద్రారెడ్డి (రెవెన్యూమంత్రి) | రెవెన్యూ, రిజిస్ట్రేషన్, స్టాంపులు, కాందిశీకుల ఆస్తులు, అతియాత్, జాగీర్ల నిర్వాహణ, ఋణపరిష్కరణ బోర్డు, భూసంస్కరణలు, పునరావాసం. |
| 3. శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి (ఆర్థిక, సహకార శాఖల మంత్రి) | ఆర్థిక, సహకార శాఖలు, వాణిజ్య సుంకాలు. |

| | |
|---|---|
| 4. శ్రీ ఎం. పళ్లం రాజా (పశు పోషణ శాఖ మంత్రి) | పశు పోషణ, అడవులు, మత్స్య సంపద. |
| 5. డా. ఎం. చెన్నా రెడ్డి (ప్రణాళికామంత్రి) | ప్రణాళికలు, ఆర్థిక, గణాంకముల సంస్థ, పంచాయతీలు, పంచాయతీ రాజ్యం. |
| 6. శ్రీ పి. వి. జి. రాజా (విద్యా మంత్రి) | విద్య. |
| 7. శ్రీ ఏ. పి. సుబ్బా రెడ్డి (సేద్యపు నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి) | సేద్యపు నీటి వనరులు, విద్యుచ్ఛక్తి. |
| 8. శ్రీ మీర్ అహమ్మద్ అలీఖాన్ (భవనాలు, కమ్యూనికేషన్ల మంత్రి) | భవనాలు, రహదార్లు, పురోద్యాన వనాలు, నగర నీటి సరఫరా సంస్థ, పబ్లిక్ వర్క్స్ వర్క్-షాపులు, ముస్లిమ్ వక్ఫ్స్, వక్ఫ్ బోర్డు, సాలార్ జంగ్ ఎస్టేటు. |
| 9. శ్రీ యార్లగడ్డ శివరామప్రసాద్ (చల్లపల్లి రాజా) (ఆరోగ్య, వైద్య శాఖల మంత్రి) | ఆరోగ్య, వైద్య శాఖలు. |
| 10. డా. ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య (పరిశ్రమల శాఖ మంత్రి) | మధ్యరకం పరిశ్రమలు, లఘు పరిశ్రమలు, పారిశ్రామిక సహకార సంస్థలు, స్టేషనరీ, ప్రింటింగ్, కంట్రోలు సరుకులు, లఘు పరిశ్రమల కార్పొరేషను, గనులు, గనుల కార్పొరేషను, సెంట్రల్ స్టోర్స్ పర్చేజిస్ శాఖ. |
| 11. శ్రీ ఎం. ఆర్. అప్పారావు (ఎక్సైజు, మద్య నిషేధ శాఖలమంత్రి) | ఎక్సైజు, మద్యపాన నిషేధం. |
| 12. శ్రీ పి. వి. నరసింహారావు (న్యాయ, సమాచార శాఖల మంత్రి) | న్యాయశాఖ, కోర్టులు, న్యాయశాఖ అధికార్లు, జైళ్లు, సమాచార, ప్రచార శాఖ, టూరిజం. |
| 13. శ్రీ ఆలపాటి వెంకటరామయ్య (మునిసిపల్ పరిపాలన శాఖామంత్రి) | మునిసిపల్ పరిపాలన, గృహ నిర్మాణం. |
| 14. శ్రీమతి టి. యన్. సదాలక్ష్మి (ధర్మాదాయ శాఖామంత్రిణి) | హిందూమతాదాయ, ధర్మాదాయ, దేవాదాయ సంస్థలు, గృహ వసతి సౌకర్యాలు, చిన్న మొత్తాల పొదుపు. |
| 15. శ్రీ అడ్డూరి బలరామరెడ్డి (వ్యవసాయ మంత్రి) | వ్యవసాయం, ఆహారోత్పత్తి, మార్కెటు సౌకర్యాలు, గ్రామీణ ఋణ సమస్యలు, ఋణ సహాయం. పరపతి సౌకర్యం, ఋణదాతలు, రాష్ట్ర గిడ్డంగుల సంస్థ. |
| 16. శ్రీ బి. వి. గురుమూర్తి (కార్మిక, రవాణా శాఖల మంత్రి) | కార్మిక శాఖ, రవాణా. |

ఆంధ్ర ప్రదేశ్‌లో మొట్టమొదటిసారిగా ఇప్పుడు సహాయ (స్టేట్) మంత్రులను నియమించారు. వీరికి కాబినెట్ హోదా లేకపోయినప్పటికీ తమకు కేటాయించిన శాఖలను వీరు స్వతంత్రంగానే నిర్వహిస్తారు.

ముఖ్య మంత్రి పదవిని స్వీకరించినపిమ్మట శ్రీ సంజీవరెడ్డి రాష్ట్ర ప్రజలకు రేడియో ద్వారా సందేశాన్నిస్తూ వారి సంపూర్ణ సహాయ, సహకారాలను అభ్యర్థించారు.

# స్వచ్ఛం, న్యాయసమ్మతం, సమర్థవంతమైన పరిపాలన

## ముఖ్యమంత్రి వాగ్దానం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి, గత నెల 12న ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసంగిస్తూ దిగువ సందేశం ఇచ్చారు:

"నేను ముఖ్యమంత్రి పదవిని తిరిగి స్వీకరించిన తరువాత ఈ రాష్ట్ర ప్రజలను ఉద్దేశించి ప్రసంగిస్తూ, వారు నన్ను తమ ముఖ్యమంత్రిగా ఎన్నుకోవడం ద్వారా నాయందు వారికి గల విశ్వాసాన్ని ప్రకటించినందుకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలను, అభినందనలను తెలియజేయడానికి మొదటిసారిగా ఇప్పుడు అవకాశం లభించింది రెండు సంవత్సరాల పాటు దూరంగా వున్న తరువాత తిరిగి స్వస్థానానికి వచ్చినందుకు నాకు ఆనందంగా వుంది. నా స్నేహితులు, శ్రేయోభిలాషులందరూ నా పట్ల అమితమైన గౌరవాభిమానాలను ప్రదర్శించారు. కాంగ్రెస్ పార్టీ యెడల ప్రజలకు గల విశ్వాసాన్ని మన మూడవ సార్వత్రిక ఎన్నికలు మరోసారి ఋజువుపరిచాయి. ప్రజాభిమానాన్ని చూరగొన్న ఈ సంస్థలో ఇంచుమించు బాల్యం నుంచి సేవచేసే అవకాశం నాకు కలగడం, దీని అధ్యక్ష పీఠాన్నలంకరించే గౌరవం కూడా ఈ సంస్థ నాకు కలుగజేయడం నా అదృష్టం.

ఇటువంటి సందర్భంలో నా ఆధ్వర్యంలో ఏర్పడిన మంత్రివర్గం అమలు జరిపే విధానాలు, కార్యక్రమాలను గురించి నేను ఏమైనా చెప్పాలని రాష్ట్ర ప్రజలే గాక మొత్తం భారతదేశం ఆశించడం సహజం. అయితే నేనుగాని, నా సహచరులు గాని యెదుర్కొనే వివిధ విషయాలను గురించి అప్పుడే చర్చించే అవకాశం కలుగలేదు. కాబట్టి స్థూలదృష్టితో మాత్రమే నేను ఏమైనా చెప్పగలుగుతాను. అధికారంలో ఉన్న పార్టీయే తిరిగి పరిపాలనను చేపట్టుతున్న కారణాన విధానాలలో గానీ, లక్ష్యాలలో గానీ పెద్ద మార్పేమి ఉండబోదు. సోషలిస్టు సమాజ స్థాపన, ప్రణాళికాబద్ధమైన పరిశ్రమాభివృద్ధి, మానవ శక్తి వనరుల ఉపయోగముల సాధనమే మన ముఖ్య లక్ష్యంగా కొనసాగుతుంది. అయినప్పటికీ నా మనసులో మెదిలే ఒకటి రెండు విషయాలను నేను చెప్పదలిచాను. స్వచ్ఛం, న్యాయసమ్మతం, సమర్థవంతమైన పరిపాలనను కొనసాగిస్తానని నేను ఖచ్చితంగా హామీ యిస్తున్నాను. నేటి ఉదయం రాష్ట్ర గవర్నరు, సమక్షంలో నేను నా సహచరులు రెండు ప్రమాణాలు చేశాం. ప్రమాణాలకు కట్టుబడి ఉండడమే మా అందరి కర్తవ్యం. రాజ్యాంగబద్ధులమై ఉండటం, భయం, ఆశ్రితపక్షపాతం లేకుండా మా విధ్యుక్త ధర్మాన్ని న్యాయసమ్మతంగాను, విశ్వాసపాత్రంగాను నిర్వహించడం, అధికార రహస్యాలను భద్రపర్చడం మొదలగు విషయాల గురించే యీ ప్రమాణాలు జరిగాయి. ఉద్యోగులు నిజాయితీగాను, దీక్షతోను పనిచేసి ఉన్నత ప్రమాణాలను అందుకోవాలని నేను కోరుతున్నాను. వారు నిజాయితీగా అధికార విధులను నిర్వర్తించే ప్రతి పనికి నా పూర్తి సహాయం లభిస్తుందని నేను హామీ యిస్తున్నాను

### వెనుకబడిన వర్గాలకు హామీ

రెండో విషయం—బీదలు. సమాజంలో ప్రాముఖ్యత చెందని ప్రజలను గురించి కొన్ని మాటలు చెప్పదలచాను 'సామ్యవాద సమాజం' అనే పదాలు కేవలం నినాదాలు మాత్రమే కావు. ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన వర్గాల అభివృద్ధికి పాటు

పడేటందుకు నా ప్రభుత్వం కృషి చేస్తుంది. ధనికులు యింకా ధనవంతులు గాను, పేదలు మరీ పేదలుగాను అయ్యే పక్షంలో, ప్రణాళికలు, స్వాతంత్ర్యం అనేవి అర్థరహితమైనవే. ప్రణాళికా పథకాలలో విద్య, ఆర్థిక, సాంఘిక రంగాలలో వెనుకబడి ఉన్న వర్గాల వారి అభ్యున్నతికి ప్రాధాన్యం యివ్వబడుతుంది. వారి అవసరాలను దృష్టిలో ఉంచుకొని ప్రత్యేక శ్రద్ధ తీసుకోబడుతుంది..

## నదీ జలాల సమస్య

నేను ముందుగానే చెప్పినట్లు, యిప్పుడే అధికారాన్ని స్వీకరించిన మంత్రివర్గం అవలంబించే విధానాలను, ప్రణాళికలను గురించి యిప్పుడు వివరంగా చెప్పడం నా ఉద్దేశం కాదు మనకూ మన పొరుగు రాష్ట్రాలకూమధ్య తలయెత్తిన నదీజలాల వివాదాన్ని గురించి ప్రత్యేకంగా ఒక విషయం చెప్పదలిచాను. యీ వివాదం ఫలితంగా గత పన్నెండు నెలలుగా ప్రాజెక్టులు, జల విద్యుత్ ప్రాజెక్టుల పథకాల అమలు నిలిచిపోయింది. న్యాయసమ్మతంగాను, మన హక్కులకు భంగం కలుగని విధంగాను యీ సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించి తద్వారా మన పథకాలను సాధ్యమైనంత త్వరలో అమలు చేయుటకు .కృషి చేయడమే మన ప్రధాన కర్తవ్యం. మన రాష్ట్ర ప్రజల శ్రేయస్సు మాత్రమేగాక వాస్తవంగా పూర్తి జాతి శ్రేయస్సు కూడా యీ ముఖ్య అభివృద్ధి పథకాల అమలుపైన్నే ఆధారపడిఉంది.

గత కొన్ని సంవత్సరాలలో యీ రాష్ట్రంలో చాలా పనులు జరిగాయి. ప్రణాళికా లక్ష్యాలను సాధించడంలో మనము యెప్పుడూ ప్రథములమే. ప్రజాస్వామిక వికేంద్రీకరణలో మనం మార్గదర్శకులమయ్యాం. జనాభా లెక్కల సేకరణలోనూ, యిటీవలి యెన్నికల నిర్వహణలోను మిగతా భారతదేశానికి మనం ఆదర్శప్రాయులమయ్యాం. కాని మనం ముమ్ముందు కఠిన పరీక్షలను యెదుర్కోవాల్సి ఉంది. వీటిని పరిష్కరించడానికి రాష్ట్రంలోని ప్రతి పౌరుని పూర్తి సహాయ సహకారాలు యెంతో అవసరం. మీ పూర్తి సహాయ, సహకారాలకై మిమ్ములను అభ్యర్థిస్తున్నాను. దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యాల నిర్మూలనకై అభివృద్ధి పథకాలను అమలు జరుపుటలో రాజకీయ ప్రతిపక్షాలు పూర్తి సహకారాన్ని యివ్వాలని వారిని అభ్యర్థిస్తున్నాను. ఈ విషయాలలో భావ వైరుధ్యాలు ఉండకూడదు. నిర్మాణాత్మక విమర్శలను, రాజ్యాంగబద్ధమైన ప్రతిపక్షాన్ని మేము ఆహ్వానిస్తాము. ప్రజాస్వామ్యంలో యీ రెండు ముఖ్యమైనవే. మాది మెజార్టీ పార్టీయే అయినా, మైనార్టీ పార్టీలతో సహకరించడం, వారి సముచిత అభిప్రాయాలను మన్నించడానికే మేము ప్రయత్నిస్తాము.

గతంలోవలెనే భవిష్యత్తులో, కూడా పరమేశ్వరుని కరుణా కటాక్షాలు మనపై వుంటాయని ఆశిస్తున్నాను.

— జైహింద్ "



# ప్రార్థన


మూలము:
విశ్వకవి రవీంద్రనాథ టాకూర్

అనువాదము:
శ్రీ కేశిరాజు వెంకటనృసింహ అప్పారావు


(తెలుగు)

ఎచ్చోట మానసం బెవరికి సడలదు
తలయెత్తి తిరుగంగాఁ దావుకలదు
ఎచ్చోట జ్ఞానము విచ్చలవిడినబ్బు
గోడడ్డు లేనట్టి వీడు జగతి
ఎచ్చోటఁ బలుకు పుట్టిల్లు సత్యంబెయో
ఆఫలోదయకృషి యలరునెపుడు
ఎచ్చోటఁ జైతన్య హీన దురాచార
మరు భూమిని వివేక ఝరి నశింప
దెచట హృద్దేశమున నిల్పి యెపుడు నీవు
నడుపు దాలోచనల్ క్రియల్ కడిమి మీఱ
అట్టి స్వాతంత్ర్య నాకలోకాంతరమున
మేలుకొనఁజేయు తండ్రి! నామేలినేల

(సంస్కృతము)

యత్రస్వాంతంనభీతం
భవతి న నమితం శీర్షమన్యాయహేతోః
యత్ర జ్ఞానం నపణ్యం
నచ జగదిదమాఖండితం గేహకుడ్యైః
యత్రోక్తిః సత్యగర్భా,
సతతకృషిలతా పూర్ణ తాశ్లేషకామా
యత్రానాచారమూర్ఛ—
న్మరుభువి న వివేకాపగా వ్యాపి నష్టా
యత్రత్వంచిత్తమగ్రే
నయసి సతత సంవ్యాపి భావే క్రియాయాం
తత్ర స్వాతంత్ర్య నాకే
భువన జనకః మే జాగృయాదేశదేశః



# స్వార్థరహిత
# శ్రేయోరాజ్య స్థాపనే మన లక్ష్యం

## ముఖ్యమంత్రి ఉగాది సందేశం

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి, నూతన సంవత్సరం సందర్భంగా ఆలిండియా రేడియో హైద్రాబాద్ కేంద్రం నుంచి ప్రసంగిస్తూ రాష్ట్రప్రజలకు దిగువ సందేశం ఇచ్చారు:

"మనమందరం ఉత్సాహంతో ఎదురుచూచే ఉగాది రానే వచ్చింది. ప్రకృతి అంతా కొత్తచైతన్యంతో కలకలలాడే ఈ ఉగాది, దేశమంతకూ కూడా ఉత్సవదినం. శుభకృత్ సంవత్సరానికి స్వాగతమిస్తూ, ఈ శుభసందర్భాన మీఅందరకూ నా శుభాకాంక్షలను సమర్పిస్తున్నాను. ప్రకృతిలో నూతనశక్తి పరవళ్లు తొక్కినట్లే, మనలోకూడా వినూతన, నిర్మలశక్తి ఉదయించగలదని ఆశిస్తున్నాను. గడచిన సంవత్సరాన్ని, అనగా ప్లవ సంవత్సరాన్ని ఎలక్షన్ల సంవత్సరం అనవచ్చు. ఆ సంవత్సరంలో మనం మన సంకల్పాలను, లక్ష్యాలను నిర్దేశించుకున్నాం. అప్పుడు భావ— ప్రకటన. ఇక శుభకృత్ సంవత్సరాదితో, మనం శుభకరమైన క్రియా శక్తిని ప్రకటించుకోవాలి కాలపురుషుడు మనకు, ప్రపంచానికి శుభం చేయాలనే సంకల్పంతోనే శుభకృత్ పేరుతో ప్రత్యక్షమవుతున్నాడు. మరి ఈ శుభకృత్ సంవత్సరాన్ని నిజంగా శుభకరంగా చేసుకోవలసిన బాధ్యత, చేసుకోగలిగిన సామర్థ్యం మనది. ప్రజలది. ప్రజలు అని ఎందుకు అంటున్నానంటె, సంకల్పశక్తి ప్రజా హృదయానికి చెందినట్టిది. ఆ సంకల్పాన్ని ఆచరణలోకి తెచ్చేసంస్థ మాత్రమే ప్రభుత్వం. అంతే. ప్రజలందరి తరఫున ప్రాతినిధ్యం వహించి. క్రియారంగంలో పాటుపడే సంస్థ మాత్రమే ప్రభుత్వం. అంటె, ప్రభుత్వపు స్థాయి ప్రజల మానసిక స్థాయిపై ఆధారపడివుంది. నిత్యజీవితంలో ప్రజలు ప్రవర్తించే తీరుతెన్నులే, ప్రభుత్వంలో ప్రతిబింబిస్తాయి. ప్రజలందరి శ్రేయస్సును ఏకైక లక్ష్యంగా పెట్టుకుంది మన రాజ్యాంగం. ఈ అనాది ఆదర్శమే ప్రభుత్వ విధానాల్లోనూ ప్రతిబింబిస్తుంది. అయితే, కేవలం మంచి ఆదర్శాలను వల్లెవేసినంత మాత్రానే చాలదు. ఆ ఆదర్శాలను ప్రజలు తమ జీవితాలకే మార్గదర్శకాలుగా పాటించాలి. ఇది ప్రజల మానసిక స్థాయిలో జరగాలి. మనం లక్ష్యంగా పెట్టుకున్న శ్రేయోరాజ్యమనే దానికి తగిన దృక్పథం, మనస్తత్వం, ప్రవర్తన ప్రజలకు అలవడాలి. ప్రభుత్వానికి శ్రేయోరాజ్య లక్ష్యాన్ని నిర్దేశించి, మళ్లీ మనం మన పాత ధోరణులనే, 'ఎవడికి వాడే' అనే సంకుచిత స్వార్థ ధోరణులనే ఆర్థిక, సాంఘిక రంగాల్లో ప్రదర్శిస్తే లాభం ఏమిటి? శ్రేయోరాజ్యానికే మారుపేరైన సోషలిస్టురీతి సమాజపు ముఖ్యసూత్రం ఇది— అందరూ సరిగా, మనస్ఫూర్తిగా కష్టించాలి, అందరూ ఏలోపం లేకుండా జీవిత వికాసాన్ని అనుభవించాలి. ప్రకృతి పుష్కలంగా మనకు సంపదను, అందరికీ సరిపడ సంపదను సమకూరుస్తున్నప్పుడు, మనం ఒకరినొకరం వంచించుకొనటం గాని, పీడించుకొనటం గాని, ఒకరి కష్టాన్ని మరొకరు కొల్లకొట్టటంగాని అన్యాయమే కాక, అజ్ఞానమని అంటాను. మనం ఈ అజ్ఞానంతో ఒకళ్లకొకళ్లం అడ్డురాకపోతే, కష్టంలోనే ఉంది సరైన ప్రతిఫలాన్ని సంపాదించుకునే శక్తి. ఆ రహస్యాన్ని తెలుసుకున్నారు కాబట్టే, మన పూర్వీకులు—కష్టేఫలే అన్నారు. ఫలించటమే పనియొక్క తత్వం. కాబట్టి మనలో ప్రతిఒక్కరూ

(మిగతా 84వ పేజీలో చూడుడు)

రాష్ట్ర ప్రభుత్వ అటవీశాఖ అడవుల పరిరక్షణకు

వివిధ చర్యల్ని గైకొనడంతో బాటు పరిశ్రమల అభివృద్ధికి ఉపయోగపడే వృక్షజాతుల్ని పెంచడానికి పూనుకోవడం. నగరంలో బ్రహ్మాండమైన జూయలాజికల్ పార్కును నిర్మిస్తుండటం అభినందనీయం.

అడవుల్ని సమాజ గరిష్ఠ ప్రయోజనాలకు వినియోగించాలనేది అటవీశాఖ ప్రధానాశయం. అడవుల వినియోగాన్ని పెంపొందింపజేయడానికి టేకు, జీడిమామిడి లాటి చెట్లను నదీతీరాల తదితర చోట్ల పెంచడానికి కూడ ప్రయత్నాలు జరుగుతున్నవి

తృతీయ పంచవర్ష ప్రణాళికలో యీ శాఖకు రు. 130 లక్షలు కేటాయించబడినవి అందులో 1961_62 లో రు. 21 లక్షలు, 1962_63 లో రు. 21 లక్షలు ఖర్చు చేయడానికి ఉద్దేశించబడింది ఇదిగాక కేంద్ర పరంగా మరికొంత ఖర్చు జరుగుతుంది

తృతీయ ప్రణాళికా కాలంలో 14 వేల ఎకరాల భూమిలో పరిశ్రమల అభివృద్ధికి ఉపయుక్తమైన వెదురు, దేవదారు యూకలిప్టస్‌లాటి వృక్ష జాతుల్ని రు. 22 లక్షల ఖర్చుతో పెంచే ఏర్పాట్లు జరుగుతున్నవి. ఈ వృక్ష జాతులవలన ప్లైవుడ్. ప్యాకింగ్ పెట్టెలు, కాగితం. అగ్గిపెట్టెల పరిశ్రమలకు ఎంతో ప్రయోజనం కలుగుతుంది ఈ విషయమై నర్సరీలను గాను సుమారు ౧ వేల రూపాయిల్ని ప్రభుత్వం 1961 62 సంవత్సరంలో ఖర్చు చేసింది 1962_63 సంవత్సరం నుండీ ఏటా రు. 5 లక్షల చొప్పున ఖర్చు చేయబడుతుంది

అడవుల సంపత్తిని సర్వే చేయడానికి రు. 2 కోట్ల బృహత్పథకానికను భారత ప్రభుత్వం సంకల్పించింది. ఇందులో సుమారు రు 15 లక్షలు ఆంధ్రప్రదేశ్ కు వినియోగించబడవచ్చు.

# వెలుగుబాటలు

"ఉదయభాను"

మచ్‌ఖండ్ ప్రాజెక్టు ప్రాంతంలో భూసార పరిరక్షణ నిమిత్తం భారత ప్రభుత్వం యిచ్చే రు. 1 కోటిలో మూడింట రెండు వంతులు ఆంధ్రప్రదేశ్ కు, ఒక వంతు ఒరిస్సాకు లభిస్తున్నవి. 1961_62 లో యీ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ కు రు. 3 లక్షలు లభించాయి. 1962_63 నుండి ఏటా రు 14 లక్షలు లభిస్తాయి. రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖ కూడ భూసార పరిరక్షణ కృషి సాగిస్తుంది. అయితే అటవీశాఖ తన కృషిని అడవులకు పరిమితం చేస్తే వ్యవసాయశాఖ వ్యవసాయ భూములకు పరిమితం చేస్తుంది. ఈ రెండు శాఖల కృషి సమన్వయపరచబడుతున్నది.

అరకులోయలో కాఫీ తోటల పెంపకానికి శ్రీ తెన్నేటి విశ్వనాథం కాఫీ బోర్డు అధ్యక్షుడుగా ఉండగా ఒక పథకం రూపొందించబడింది. ఆ పథకం త్వరితగతిని అమలు జరుగుతున్నది. ఈ పథకం క్రింద 1961_62 లో రు. 5 లక్షలు ఖర్చుచేయబడినవి. 1962_63 సంవత్సరములో రు. 4 లక్షలే కేటాయించబడుతున్నవి. మొత్తం రు. 15 లక్షల ఖర్చుతో 1966 నాటికి యీ పథకం అమలు పూర్తవుతుంది.

ఈ ప్రధాన పథకాలు గాక రాష్ట్రంలోని 25,347 చదరపు మైళ్ళ విస్తీర్ణంగల రిజర్వు అడవులలో యింకా ఎన్నో చిన్న చిన్న పథకాలు అమలు జరుపబడుతున్నవి. రాయలసీమలో క్షామ పరిస్థితులు తలెత్తి పశుగ్రాసానికి కొరత ఏర్పడితే నల్లమల అడవులనుండి పశుగ్రాసాన్ని సరఫరా చేశారు.

గోదావరి నదీతీరాన పాపికొండల ప్రాంతంలో టేకు మొక్కలు నాటే పథకం అమలు జరుపబడింది. అలాగే కోస్తా జిల్లాలలో జీడిమామిడి మొక్కల్ని 9,000 ఎకరాల భూమిలో నాటడం జరిగింది. శ్రీహరికోట దీవిలో 100 ఎకరాల స్థలంలో

యూకలిప్టస్ మొక్కలు నాటబడినవి. సుమారు ఒక వెయ్యి మిరియపు మొక్కల్ని కేరళనుండి తెచ్చి విశాఖ, గోదావరి ప్రాంతాలలో నాటారు.

ప్రభుత్వ యితర శాఖలు కోరితే అటవీశాఖ అవసరమైన కలపను సరఫరా చేస్తుంది. టేకు, వెదురు ముఖ్యంగా సరఫరా చేయబడుతున్నవి.

చాలచోట్ల అడవులకు సరిహద్దు కంచెలు నిర్మించబడుతున్నవి అటవీ ప్రాంతాలలో కొత్తగా అనేక రోడ్లు నిర్మించబడుతున్నవి. ఈ శాఖలో పనిచేసే వారి సౌకర్యార్థం బావులు, ఇండ్ల నిర్మాణం కూడా జరుగుతున్నది.

అడవులలో దొంగతనాల నిరోధానికి విస్తృత కృషి జరుగుతున్నది పట్టుబడిన నేరస్థులకు తగిన శిక్షలు విధించబడుతున్నవి ఇందుకు ప్రత్యేక సిబ్బంది ఉండటం వలన ఆకస్మిక దాడులు జరిపి అటవీ సంపదను అపహరించేవారిని తేలిగ్గా పట్టుకోవడం జరుగుతున్నది. కొన్ని కొన్ని చోట్ల అగ్ని ప్రమాదాలు సంభవించి అటవీసంపద నాశనమైపోతూ వుంటుంది అందువలన అటవీశాఖ అగ్ని నిర్వాపక దళాన్ని విస్తృతం చేసింది.

అడవులలో లైసెన్సువున్న పశువులు మేయవచ్చును. ఆ లైసెన్సుల మూలంలో అటవీశాఖకు చాల ఆదాయం వస్తుంది. అలాగే అడవులలోని కలప, వంట చెరకు విక్రయం వలనకూడ చాలా ఆదాయం వస్తుంది అటవీ సంపదలో వెదురు, మంచి గంధపు చెక్కలు, తేనె, జిగురు, కుంకుడుకాయలు, ఉసిరికాయలు లాటివి కూడ విక్రయించబడుతాయి.

అడవులతో సన్నిహిత సంబంధం ఉండే గిరిజనులకు అడవులలోని ఉద్యోగాలలో ప్రాధాన్యం యివ్వబడుతుంది. వారు అడవులలోని చిన్న చిన్న వస్తువుల్ని సేకరించి గుర్తించబడిన మార్కెట్లలో విక్రయించవచ్చును వారు రిజర్వుకాని అడవులలో "పోడు" సేద్యం చేయడానికి కూడ అనుమతించబడుతారు.

అటవీసంపద పరిరక్షణ, శాస్త్రీయ పద్ధతులలో త్వరిత గతిని కొత్తగా మొక్కల్ని నాటడానికి విస్తృతమైన పరిశోధనా కృషి కూడ జరుగుతున్నది. బాపట్ల రీసెర్చి గార్డెన్, అంబాపరం (నెల్లూరు). ఓబినగర్, కడెం, జీడిమెట్ల పరిశోధనాలయాలు యీ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

అటవీశాఖ చేస్తున్న కృషి అంతటిలోనూ ప్రధానమైనది హైదరాబాద్ లో మీర్ ఆలం చెరువు సమీపంలో 300 ఎకరాల సువిశాల భూభాగంలో నిర్మిస్తున్న సుందరమైన జూయలాజికల్ గార్డెన్స్ 1958 లో ప్రారంభమైన యీ కృషి క్రమాభివృద్ధిలో వుంది. తృతీయ పంచవర్ష ప్రణాళికాంతానికి యీ పార్కు నిర్మాణం పూర్తి కాగలదని ఆశించబడుతున్నది. ఇంత విశాలమైన 'జూ' ఆసియా ఖండంలోనే లేదు. దీనికి మొత్తం రు. 45 లక్షలు ఖర్చవుతుంది.

వన్య మృగ రక్షణ పథకం క్రింద రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో కొన్ని పక్షులు యితర జంతువుల పరిరక్షణ కేంద్రాలు నెలకొల్పబడినవి అనేక రకాల జంతువులు మీర్ ఆలం 'జూ' లో కూడ ఉంటాయి. జంతు, వృక్షశాస్త్ర విద్యార్థుల పరిశోధనలకు అవసరమైన అన్ని రకాల Species ను యీ 'జూ' లో ఉంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

ఈ 'జూ' నిర్మాణం పూర్తయిన తరువాత రాజధానీ నగరంలోని ప్రజలకు సాయం సమయాలలో వినోద కాలక్షేపం కావడమే గాక విద్యార్థులకు కూడ ఎంతో ప్రయోజనం కలుగుతుంది.



# సూక్తిసుధా తరంగిణి

**"మహతీ శంకర్"**

"సంసార కటు వృక్షస్య ద్వేఫలే హ్యమృతోపమే
సుభాషిత రసాస్వాదః సంగతి స్సజ్జనైస్సహ—"

సుభాషిత రసాస్వాదము, సజ్జన సాంగత్యమనునవి సంసారమను కటు వృక్షమునకు అమృతోపములయిన రెండు ఫలములు. 'సుభాషితము–సూక్తి' అను పదములు సమానార్థకములు. 'మంచి మాటలు' అని ఆ పదముల కర్థము. మాటలు చాల శక్తిమంతములైనవి. ఒక్క మాట సహాయముతో రాజ్యములనుసైతము నిర్మింపవచ్చును. ఒక్కమాట సహాయముతోనే పెద్ద పెద్ద కోటలనైనను కూల్పవచ్చును.

నన్నయ భట్టారకుడు 'నానారుచిరార్థసూక్తినిధి'. ఆంధ్ర మహాభారతము 'ధర్మతత్త్వజ్ఞులకు 'ధర్మశాస్త్రము. అధ్యాత్మవిదులకు వేదాంతము. నీతి విచక్షణులకు నీతి శాస్త్రము. కవి వృషభులకు మహాకావ్యము' మహాభారతము పరమ ప్రయోజనము 'జగద్ధితము' ఆ పరమ ప్రయోజనము వివిధ పాత్రలముఖమున, వారుపదేశించిన వివిధములైన సూక్తులమూలమున వ్యక్తమగుచుండును. శ్రీనాథ మహాకవి "కదలు మిటమూని దివిజ గంగా భవాని" యని ప్రార్థించినంతనే. గంగాదేవి గట్లు త్రెంచుకొని పొంగి పొరలినదట! అట్లే "రాము నమోఘబాణమును, రాజశిఖామణి కంటి మంటయున్...వేములవాడ భీమకవి వీరుని తిట్టును రిత్తవోవునే" అను పద్యమువలన భీమకవి వాఙ్మహాత్మ్యము తెలియుచున్నది. అనాడు కవులకు అంతి 'వాక్ శుద్ధి' యుండెడిది వారి వాక్కులు వేదవాక్కులవలె అత్యంతము శక్తిమంతమైనవను విషయము స్పష్టము.

కొందరు ఇంపుగా సరసముగా చమత్కారముగా మాట్లాడగలరు సమయస్ఫూర్తి కలిగిన అటువంటివారు ఎంత సేపు మాట్లాడినను వినవలెనను కుతూహలము పెంపొందుచుండును. వారితోడి సహవాసము విజ్ఞానాత్మకముగా వినోదాత్మకముగా నుండును. మరి కొందరి మాటలు మోటుగా పరుషముగా సరసత్వము లేక యుండును. వారి పలుకులు ఇతరులకు తలనొప్పిని కలుగజేయును గాని ఉల్లాసముగా నుండవు. మరి కొందరు 'మహాత్ములు' ఎదుటి వారు వినుచున్నను లేకున్నను పట్టించుకొనక వారి కార్యక్రమమును వారు సాగించుచుందురు. మనకు దైనందిన జీవితములో కనిపించు మాటకారులు ఈ విధముగా మూడు రకములుగా నుందురు.

సాహిత్యములో 'సూక్తి వైచిత్ర్యము' పాఠకుల హృదయములకు పరమానందమును కలిగించును. సాహితీవ్రతుడు వివిధ పాత్రల ముఖమున సూక్తులను ప్రబోధించును. రాయబారులకు ఉక్తినైపుణ్యము అధికముగా నుండును. భారతములోని శ్రీకృష్ణుని రాయబారము, విదురుని రాయబారము, శృంగార నైషధములోని నలుని రాయబారము, పల్నాటి వీరచరిత్రములోని భట్టు రాయబారము ఆయా వ్యక్తులకుగల వాక్చమత్కృతిని వాఙ్నైపుణ్యమును నిరూపించును రాయబారులు వారి భావములను సూటిగా ప్రత్యక్షముగా చెప్పరు. వారి మాటలలో వెనుకదాగి యుండు భావమును, ఎదుటి వారు తమ ఆలోచనాశక్తితో గ్రహింపవలయును వారి వాక్యములలో కొంత 'ధ్వని' అంతర్భూతమై యుండును. కవిత్వములో వ్యంగ్యమునకు ఉన్నత స్థానమున్నదను విషయము సర్వపండిత సమ్మతము.

ఉక్తి యుక్తి యున్నవారికి అసాధ్యము లేదు. వాక్ చమత్కృతి కలిగిన ప్రతిభావంతులు సందిని పందిగా పందిని నందిగా నిరూపింప గలరు సూక్తి వైచిత్రి అనేక విధములుగా నుండును.

ఒక పడతి భర్తను పిలుచుకొని రావలసినదిగా చెలికత్తెను పంపినది. ఆమె కొంత కాల మనంతరము తిరిగి వచ్చినది. తరు

వాత వారిద్దరి మధ్య ఈ విధముగా సంభాషణము జరిగినది—

"అక్కరో! నీవు వల్లభుం డహంకృతిం జేసినవేళ వింటివా?"

"యొక్కడ నెక్కడే మరియు నెవ్వరి నెవ్వరి ?" "నన్నెనన్నె"; "నీ వక్కడ కేలపోవలయు:"; "నంపన"; "యంపితిం గూడుమంటినా?"

"మ్రొక్కితి వేడుకొంటి నను ముట్టకుమంటి! నికేమి చేసెదన్"

చెలియ చెప్పదలచుకున్నది "అమ్మా! నీ భర్త కామమోహితుడు స్త్రీలోలుడు." అను విషయము. ముందు చెలికత్తెనని గుర్తునకు వచ్చునట్లు మ్రొక్కితిని తరువాత అనుచిత కార్యమని వేడుకొంటిని. చిట్టచివరకు కోపముతో 'నను ముట్టకు మంటిని'— అను చెలియ వాక్యములు "కామాతురుడైనవాడు ఎటువంటి అనుచిత కార్యము చేయుటకును వెనుదీయడు" అని బోధించుచున్నవి. యజమానిని మోహింపజేయు ఆ చెలికత్తె సౌందర్యాతిశయము పాఠకులు గ్రహింపగలరు. ఇట్లు అసలు సంగతి చెప్పకుండ. మిగిలిన వానిని చెప్పుట "నర్మ భాషణము" అందురు.

కొందరి పలుకు పలుకును రసవంతముగ నుండును ఈ క్రింది పద్యములోని చమత్కారమును గ్రహింపుడు—

"కౌనా పేదలకెల్ల పేద! పలుకా కర్పూరఖండంబు! నె
మ్మేనా పైడిశలాక! ముద్దుమొగమా మేలైన క్రొత్తమ్మి! కొ
ప్పా నీలంబుల కప్పు గప్పు! నెఱీ చూపా కంతు చేతూపు! ని
న్నీ నేనా నుతియించువాడ దగవా యీ మాట బింబాధరీ—!"

ఒక ప్రియుడు తన ప్రేయసితో పలుకుచున్నాడు. "నీది నడుమా—అది పేదవారిలో పేదవంటిది. (మిక్కిలి సన్నమైనది)— నీది పలుకా—అది కర్పూర ఖండము (చల్లనైనది)— నీది శరీరమా—అది బంగారపు ముక్క (సువర్ణ వర్ణము) నీ ముఖమా—ఇది మేలైన పద్మము (పద్మముఖి యని భావము) నీ కొప్పా—అది నీల మేఘము కప్పును గప్పును. (నీల కేశములు) ఇక నీ చూపుమాటయా— అది సామాన్యపు చూపు కాదు—"మన్మధుని తూపు! ఇటువంటి నిన్ను నేను నుతియించుచున్నానా? నిన్ను పొగడుచున్నానని యనుట నీకు న్యాయమా?—" ప్రియుడు వర్ణించవలసిన వన్నియు సంపూర్ణముగా వర్ణించి, నేను పొగడుచున్నానా యని యడుగుటలోనే కవిత్వమున్నది. అది సహృదయులు ఆనందింపగల సరస కవిత్వము ఇటువంటివి 'సరసోక్తులు'.

కొన్ని పద్యములలో అర్థము సామాన్యముగా నున్నట్లు కనిపించును. 'లోనారసి' చూచిన అర్థము అన్యముగా నుండును; అనగా వేరొక రకముగా నుండును. వీని 'అన్యోక్తులు' అని సంభావింప వచ్చును. ఈ క్రింది పద్యమును చిత్తగింపుడు:—

"ఎవ్వడ వీవు కాళ్ళు మొగ మెఱ్ఱన?"
"హంసమను"
"ఎందు నుందువో?"
"దవ్వుల మానసంబునను".
"దాని విశేషములేమి తెల్పుమా?
"మవ్వపుఁగాంచనాబ్జములు మౌక్తికముల్ గలవందు;"
"నత్తలో?"
"అవ్వి యెఱుంగము"—అన్ననహహాయని నవ్వెబకంబు లన్నియున్.

హంసను చూచి కొంగలు నవ్వినవి నత్తలను ఎరుగని హంసను చూచి అల్పములైన కొంగలు నవ్వినవి ముఖ్యముగ చూచిన హంస నత్తలను చూడలేదు. అది తెలివి తక్కువ దనమని తెలివి తక్కువ కొంగల భావము. మానస సరోవరములో నివసించు హంసను బకములు పరిహాసించినవి. ఇది ఈ పద్య భావము—అని అనిపించును. 'పరమ మూర్ఖులు, అత్యంతము అల్పులైనవారు సత్పురుషులను పరిహసింతురు' అను ఒక నీతిని కవి బోధింపదలచినాడు. అందువలననే నత్తలు తప్ప మరేమియు నెరుగని మూర్ఖమైన కొంగలు మానససరోవరమందుండు హంసను చూచి నవ్వినవని చెప్పినాడు. ఈ విషయమును రమ్యమైన సంభాషణరీతిలో చెప్పుటయే 'అన్యోక్తి'.

కొందరు ఇతరులపై అప్పుడప్పుడు 'ఛలోక్తులు' విసరుచుందురు. కొన్ని వేళలలో ఆ ఛలోక్తులు ఎదుటి వారికి కోపము కలిగించ వచ్చును. పరిహాసము చేయుచున్నట్లున్నను ఆ ఛలోక్తులకు ఒక మధురమందహాసమే సమాధానము. ఛలోక్తులలో విచిత్రమేమన పొగడుచున్నదియు, తెగడుచున్నదియు స్పష్టముగా

తెలియదు కొంచెమాలోచించిన అన్నియు అవగతమగును. ఈ పద్యము చూడుడు:.

"మా కలిమిండి కామయ కుమారకుఁడన్నిటఁ దండ్రి వైఖరే
కాక తదన్యుడెట్లగును? గాడిదకుం దురగంబు పుట్టునే?
చే కొని కొంకి నక్కకును సింగము పుట్టునె? మాలకాకికిం
గోకిల పుట్టునే? చిరుత కుక్కకు మత్తగజంబు పుట్టునే?"

'కామయగారి కుమారునకు సాక్షాత్తుగా తండ్రి వైఖరియే వచ్చినది. అవును మరి. కుమారునకు తండ్రి వైఖరి కాక మరెవ్వరి లక్షణములు వచ్చును? గాడిదకు గుఱ్ఱము పుట్టునా? కొంకి నక్కకు సింగము పుట్టునా? కాకికి కోకిల పుట్టునా? కుక్కకు ఏనుగు పిల్ల పుట్టునా?—అని ఈ పద్య తాత్పర్యము. దీని వెనుక యెంతయో అర్థమున్నది. ఈ పద్యపాదములలోనున్న ఉదాహరణలలోని మొదటి నామవాచకములన్నియు తండ్రికి సమన్వయించునను విషయమును గుర్తించిన కడుపుబ్బ నవ్వవచ్చును. ఇటువంటి చాటూక్తులు సమయస్ఫూర్తికి ప్రత్యక్ష నిదర్శనములు.

ప్రశంసలకు లొంగని వాడుండడు. దేవుడు కూడ భక్తుల ప్రశంసలకు ముందు పొంగిపోయి తరువాత లొంగిపోయి వరము నిచ్చి అస్పృశ్యమగును. అయిన ప్రశంసోక్తులలోను కమ్మని కవిత్వముండును—

"అధిపతి కృష్ణరాయడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకుం దిగు సురప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తి కజ్జలము వేమఱుఁబెట్టి పఠించు నిచ్చటన్".

కృష్ణారాయలు కళింగ రాజును జయించెనను విషయము చెప్పవలసినది ఆ విషయమును రాయలు జయించిన నానా దేశ వృత్తాంతముల జయస్తంభముపై లిఖించెననియు, ఆ జయస్తంభమును సింహాచలస్వామి తిరునాళ్లకు వచ్చు దేవతలందరును కళింగ రాజు అపయశస్సు అను మసి బూసి చదువుచుందురని కవి చెప్పినాడు. ఇట్లు అతిశయోక్తిగా చెప్పుట సాధారణముగా చూచుచున్న ప్రశంసయే,

తిరుమల రాయని గూర్చి చెప్పబడిన ఈ పద్యమును చూడుడు:—

" అన్నాతి గూడ హరుడవు;
అన్నాతిని గూడ కున్న అసుర గురుడవో:
దన్నా తిరుమల రాయా?
కన్నొక్కటి మిగిలె కాని కౌరవ పతివే: "

మొదటి పాదము చదువగానే 'ఆహా! తిరుమల రాయడు శివుడే!' యనుభావము కలుగును రెండవ పాదమునందు రాయని శుక్రాచార్యునితో పోల్చును. అంతియే గాక' కన్ను ఒక్కటియే పోయినది కాని లేనిచో నీవు ధృతరాష్ట్రుడవే' అని కవి యనును ధృతరాష్ట్రుడు జాత్యంధుడు నీకు ఒంటికన్నైనా ఉన్నది— అని పరిహాసము. ఈ విధమైన ప్రశంసలలో సహృదయులు కవితావైచిత్ర్యమునే సంభావింతురు.

కొన్ని కొన్ని సమయములలో పరుషోక్తులవసరము వీరోచితముగా పలికిననే గాని కొన్ని ప్రమాదములు తప్పవు. కీచకుడు ద్రౌపదిని వెంబడించినాడు— మితిమీరిన కీచకునితో వీరవనిత ద్రౌపది పలుకుచున్నది—

" దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోకస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యా పారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవు; రిపు నిమవోర్క్లిలన్ వెసన్ గిట్టిగం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం
గీచకా"—

'కీచకా! నాపతులు గీర్వాణాకృతులు. అందును ఏవురు. ఎల్లరు గర్వాంధ ప్రతివీరులను చంపుట యను విద్యలో నారి తేరిన వారు. అందువలన వారిచేతిలో, నాకారణముగా— నీ మానమును, ప్రాణమును హరించుట తథ్యము. సమయమునకు తగిన సంభాషణ రీతి అందరకు తెలియక పోవచ్చును. ద్రౌపదివంటి వీరకాంతలు పతివ్రతల ఆత్మ స్థైర్యమునకు ప్రత్యక్ష నిదర్శనములు. ఇట్టి వానిని "వీరోక్తులు" అందురు.

కవులు తమ కావ్యములలో వ్రాసిన పద్యములనే గాక అయాప్రదేశములలో రాజాస్థానములలో సంచరించునపుడు ప్రసక్తాను ప్రసక్తముగా కొన్ని పద్యములు చెప్పుచుందురు. వానినే 'చాటూక్తులు'ని వ్యవహరింతురు, ఒకపర్యాయము శ్రీనాథుడు పల్నాటిసీమలో తిరుగుచుండగా దాహమయ్యెనట! సమీపములో

మన్న చెఱువు వద్దకు వెళ్లి, దానిలో నీరు లేకపోవుట చూచి శివుని ప్రార్థించినాడు " ఓ స్వామీ- శివంకరా శంకరా:-

" సిరిగల వానికి జెల్లును
దరుణుల పదియారు వేల దగ బెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా?
పరమేశా! గంగ విడుము పార్వతి చాలున్"

ఈ పద్యమును చదివి శ్రీనాథుడు శివుని భార్య నా కాంక్షించినాడని పొరపాటున నైనను తలంపరాదు. శ్రీనాథునకు కావలసినది గంగాదేవి. ( మంచినీరు ) అంతేకాని శివుని భార్యగా కాదు. గంగ కావలయునను తన కోరికను చమత్కారముగా " స్వామీ! ధనవంతుడైన కృష్ణుని వంటి వానికి గానీ పేక్రొలది భార్యలు తిరిపెముతో నీకేల నయ్యా ఇద్దరు భార్యలు? గంగనిమ్ము తండ్రీ!" యని ప్రార్థించుట సరసముగా నున్నది.

ఆంధ్ర సాహిత్యములో నెన్నియో శతకములు గలవు. నీత్యుపదేశము ధర్మోపదేశము పరమ ప్రయోజనము గాగల సుమతీ శతకము, భాస్కరశతకము, వేమనశతకములతో బాటు మహాకవి భర్తృహరి సుభాషితములు ఎంతయు విజ్ఞానాత్మకములుగా నున్నవి. అవన్నియు ఇంటింటను పారాయణము చేయబడు చున్నవి. కావ్యములు సంఖ్యకు ఎక్కువగా వ్రాయనవసరము లేదు రత్నము వంటి ఒక్క వాక్యమే ఒక కావ్యముతో సమానము. ' వాక్యం రసాత్మకం కావ్యం.' దేనికైనను ' ఆనందో బ్రహ్మ' యని పింపగల శక్తిమాత్రము ఉండవలెను.

పసముత్య మొకటి చాలును
గసవూర్చెడు చింపిరాలు గంపెండేలా;
రసికుం డొక్కడె చాలును
రసహీనులు పలువురేల? రాయబాచా!



విశ్వ మొక కావ్య. ముందు జీవించుచున్న
సుఖ విషాద గేయముల నెంచుకొని నీవు
హాయిగా పాడుకొను. మిష్టమైన వాని.
పద పదమ్మున రాగమ్ము పల్లవింప!

"మధుగీత"

# మాతృ సేవ

"సోమనాథ్"

మూగ వాడివలె చూచెదవేలర?
మాస వాళి ఉత్సాహపు కోలాహలము—
వినిపించుట లేదా? నీకు
కనిపించుట లేదా?

మాతృదేశ పురోవృద్ధికై
మన వారందరు శ్రమించుచుండగ—
మూగ చూపులతో
నిలిచెద వేటికిరా?

మూలబడిన మన పరిశ్రమలు
మరల సాగుచున్నవిరా!
మూలబడిన మన వ్యవసాయం
మరల సాగినదిరా!

భారత భూమిని
ప్రపంచ దేశాలతోటి—
ముందుకు నడిపెడి
మహాయజ్ఞమున పాలు గొనక—

మూగ వాని వలె
చూచెద వేటికిరా?
మాతృ సేవకై
ముందుకు రావేలా?

కథానిక:

# పంచ భూతాలు

శ్రీ రాపూరి భరద్వాజ

## మూడవ భూతం చెప్పిన కథ

నా పేరు లలితాంబ. ఆయన పేరు — సిగ్గెందుకులేండి: పురుషోత్తం. పుర్రెతో పుట్టిన బుద్ధి పుడకలతో గానీ పోదని ఈ మనిషి కెంత చెప్పినా ఇంతే! ఆయనకు తోచనూ తోచదు, ఎదటి వాళ్ళు చెబితే వినిపించుకోనూ వినిపించుకోరు. నేనేదన్నా ఒకటికి రెండు సార్లంటే నీకు తెలీదులే ఊరుకోవోయ్ అంటాడు. ఏదో సామెత చెబుతారే కొమ్మెర్లవాడికి లోకమంతా పచ్చగా కనపడు తుందని — అలా ఉంటుంది మా వారి పరిస్థితి. అదేం మనిషో, ఏమోగానీ, ఎంత సేపటికీ ఆ గోతిలోనించి పైకి రాడు. గానుగెద్దులాగా గుండ్రంగా తిరుగుతూ ఉంటాడు. తిరిగిన దూరం, పైకెళ్ళకు మెళ్ళ ఉంటుంది. కానీ, జరిగిన దూరం అంగుళం కూడా ఉండదు. పైగా పెద్ద ప్లీడర్నంటాడు. కోర్టులో ఎలాంటి కేసునైనా తలక్రిందులు చేస్తానంటారు. చేస్తే చేస్తారేమోగానీ—ఎప్పుడూ ఆదే ధోరణయితే ఎలా?

ఓ క్లబ్బు లేదుగదా, సొసైటీ లేదుగదా మందితో పరిచయం చేసుకోడం లేదుగదా, ఎప్పుడూ ఆ కేసు లేటో, ఆ పార్టీ లేటో దబ్బులేంధేమిటోతప్ప— మిగతా ప్రపంచం ఆయనకు తెలీనే తెలీదు. ఆయన్ని వెన్ను కాచుకొని ఉండలేక నానాటికీ నరాలూ తెగిపోతున్నాయి.

మొన్న మట్టకు మొన్న హరికేశవరావుగారు, ఎవరికో టీ పార్టీ ఇస్తూ ఇన్విటేషన్ పంపించారు. 'పోదామంటే' 'ఎందుకు లెస్తూ, అంటాడు. ఈ లోగా ఈ కేసు సంగతేమిటో చూసుకొంటాగదా?' అంటాడు. అంతేగానీ, ఆ పార్టీకి వెళ్ళడం వల్ల, ఎంత లాభం ఉంటుందో ఆయనకు తెలీదు. చెప్పినా వినిపించుకోడాయె! ఎలా చచ్చేది?

హరికేశవరావుగారంటే తాలూకోలీ మనిషి కాదాయె! పోలెడంత పలుకుబడివున్న మనిషాయె! అటువంటివాడు, కాదు మీదొచ్చి టీ పార్టీకి రమ్మనమంటే ఎగిరిగంతేసి వొప్పుకొంటారా జాగారిపోతారా మీరే చెప్పండి?

ఆ పార్టీకి వెళ్ళడం ఎంతమంచిదయిందని? ఎంత మంది పెద్ద వాళ్ళు కనిపించారని కాస్త ఆలస్యంగా వెళ్ళినా మనోహర్‌గారి సీటుకు ఎదురుగావున్న సీటు దొరికింది. నాకాసీటు దొరికిందని, రత్నాబాయికి ఒకటే ఏడుపు. దాని ఏడుపు చూస్తుంటే, నాకింకా ఏడిపించాలనిపించింది చెప్పొద్దూ? అందుకని పనివున్నా లేక పోయినా, మనోహర్‌గారి మాటల్లో కలగచేసుకొన్నాను. కలెక్టర్ గారిని స్మాల్ సేవింగ్స్‌ను గురించి అడిగాను. మీలాంటి వారంతా పూనుకోవాలమ్మా అన్నారాయన. ఆ మొహ్మాటానికైనా, వార్ని కలుసుకొని, ఐదు వేల రూపాయల బాండ్లు కొన్నాను.

దానికో యజ్ఞం చేసినంత హడావుడి చేశారాయన. అనవసరంగా ఐదు వేలూ పోసి ఇవి కొనకపోతేనేం? అంటాడు. నేనెందుకొన్నానో ఆయనకేం తెలుసు చెప్పండి? కలెక్టరు పింతల్లి రెండో కొడుకు బావమరిది ఎమ్మెస్సీ చదువుతున్నాట్ట. ఇంకా పెళ్ళి కాలేదుట, తండ్రి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా గుంటూరులో పనిచేస్తున్నారట. రెండో, మూడో మేడలున్నాయిట. 'పారిస్ బొమ్మలా ఉంటాడమ్మా' అన్నది భాగ్యం. 'మీ పిల్లకు ఈడూ జోడూ బాగా ఉంటుంది. ఓసారి వెళ్ళి చూసిరాండి' అని కూడా భాగ్యంబగారన్నది. ఈ మనిషి కదలందే?

అసలు శకుంతలకు పెళ్ళి చెయ్యాలన్న ఉద్దేశమే ఆయన కున్నట్టు లేదు. నేనీమాట అన్నప్పుడల్లా 'మా కష్టడికేంతీ పరమా'? అంటాడు. నాకింతలో ఊపిరుండదు, శకూను. ఆ కష్టుడికిచ్చి నిస్తానా? ఎందెకరాల పొలం ఉండంగానే సరా? నా కూతురు పెళ్ళి, ఆ పెంకుటింట్లో, వడ్ల బస్తాల మధ్య గవిడి గేదెల మధ్య కాపరం చెయ్యాలా? గూళ్ళు పడిపొయ్యేలాగా ఇంటి చాకిరంతా చెయ్యాలా? డక్కుమాలిన ఊళ్లో సోడా కూడా దొరకదుగదా, నా తల్లిని అక్కడెలా ఇవ్వను చెప్పండి? మేనల్లుడైతే, పదివేలిచ్చుకోమనండి; నేను కాదన్ను. ఉద్యోగం వెలగ బెడతానంటే, హరికేశవరావుగారితో చెప్పి, మూడు నిమిషాల్లో వేయిస్తాను. అంతేగాని పిల్లదాని గొంతు కోస్తానంటే ఎలా?

ఈ మనిషితో, ఈ ముప్ఫయ్యేళ్ళనించీ ఎలా నెట్టుకొస్తున్నానో, నాకు తెలుసు; ఆ భగవంతుడికి తెలుసు. దాని చదువప్పుడూ అంతే పేచీ. 'కాపరం చేసే ఆడదానికి చదువెందుకే నీ బొదస్థం గాక పోతే!' అన్నారు. ఎంత బాప్పరస్ పెట్టేనో చూడండి! నేనే పట్టు పట్టి కాలేజీలో చేర్పించాను. అదృష్టవశాత్తూ అమ్మడికి నా పోలికలు వచ్చాయి గనక సరిపోయింది; వాళ్ళ నాన్నలాంటి దయిందో—ఎప్పుడో గుండె కాస్తా ఆగిపోయి చచ్చి వుందును.

అసలు ఆయన చెప్పినట్టు ఏనేనాడయితే నాకీ బదనలన్నీ ఎందుకు చెప్పండి? ఒకటికెన వేలిమీద చక్రాన్ని తిప్పుపోయానూ. అనకూడదు గానీ, ఆంటీయంగారికిన్ని కేసులెలా వస్తున్నాయో, యేమో తెలుసా? రాంమోహనరావుగారితో పరిచయం ఉండబట్టి, ఆయన నా ముఖం చూచి కేసులిన్ని పంపబట్టిగానీ లేకపోతే గోళ్ళు గిల్లుకొంటూ కూచోవలసిన మనిషి కాదూ? పైగా ఆయనతో పూసుకు తిరుగుతున్నానని గొణుగుతాడు 'ఆ పిల్లవాణ్ణి కాస్తా పాడు చేస్తున్నావే!' అంటాడు నా కూతురు నాతోబాటు మీటింగులకు, పార్టీలకు వస్తే తప్పేమిటట? ఎంత లేసి వాళ్ళతో పరిచయాలవుతాయి? అప్పటికప్పుడు క్షణాల మీద లాభాలుండకపోతే ఉండవేమోగానీ దరిమిలా ఎంతలేసి పనులన్నా చేయించుకోవచ్చు. ఆ ఆలోచనే ఈ మనిషికి లేదాయె!

మొన్నమొట్టుకు మొన్న, శకుంతల ఆ అబ్బాయితో సినిమాకు వెళ్ళిందని, రెండు రోజులపాటు గొణుక్కున్నాడు. ఏం చెప్పమంటారు? అతనెవడో చవట సన్నాసయితే ఆయన గొణుక్కున్నా అర్థముంది బంగారంపిచ్చుకాయె వాళ్ళ నాన్న బోలెడన్ని కంట్రాక్టులు చేస్తుంటాడు. లక్షలు ఏనాడో దాటిపోయాయట. హరికేశవరావుగారికి బాగా తెలుసునట కూడాను. అటువంటి వాడితో సినిమాకెడితే తప్పేముంది? అయినా 'ఒకసారి భోజనానికి పిలుచుకురావే' అన్నాను. రేపో మాపో చెబుతానంది. నాతో బాటు పది మందిలోకీ రాకపోకళ్ళు తెలిసింది గనక, శకుంతల అతన్ని పట్టుకోగలిగింది దాని తెలివితేటలు చూస్తుంటే ఒక్కోసారి నాకే ఫిట్సు వొస్తాయేమో ననిపిస్తుంది. దానికి మాలావు చొరవుంది. వాళ్ళ నాన్న ఇంకా బిగపట్టి ఉంచబట్టిగానీ. లేకపోతేనా...

అది పుట్టంగానే. జమీందారు పెళ్ళామవుతుందన్నారు అంతా! దాని చక్కదనం అలాంటిది. ఎన్ని వేల మందిలో ఒక్కరికుంటుందంటారు, దాని అందం! హరికేశవరావుగారు నాతో ఎన్నోసార్లన్నారు 'మరో పదేళ్ళు చిన్నవాణ్ణయితే మీ అమ్మాయిని బలవంతానైనా పెళ్ళాడి ఉందు' నని, ఆలా చెప్పుకొంటూపోతే బోలెడన్ని! భగవంతుడి దయవల్ల ఈ ప్రసాదు సంబంధమే అయితే, అమ్మాయిని, ఆలిండియా ఫిగర్ను చేసి పారేయనూ, అతనికి కట్టుకుపోయినంత డబ్బుందిట. ఇక ఆలిండియా ఫిగర్కా కేంచేస్తుందేమిటి? డబ్బుతో కొండమీది కోతిని దింపొచ్చు. కాలేజీ నించి వస్తూనే అతని దగ్గర కెళ్ళింది అమ్మడు. బహుశా ఇవ్వాళో రేపో, అతన్ని లాక్కొస్తుందనుకొంటాను. ఇదేదో తేలిందాకా, నాకు నిద్ర పట్టడం లేదంటే నమ్మండి!

## మూడో భూతం చెప్పిన కథ

నా పేరు శంకరం. బహుశా మీకు చాలా పరిచితుణ్ణయి ఉంటా ననుకొంటున్నాను. 'లంగాలో సింగరు మిషను' అన్న సాంఘిక చిత్రానికి అసిస్టెంట్ డైరెక్టరుగా పని చేశాను. అంతకు ముందు నేను పని చేసిన మరో నాలుగు సినిమాలు ఇంకా బయటికి రాలేదు. ఆ ప్రొడ్యూసర్లు పరమ చవటలు కావడంవల్ల. ఆ చిత్రాల్లో నేను చూపిన టెక్నిక్ బయటపడే అవకాశం లేకుండా పోయింది. అవే విడుదలై ఉన్నట్లయితే, ఈ నాటికి నేను ఆకాశంలో ఉండి ఉందును.

'లంగాలో సింగరు మిషను' చిత్రం వారం రోజులు తిరక్కుండానే మద్రాసు రావడానికి నేను కారణంకానే కాను, అసలా కథే అలాంటిది. దాని రచయిత, ప్రొడ్యూసర్ని బాగా కాకాబట్టి బుట్టలో వేసుకొన్నాడు డైరెక్టరు ప్రొడ్యూసరు చెప్పిందల్లా చేసి, తన డబ్బు ముందుగానే రోల్లు కొన్నాడు పిక్చరు సగబడనన్నా కాలేదు తెచ్చిన డబ్బంతా అయిపోయిందన్నాడు ప్రొడ్యూసరు. డబ్బివ్వందే షూటింగులకు రానని హీరోయిను ఖరాఖండిగా చెప్పేసింది. అప్పుడు నేనే డిస్ట్రిబ్యూటర్సును పట్టుకుని బొమ్మను బైట పడేశాను. స్టూడియో అరువేయించాను. పోస్టర్లు అరువేయించాను. పబ్లిసిటీ అరువేయించాను. ఇంత చేసినందుకు నాకు మిగిలిందల్లా, టైటిల్సులో పేరు పడటం. అదీ బ్రహ్మ ప్రళయ మయిపోయింది

కానీ. ఈ పిక్చరువల్ల నేను చాలా లాభించాననుకోవచ్చు. ఫీల్డులో ఉన్న చిన్నాపెద్దలతో పరిచయమయింది. నేనెప్పటికన్నా సొంత పిక్చరు తీయాలనుకుంటూ జరిగితే, చాలా మంది నాతో కో-ఆపరేట్ చేస్తామన్నారు. ఊరికినే యాక్టు చేస్తామన్నవారు కూడా ఉన్నారు. అంతకుముందే నా దగ్గర బోలెడంత తిని ఉన్నారు గనక పత్రికల వాళ్ళు. పబ్లిసిటీ కూడా ఫ్రీగా ఇస్తామన్నారు. ఇంక కావలసిందేమిటి గనక? కథేదో నా దగ్గర ఉండనే వుంది. డైలాగ్సు నేనే రాసుకొంటాను. నలుగురు కవుల్ని పట్టుకొంటె. నాలుగు పాటలు ఎలాగు దొరుకుతాయి.

చాలా మంది 'ప్రజలు ప్రజలు' అంటారు గానీ. దానికి బొత్తిగా అర్థం లేదంటాను. ప్రజదేముందండీ, ఏది చెబితే అది

వింటారు, ఏంచూపిస్తే అది చూస్తారు. దిక్కుమాలిన ఆశయా లేవో పెట్టుకొని నష్టపోవడమన్న ప్రసక్తే లేదు. లక్షలు బెట్టి సినిమా తీయడం, లక్షలు సంపాదించడానికిగాని, జనాన్ని ఉద్ధరించ డానికి కాదు ఆ పని చెయ్యడానికి రాజకీయ నాయకులున్నారు. వాళ్ళ గొడవేదో వాళ్ళను పడనివ్వండి. మధ్యలో సినిమా నెత్తికి ఈ బరువెందుకా అని ?

పాత ముఖాలతో జనం విసిగిపోయారన్న సంగతి నా కెప్పుడో తెలుసు. కానీ, ఈ ప్రొడ్యూసర్లు వాళ్ళని వదలరు. వదిలితే డబ్బు రాదని వాళ్ళ భయం. ఈ భయానికి అర్థం లేదంటాను. కథలో బెంపో ఉండాలేగానీ, పరమ కొత్త ముఖా ల్ని తెచ్చి, లక్షలు కక్కించొచ్చు. అంతా డైరెక్టు చెయ్యడంలో ఉంది. నేనయినా, మరీఅంత సాహసం చెయ్యాలనుకోవడం లేదు మొత్తం పిక్చరులో ఆరుగురు హీరోలు, పన్నెండు మంది హీరోయిన్లనూ పెట్టి అందులో సగం మంది హీరోయిన్లను, ఇంటర్వెల్ దాటకుండానే చంపేసి, మిగతా ఆరుగురితోనూ, చివరి సీన్లు లాగించేస్తాను. ఇంత మంది హీరోయిన్లెందుకని మీరడక్కండి. నా పిక్చరులో అంతమందీ ఉండవలసిందే ! అదే దాంట్లో ఉన్న నావెల్టీ. వీరందర్నీ పాతవారినే పెట్టటం నా కిష్టం లేదు. సగం మంది కొత్తవాళ్ళను—టాలెంటెడ్ పీపుల్‌ను—తెరకు పరిచయం చేయాలనుకొంటున్నాను. ఆంధ్రుల్లో ఉన్న కళాపిపాస నాకు తెలియంది కాదు గనుక, కొత్తవారు దొరకరేమోనన్న భయం నాకు లేనేలేదు. ఎందుకైనా మంచిదని నా ప్రోగ్రాం ముందుగానే పత్రికల్లో వేయించాను. చిత్రమేమిటంటే, నేను కొన్నదానికన్నా రెస్పాన్సు బ్రహ్మాండంగా ఉంది. రెండు రోజు లుండాలనుకొన్న చోట, వారం రోజులదాకా ఉండాలిసొస్తోంది. వీళ్ళందరూ తెరకు పనికొస్తారని కాదు గానీ, వీరిలో ఉన్న ఉత్సాహాన్ని తక్కువ అంచనా వేయడానికి లేదు.

ముందుగా నన్ను నిరుత్సాహ పరచినవారు చాలా మంది ఉన్నారు 'కొత్త వాళ్ళతో ఎక్కడ తంటాలు పడతావు బాబూ ! పది డబ్బులు పోతేపోయినైగానీ, పాత వాళ్ళతో చంపెయ్యరాదు?' అని చాలా మంది నాకు సలహా లిచ్చారు. వారికి నా దొక్కటే సమాధానం ఎన్ని లక్షలు గుమ్మరించినా శకుంతలవంటి బ్యూటీని వాళ్ళు మద్రాసులో చస్తే పట్టుకు రాలేరు. శకుంతలను చూశాక, నా కథలో కూడా చాలా మార్పులు చేయాలనుకొన్నాను. ఇంత మంది హీరోయిన్లను పెట్టకుండా, శకుంతలనే హీరోయిన్‌గా చేసిపారేసి నేను హీరో వేషం వేద్దామనిపించింది. కానీ మార్కెట్ పరిస్థితి చూస్తే, ఇవాళ్టే మంచిది కాదేమోనన్న అను మానం వేసింది !

ఆవిణ్ని చూస్తూనే 'నిన్ను బుక్ చేశాను' అనాలని పించింది. అటువంటి పిల్లను మొదటిసారిగా సినిమా పరిశ్రమకు పరిచయం చేసిన క్రెడిట్ నాకే దక్కుతుందనడంలో ధోకా లేదు. ఆవిడ స్టిల్సు తీసి పత్రికల్లో వేయిస్తామంటే, శకుంతల వొప్పుకొందికాదు. 'ఇప్పుడప్పుడే దేనికి లెద్దురూ ?' అన్నది. ఆలోచించాక ఆ మాట నిజమే ననిపించింది. చచ్చీ చెడీ నేను డిస్కవర్ చేసిన ఈ టాలెంట్ కాస్తా, ఇంకెవడన్నా ఇట్టే ఎగరేసుకు పోయినా పోవచ్చు. నాయనా బ్యూటీప్లస్ టాలెంట్ ఎవరికి మాత్రం చేదవుతుందంటారు ?

సినిమా యాక్షన్ గురించి నాకు తెలిసిందంతా చెప్పడమే కాకుండా, ప్రత్యక్షంగా చూపించడం కోసం నాతోబాటు సినిమా లకు తీసుకెళ్ళాను. పార్కుకు తీసుకెళ్ళాను. డైలాగ్ డెలివరీలో నట్లు పోకుండా ఉండటంకోసం గంటలగ్గంటలు మాట్లాడుతూ కూచున్నాను లవ్ సీన్సప్పుడు, లవ్ డైలాగ్సు డెలివరీ అప్పుడు సిగ్గుపడి షూటింగులన్నీ ఖరాబు చేస్తుందేమోనని, వాటిల్లోనూ అంతో ఇంతో తర్ఫీదిచ్చాను. ఈ పరీక్షలన్నీ శకుంతల ఇట్టే గడిచి పోయింది

ఈవిడ స్టిల్సు చూసి డిస్ట్రిబ్యూటర్సు ఎగబడతారనడంలో నాకెటువంటి అనుమానమూ లేదు. కానీ, ముందుగా వాళ్ళదగ్గర డబ్బు తీసుకొన్నామంటే అర్చి పారేస్తారు. వారిష్టమొచ్చినట్టు చిత్రాన్ని మార్చమంటారు. అలా మార్చడమంటూ జరిగితే, తయారయ్యే పిక్చరు, నేననుకొన్నదానిలాగా ఉంటుందన్న నమ్మకం నాకు లేదు అందుకనే పిక్చరు మొత్తం స్వంతంగా తీయడమే మంచిదనిపించింది నీ మీద ఆర్థికంగా ఆధారపడని వాణ్ని, నువ్వు ఏనాడూ శాసించలేవు.

నన్నడిగితే డబ్బు చెయ్యడం ఓ గొప్ప ఆర్టంటాను. కొంత మంది చాలా ఆర్టిస్టిక్‌గా డబ్బు చేసుకొంటారు. కొంత మంది పద్ధతులు చాలా ప్రిమిటివ్‌గా ఉంటాయి. అర్ధ రూపాయి డబ్బులిచ్చి అర్ధ రాత్రిదాకా పని చేయించడం ప్రిమిటివ్ లక్షణం కాక మరేమిటి చెప్పండి ?

కేవలం హీరోయిన్లకోసమనే నేను బయలుదేరినా, తెలిసో తెలియకో చాలామంది కుర్రవాళ్ళుకూడా ఇంటర్వ్యూకి

కొచ్చారు. ఇలా రావడం కొంత పేచీ అయింది. ఇప్పుడు నా ఆర్థిక సమస్యను సగబడతీర్చిన ప్రసాద్ అలా వచ్చినవాడే! అతని నాన్నకు ఏవో బిజినెస్‌లున్నాయట. లక్షలు గడిస్తుంటాడని తెలిసింది. పైగా ఒక్కడే కొడుకట. ఇటువంటివాడు చేతిలో ఉంటే. నెలకు మూడు పిక్చర్లు లాగి అవతల పారేయడం ఓ లెక్కలోది కానేకాదు. అతనికి సినిమా ఇండస్ట్రీ ఎలాంటిదో చెప్పాను. వేలు గుమ్మరించి లక్షలు పిండుకోవాలంటే ఇంతకన్నా మించి బిజినెస్ ఉండదన్నాను. గ్లామరస్ లైఫ్ ఎంజాయ్ చెయ్యదలచిన వాడికి ఇది తప్ప మరో ఫీల్డు లేదన్నాను. "గోపాలకృష్ణుడు లాగా పదహారు వేల మంది గోపికలతో కులాసాగా ఉండవయ్యా! అన్నాను. ఈ మాట విని, ఫక్కున నవ్వాడతను.

అతని ధోరణి చూస్తూంటే, ఆడదాన్ని చూసి వెర్రెత్తిపోయే బాపతని నాకనిపించింది. ఒక చెంప నాతో మాట్లాడుతూనే ఉన్నాడు మరో చెంప శకుంతలను దొంగ చూపులు చూస్తూనే ఉన్నాడు. ఇవేవీ నాకు తెలియవని అతని నమ్మకం: చావనీండి నాకెందుకొచ్చింది గానీ, నా సినిమాకు నాలుగు డబ్బులు పెడితే చాలు. ఆ తరువాత, ఆ శకుంతలా, వాడూ, ఏ గంగలో దూకినా నా కభ్యంతరం లేదు.

చిక్కాకుంటే, శకుంతలకు అతనంటే అపేక్ష ఉన్నట్టు లేదు. వాడు ఎదురుగా ఉన్నంతసేపూ, చచ్చేట్టు కులికిన గుంట, వాడటు తిరగ్గానే, "ఏమిటండీ, అలా వెర్రాడిలా చూస్తాడేం" అంటుంది. చూస్తే దీని సొమ్మేంపోయిందట. వాణ్ని కాస్త మంచి చేసుకుంటే, పిక్చర్ తొందరగా ఫినిష్ చెయ్యొచ్చు. ముద్దొచ్చినప్పుడే చంకనెక్కాలి. వాడు మోజులో ఉన్నప్పుడే, పని కాగొట్టుకొంటే సరి ఈ మాటే శకుంతలతో చెప్పాను ఆవిడ చాలా సేపు ఆలోచించింది "నా వల్ల కాదండీ!" అన్నది. "ఎలానండీ బాబూ?" అన్నది. ఎలా చెయ్యాలో, ఏం చెయ్యాలో ఆవిడకి. నసాళం అంటేటట్టు బోధపరచాను "అతగాడు చేతచిక్కితేనే మన ఆటలు సాగుతాయి. ముందా సంగతేదో చూడు" అని గట్టిగా కోప్పడ్డాను ఏమనుకొందో ఏమిటో గానీ, "సరే"నన్నది చివరకి. గుండెలు తేలికచ్చినట్లయింది నాకు. నాకున్న రెండు సమస్యలూ తీరిపోయాయి. బ్రహ్మాండమైన బ్యూటీని డిస్కవరీ చేయడమే కాకుండా ఆ డిస్కవరీ చేత మరో డబ్బున్న పిచ్చికను డిస్కవరీ చేయించాను. ఈ వెధవను కాస్త చేత చిక్కించుకొన్నానో, మెడ్రాస్ సినీ ఫీల్డును ఓ ఊపు ఊపి పారేశానన్నమాటే.

(సశేషం)



నిలిచి ప్రశ్నింప, కెవ్వరు నెఱిగ రీ ప్ర
పంచ గతి, చూచి వచ్చినవారు లేరు;
గడచుదినమున కాలము గడుపు వారు
ఊహ చేసిన దానికై మోహ పడకు.

"మధుగీత"



# కీర్తిశేషులు



# అయ్యదేవర కాళేశ్వరరావు గారు

శ్రీ ఆత్మకూరి
గోవిందాచార్యులు



ఆంధ్రప్రదేశ్ శాసనసభా స్పీకర్‌గా ప్రశంసనీయమైన సేవచేసి కీర్తిశేషులైన శ్రీ కాళేశ్వరరావు పంతులుగారు శతాబ్దారంభము నుండియు దేశసేవ చేసిన మహామహుల కోవకు చెందిన వారు. దేశసేవయందు షష్టిపూర్తి అయిన వారు. ఈయన కర్మవీరుడు, ధర్మవీరుడు, దానవీరుడు, మత సంస్కర్త-సంఘ సంస్కర్త. దేశభక్తుడు, భాషా సేవకుడు, త్యాగశీలుడు. ఈ శతాబ్దారంభము నుండియు ఆంధ్రావనియందు మొలకెత్తిన ప్రతి ఉద్యమమున పాల్గొనిన, స్వానుభవ చరిత్రాత్మకుడు. వీరు తమ జీవిత కథ కొంత వరకు వ్రాసిరి. ప్రథమ సంపుటము ప్రచురింప బడినది. ద్వితీయ సంపుటము వ్రాయుట ముగియుటకు పూర్వమే అస్తమించిరి. ఈ అస్తమయమువలన అమూలిక. ఆంధ్ర చరిత్ర ఈ శతాబ్దారంభమునుండియు గల వివిధోద్యమముల ప్రారంభ పరిణామ చరిత్ర అంధకార బంధురమైనది. గత 60 సంవత్సరముల, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి కథను వీరివలె స్వానుభవముతో వ్రాయుగల దక్షులు అనుభవజ్ఞులు మరెవ్వరును నాంధ్రమున మిగుల లేరు. వీరి అస్తమయముతో యీ సర్వతోముఖ ప్రజ్ఞావంతుల పురాతనపు కోవయే అస్తమించినది, ఇది ఆంధ్రుల చెప్పనలవిగాని దురదృష్టము.

వీరు ఆంధ్రప్రదేశ శాసన సభాధ్యక్షులైన కొలది కాలమునకే నేను గూడా హైదరాబాదు నివాసినైతిని, అది మొదలు, మేమిరువురము కలిసి అనుదినము కొంత కాలము గడుపుచుండుట నిత్యకృత్యమైనది, కనీసము రెండు గంటల కాలమైనను. వివిధ విషయముల సంభాషించుచు ప్రొద్దుపుచ్చెడివారము.

## జీవితాదర్శము

వీరు స్వయముగా రచియించిన వీరి జీవిత చరిత్ర ప్రకటింప బడినది. అందు జీవిత వివరములు తెలియగలవు. గ్రంథాలయోద్యమము, స్వరాజ్యోద్యమములయందు, వీరితో కలిసి పని చేయు భాగ్యము నాకు లభించినది. స్వరాజ్యోద్యమమున రాజమంద్రి, కడలూరు, రాయవెల్లూరు, తిరుచునాపల్లి సెంట్రల్ జైళ్లలో ఎ క్లాసులో, కష్టకాలమున సంవత్సరముల కొలదియు సహవాసము వసించితిమి. వీరు బహు సంవత్సరములు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శిగా పనిచేసి యుండిరి. ఈ కాలమున రాష్ట్ర కాంగ్రెసు సంఘ సభ్యునిగను, కార్య నిర్వాహక వర్గ సభ్యునిగను నుంటిని. కాంగ్రెసు సేవలో గూడ వీరితో కలిసి మెలసి పనిచేయుట కవకాశము లభించినది. వివిధ సమస్య

లపై గల మా భేదాభిప్రాయములు, మా మైత్రికెన్నడును భంగము కలిగించలేవు. అంతకంతకు పరస్పరానురాగమే పెంపొందినది. ఈ అనురాగము, మైత్రి, హైదరాబాదు నివాస కాలమున గాఢమైనది. ఈ కాలమందలి మా సంభాషణములు వీరి అంతరంగిక ప్రవృత్తిని అర్థముచేసి కొనుటకు తోడ్పడినవి.

## కర్మవీరుడు

ఉపనిషత్తులు–వీరికి కంఠ పాఠములు. తరుచు మా సంభాషణమున ఉపనిషద్వాక్యములనే ఉదహరించుచుండెడివారు. ఉపనిషత్తులపై వీరు గ్రంథమును గూడ వ్రాసిరి. వీరు వ్రాసిన ఉపనిషత్పదములను పుస్తకమును చదువుచో వీరి అంతరాత్మ ప్రవృత్తి సుబోధకము కాగలదు.

80 సంవత్సరములు నిండినవి. ఇక జీవించుటెందులకు? ఒక కాలు శ్మశానమునందుంచితిమి కదా. నక్కకూతలు వినబడుటలేదా? అని యొకనాడు డాక్టరు పట్టాభిగారు ప్రసంగవశమున పల్కిరి. 'మరణము నాహ్వానించుట నా ఆదర్శము కాదు. చిరకాలము 100 సంవత్సరములు జీవించి, సంఘమునకు దేశమునకు మానవజాతికి సర్వభూతములకు సేవ చేయుటయే నా అవశ్యము, నా ధర్మము.' అని కాశేశ్వరరావుగారు సమాధాన మొసంగిరి. తైత్తిరీయోపనిషద్వాక్యమును జపించిరి. ఈ ఆదర్శమే వీరి జీవిత నౌకకు చుక్కాని. ఈ ధర్మనిర్వహణమే జీవితాంతమువరకు పాటించిన కర్మయోగి కాశేశ్వరరావుగారు.

## మతసంస్కర్త

ఒకవంక వేదములయందలి వీరి విశ్వాసము అచంచలము. వీరు ప్రగాఢతమమగు ఆస్తికులు. అనుదినమున నిద్రలేచినప్పుడును, నిద్రించబోవునప్పుడును గూడ, దైవ ప్రార్థన చేయుచుండెడివారు. భాగవతము వీరి అభిమాన గ్రంథము. ఇందలి గజేంద్రమోక్షఘట్టము వీరికి ప్రియతమము. ఈ పద్యములు కంఠగతములు. ఇవి చదువు చుండెడివారు. నారాయణ వచనమును గూడ ప్రార్థనమునందుపయోగించెడివారు. అయినను, వైదిక కర్మకు వీరు విముఖులు. వర్ణ విభాగ సంస్థకు వీరు వ్యతిరేకులు. కులములు నశించవలెననియే వీరి విశ్వాసము. విద్యార్థి దశయందే. బ్రహ్మసమాజ సిద్ధాంతములు, వీరి హృదయఫలకముపై శాశ్వతస్థానమాక్రమించినవి. సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారు వీరికి బందరు కాలేజీలో విద్యాగురువు మాత్రమే కాదు: మత గురువు కూడ. అనుష్ఠాన బ్రహ్మసమాజికులైనవారు. శ్రీ కాశేశ్వరరావుగారని యెరుంగనివారికి, వీరినర్థము చేసికొనుట దుస్తరము. బాల్యమునందే యజ్ఞోపవీతమును విసర్జించిరి. ప్రతి సంవత్సరము తల్లి దండ్రుల ఆబ్దికముల నెరపినవారు కారు, వ్రతాదులను పాటించినవారు కారు. కుల తత్వము, కులవిభేదము వీరి పరిసరములంకే బహుదూరమునందుండెడివి. హిందూమతాభిమానులే కాని సర్వమత సామరస్య హృదయులు. హిందూమత విజ్ఞాన పునరుద్ధరణము నందెంతయో పట్టుదలగలవారు. కాలక్రమమున, మతము పేరుగ, హిందూ సంఘమునందు చొరబడిన దురాచారముల ఖండించుట సంస్కరించుటయందు గూడ పట్టుదలగలవారు. అస్పృశ్యతానివారణ, బాల్యవివాహ నిషేధము, స్త్రీ విద్య, స్త్రీ స్వాతంత్ర్యము మొదలగు సంఘ సంస్కరణలయందుముందే వేసిన చెయ్యి–వీరియందు దేశభక్తి యెంత ప్రస్ఫుటమైనదో దైవభక్తి అంత అంతర్గతము. పవిత్ర జీవి, పరస్త్రీ, పరధనముల నపేక్షించని శుద్ధవర్తనుడు. పరలోక ప్రాప్తహేతుకమగు పవిత్రాత్మలయ్యు యిహమును మరచిన వారు కారు. నేలవిడిచి సాము చేసినవారు కారు.

## బహువిధ ప్రజ్ఞాధురంధరుడు

వీరి కోవకు చెందినవారే సమకాలిక దేశభక్తులలో అగ్రగణ్యులు–వీరు సుప్రసిద్ధ కార్యాచరణదక్షులు. దైవమును, మనసు కున్నను పురుష ప్రయత్నమును వీడినవారు కారు. వీరి రాజకీయ జీవితమంతయు విజయవంతమే. ఎత్తుపై యెత్తు వేయుట, రాజకీయ కార్యరంగమున కదన ద్రొక్కిన కర్మవీరుడు. సర్వదా విజయపతాకనెత్తిన విమల వర్తనుడు. పంచతంత్ర పరిజ్ఞాన ప్రజ్ఞాధురీణుడు. ఎన్నికలరంగము వీరికొక ఆటపాట. ఎన్నికలు, ఆట వస్తువు. నిర్భీతిగా ప్రజలను సమీక్షించగల నిశ్చల దేశభక్తుడు. అకళంక మూర్తి. త్యాగధనుడు. వీరివలననే ఎన్నికల మూలమున ప్రజాప్రతినిధిగా లభించు నుత్తమ పదవుల నాక్రమించ గలిగిరి. త్యాగదానములు ఉగ్గుపాలతో నలవడిన వారి సద్గుణద్వయము.

## త్యాగ దాన వీరుడు

న్యాయవాద వృత్తిని నిర్వర్తించు కాలమున బెజవాడలో వీరు ప్రముఖ న్యాయ వాదస్థాన మలంకరించి యుండిరి. మంచి ధనార్జన సమయమది. కృష్ణా జిల్లాయందలి జమీందారులు వీరి క్లయింట్లు. మహాత్ముని యాజ్ఞానువర్తియై వృత్తిమాత్రమున ధనార్జనపై విముఖుడు కాగలిగిన మహాత్ముడు.

జీవితాంతము నిశ్చల త్యాగియై త్యాగ రంగమునుండి కాలు వెనుకకు లాగని త్యాగవీరుడు. తమ ఉన్నత పదవుల ననుసరించిన, సౌఖ్యమును తామే అనుభవించినవారు కారు. తాము త్యాగుల ప్రతినిధిననే భావమే వారినావహించియుండెడిది. ఒకానొకప్పుడు మా సంభాషణ వశమున యిట్లు చెప్పిరి. 'స్వరాజ్యమే ఒక్క వ్యక్తియు తేగలిగినది కాదు. తెచ్చినదియు కాదు. చాల మంది, పడరాని బాధలు పడి, త్యాగారాధన గావించి యుండుటచే స్వరాజ్యం లభించినది ఈ స్వరాజ్య ఫలితమే నా శాసన సభాధ్యక్ష పదవి. శాసన సభ్యులకు లా ప్రకారమే నేను ప్రతినిధిని. ధర్మ ప్రకారము స్వాతంత్ర్య సంపాదనా వీరులకు, త్యాగమూర్తులకు నేను ప్రతినిధిని అనిరి. ఈ భావము వారి దేహమంతయు పరివ్యాప్తమైనది. శాసన సభాపతిగా శ్రీ కాళేశ్వరరావు రు చేసిన సేవ ఆంధ్రేతర శాసన సభాపతులకాదర్శప్రాయమైనది శాసన సభాధ్యక్షత వహించిన యీ అయిదు సంవత్సరములలోను వారికి లభించిన, జీతబత్తెములను పదిలపరచుకొని యుండినవారు కారు. న్యాయవాద వృత్తికాలమున ధనార్జన సేయు కాలమున వీరెట్లు దాన మొనరించెడివారో, అట్లే త్యాగమున మిగుల మగ్గినప్పుడు దాస్యమున గూడ త్యాగమొనరించెడివారు. వీరి నాశ్రయించిన అర్థి వ్యర్థుడైనవాడు కాడు అనుదినము విద్యార్థులకో, విజ్ఞానులకో, పేద విద్యావంతులకో, యథా శక్తిని దానమొనరించుచూనే యుండెడివారు. ఇక దేశారాధకులకో నెలసరి భృతులనిచ్చిరి. కొన్ని సంస్థలకు కూడ ప్రతి నెల తమ జీతమునుండి, దాన మొనరించుచుండెడివారు. మొత్తము మీద, జీత భత్తెములలో నొక్క రూపాయైనను మిగుల్చుకొనినవారు కారు. తామొనరించు దానమెవరికిని తెలియరాదనువారు. కుడి చేతి దానము ఎడమ చేతికి కూడ తెలియరాదనునంతటి పరమ రహస్యముగల దాన మొనరించిన దాన వీరుడు. నృత్య గీతాదులు వీరి నాకర్షింపజాలక పోయినవి. నిరంతరము మిత్రులతో కలిసి భోజనము చేయుటయే వీరికి మహదానందకర విషయము. స్వరాజ్యోద్యమ కాలమున బెజవాడలో వీరి ఆతిథ్యము పొందని దేశభక్తులు లేరు. వీరి గృహిణి నిజముగ అన్నపూర్ణాదేవి. శాసన సభాధ్యక్ష కాలమున, హైద్రాబాద్‌లో గూడ భోజన సమయమున, ఫలహార సమయమున గూడ, ఒక రిరువురు మిత్రులైనను, పంక్తి నుండి తీరవలసినదే "మిత్రులతో కలిసి భోజనం చేసినప్పుడే నాకు భోజనం తృప్తికరముగ నుండునని" చెప్పెడివారు "కృపయా భోక్తవ్యమనే" మాటకు విసుగు నెరుగని జీవి. పెట్టునందలి యంతటి ప్రేమానురాగతత్పరుడు ఆంధ్ర రాజకీయ నాయకులలో మరొకరు లేరు.

## విజ్ఞానమూర్తి, భాషా సేవకుడు

ఒక రాజకీయ సముద్రంలో ఆరు దశలు మునిగి తేలిన వారయ్యు ఆంధ్రత్వమును విస్మరించిన వారు కారు. ఆంధ్ర భాషా సేవను మరచినవారు కారు. ఆంధ్రులకు రాజకీయ చారిత్రక, విజ్ఞానము నందిచ్చుటకు ప్రయత్నించిన వారిలో ప్రథములు వీరు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు రి కండ దండయై విజ్ఞాన చంద్రికామండలిని స్థాపించినవారు. ఈ విజ్ఞాన చంద్రికా మండలియే చారిత్రక జ్ఞాన పుస్తకములు మొట్టమొదట ప్రకటించినది. 1931 వ సంవత్సరమున ఆకుల లక్ష్మణరావుగారి తదనంతరం కూడా శ్రీ కాళేశ్వరరావుగారీ మండలిని సజీవముగా పోషించిరి. ఇందలి కడపటి ప్రచురణము భారతదేశ ఆర్థిక చరిత్ర (నేను వ్రాసినది) దీంతో యీ మండలి అంతర్హితమైనను శ్రీ కాళేశ్వరరావుగారు పునరుద్ధరణ ప్రయత్నము విరమింపలేదు. శాసన సభాధ్యక్షులయినందులకు ఉపకరణమైనది హైదరాబాదులో విజ్ఞానవంతులందరిని జేర్చి ఉర్దూ, తెలుగు చరిత్ర, విజ్ఞాన ఎకాడమీని స్థాపింపగలిగిరి ఈ సంస్థకు సుమారు రు 50 వేల మూల ధనము కూడ ప్రోగుజేసిరి తెలుగు రచయితల కష్టముల పాలుముగదా వ్రాయుట కష్టమే గాకుండా, ముద్రణమునకై తెలుగు రచయితలు పడు బాధలు నిజముగ తీరని కష్టములే. ఈ యిడుములను బాపుటకై కాళేశ్వరరావుగారు బద్ధకంకణులగుటయే యీ ఎకాడమీ స్థాపనకు కారణము. వారు కూడ బహు గ్రంథ కర్తలగుటచే కష్టముల నెరిగిన వారు, పడినవారు. కాని వారి సంకల్పము సంపూర్ణముగ కొనసాగుటకు పూర్వమే దివంగతులైరి ఈ సంస్థయే వారికి తగు స్మారక చిహ్నము. ఆంధ్ర రచయితల కత్యంతోపయోగకరము వీరి తదనంతరము యీ సంస్థకు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు అధ్యక్షులుగా నెన్నుకోబడిరి వీరును సారస్వతాభిమానులు రచయితలు, పెద్దలు, పలుకుబడి గలవారు. వీరి ఆధ్వర్యమున యీ సంస్థ ఆర్థిక పునాదులపై మహాకోట కాగలదని విశ్వసింపవచ్చును. కీర్తిశేషులకు సుస్థిరమగు స్మారకము గూడ కాగలదు. ఇందుల కాంధ్రులెల్లరు తోడ్పడుటయే ఆంధ్రుల కర్తవ్యము. శ్రీ కాళేశ్వరరావుగారి యెడ గౌరవ భక్తులను చూపుటకు మార్గము. ఈ దేశభక్తుని, కర్మవీరుని ధర్మవీరుని, దానవీరుని, సాహిత్యాభిలాషిని, కోల్పోయిన కొరతను ఆయన స్థాపించిన సంస్థనభివృద్ధి పరచుకొని తీర్చుకొనెదము గాక.

శ్రీ కాళేశ్వరరావుగారి ఆత్మకు పరమాత్ముడు శాంతి ప్రసాదించుగాక.

* * *

నృత్య నాటిక:

# నాగార్జునసాగర్

శ్రీ వింజమూరి శివరామరావు

ప్రార్థన: బృందగానం

శ్రీ పురాణ ధాత్రికీ — మాపవిత్ర నేత్రికీ—
*భారతీయ మాత కిదే వందనం వందనం॥...*

గురులకు నాగార్జున శంకరులకు మా వందనం
భక్తులకూ సాత్వికాసక్తులకూ వందనం॥...
పూజనీయులైన త్యాగరాజులు వాల్మీకులకూ—
దేశ సేవకుల కర్తను దేశికులకు వందనం॥...
రామనామ జపశీలికి — అమహాతపశ్శాలికి—
సత్కృతి యతీంద్రునకు — జాతి పితకు వందనం॥...
కర్మ వీరులకు ఉజ్వల ధర్మములకు వందనం॥
యుగ యుగాల అభ్యుదయ ప్రగతికి మావందనం॥

సూత్రధారి వచనం: ఈ విధంగా భారతమాతకు స్వాతంత్ర్యాన్ని సాధించి అనతి కాలంలో అనేకముఖాల పురోగమిస్తూన్న విశ్వ విఖ్యాతకు— నమస్కరించి, నర నారీ కోటి, కృష్ణ వేణీ మహాప్రవాహాన్ని దర్శించే సమయంలో ఆ నదీమ తల్లి సంతోషంతో సగర్వంగా ప్రవహించే తీరు ఎట్లుంటేని—

కృష్ణ ఆపగరాని మహాపగనూ
ఏనె యేనె కృష్ణావేణినీ॥...
పావనమ్మ నా జీవనమ్మ సం
జీవని యీ భరతావనికీ॥...

నలుదిక్కుల పేరెక్కిన తాపసి
అలనాగార్జును వాసము నాదరి॥
ధరిత్రిలో నతి పవిత్రమగు నా
చరిత్ర కేదియు సాటి రాదయా॥...

ఆంధ్రవిష్ణువు నారసింహులూ
అంబ దుర్గయూ అమరేశ్వరులూ
నన్ను సదా పరిపాలన సేయగ
సమున్నత గతితో ప్రవహించెదనూ॥...

ఉరకలు కలుగ నెత్తగు కోనల
పరువు పరువులుగ నొత్తగు కానల
తిరిగెద కడు సందడితో వడితో,
అరిగెద నొక్కెడ నంచనడలతో॥...

నరులు : ఆగు మిట కృష్ణా తరంగిణీ
సాగరేశ్వరు మనోహారిణీ
నీదు సంతతి మమ్ము దయతో
నాదు కొనుమమ్మా॥

*పావనము నీ జీవనము ఆం*
ధ్రావనికి సంజీవని గదా
సముద్రము పాలొనర్తువె నీ
సమస్తోజ్వల శక్తులా॥

కృష్ణ : నామనోహరు సాగరేశ్వరు
ప్రేమతో భజియించు కోరిక
నంత దూరము నుండి వచ్చితి
నెంతయో మది పొంగు చూ॥

వలపుగా బ్రతుకెల్ల తీయని
తలపుగా పులకింపగా
ఏగు చుంటిని సామియింటికి!
ఆగ మందురె మీర విందరు?

నరులు : ఆలింపు మా విన్నపమ్మూ — ఓ తల్లి!
పాలింపు మీవేళ మమ్మూ!!
మా చేల పంటలే దొక్కపీసం!
చేచియున్నాము నీటి కోసం!!

బీడయ్యె నెల్ల క్షేత్రాలూ — చూడుమీ!
పాడయ్యె మా జీవితాలూ!!
నీదు సంతానమ్ము గాపాడవా?
నీసద్దయా పయ స్పందీయవా?

కృష్ణ : నా జీవనమ్ము నా జీవితమ్మూ
నాస్వామి సేవకే అంకితమ్మూ!
ఆగలే నాగటో నిచోట నేనూ!
వేగమ్ముగా సాగి పోవుచున్నానూ!!

నరులు : ఎంత గర్వ మెంత స్వార్థ
మెంత యహంకారమూ!
దీనార్తుల నాలింపని
యినది జీవన మేలా?.

"ఆగుమమ్మ మాకు జలం
బీగుమమ్మ' యంచు పెడ
లెక్క చేయకుండ పోయె!
ఒక్క మాకు తోచ దాయె!

బలంతోడ, ఇంకి పోని
జలంతోడ పొంగిపోవు
ఈనది వేగాన్నాపిన
గాని మేము నిద్రపోము!

వ్యక్తి : ఎందు కీ కృపా వేషము?
ఎందు కో వృథా క్లేశము?
రోషముతో ద్వేషముతో
ఏదియు సాధింప లేము!

తాను గన్న వారి కెన్న
దేని తల్లి కీ దెంచునె?
కన్నతల్లి కృష్ణవేణి
మన్నింపదో ప్రజా శ్రేణి!

ప్రేమ దివ్య సూత్రముతో
నామెను బంధించ వచ్చు!
ఉత్తమ మౌ త్యాగ శక్తి
నిత్తరి సాధించవచ్చు!

సర్వవస్తు నిర్మాతలు!
సాంకేతిక నిర్దేశకు!
రండి రండి కార్మికులూ!
రండి కార్యశూరులై!

అదిగో విజయ పురీవర
మదిగో తలమెత్తినదీ!
మనతో దీనముగా నే
మనినో విన రండీ!

విజయం : అక్కటా సిగ్గేల ముంచుతారా? నన్ను—
ఒక్కరూ నామొరా లింప లేరా?
ఇక్ష్వాకు రాజధానీ పట్టణంబుగా
అతిశయంబైన సత్కీర్తి నందాను!

నాగార్జునాచార్య నాస్థాన సీమనై
సవ్యకాంతి స్ఫూర్తి పెంపొంది నాను!
సుందరాలీ శిల్ప మందిరాలూ — స్ఫూర
ద్దీపమ్ము లీపురా స్తూపమ్ములూ!

నరులు : అమ్మా విజయపురీ చే
కొమ్ము నమస్కారమూ!
నాశనమ్ము కాదు — మాకు
ఆశయమ్ము సృష్టియే!

నీ కళా విలాసము లీ
లోకాన వికాస మంద
నిన్ను కొండ కొమ్ము పైన
నిల్పుదు మెంతో యెత్తున!

విజయ : ఓ ప్రజలారా మెచ్చితి!
మీ ప్రయత్న మద్భుతమ్ము!
కృష్ణానది యిచ్చోటనె
కేవలమొక సాగరమౌ

నాగార్జును పేరుతోడ
సాగరమ్ము వర్ధిల్లుచు—
లోకములో సాటిలేని
దై కల కాలం నిలుచూ!

నరులు : రండు రండయా ఆనకట్ట క
ట్టండి చేయి చేయి కలపండీ!
జాతికి భారత మాతకు ఘన వి
ఖ్యాతి గూర్పగా నిలవండీ!

ఏ కరువూ దరి జేరదయా!
ఏ బికువూ పడద్రోయదయా!
ఆకలికీ పెను చీకటికి మన
లోకములో నిక తావు లేదయా!

కృష్ణ : నామది కిది యానంద కరం!
భూమి కంతకూ దివ్య వరం!
చలించనిది మీ నిర్ణయమూ!
ఫలించినది మీ ప్రయత్నమూ!

నిదురించిన మీ సర్వశక్తులా
కదిలించుట నా చిరవాంఛితమూ!
నాదుజలం — నాదుబలం
మీదెగదా గ్రహించుడీ సదా!

నాదొక వేణిక నీదరినీ—
ఆదరి నింక వేణికయూ—
సాగు పొలమ్ములు పైరు పచ్చగా!
నాగతి వెలుంగు దారి తీర్చగా!

నరులు ; జగంబు సమృద్ధిగా—
జనంబు సుఖింపగా—
పొలములు పండుట కూ—
కలుములు నిండుటకూ—
జల శక్తి పైకి తీస్తాం!
బలయుక్తులు చూపిస్తాం!
ఆనకట్టలు పేరుస్తాం!
పూని కాల్వలూ తీరుస్తాం!
వారధులను కడతాం!
కడతాం వారధులూ!
దీపములను పెడతాం!
పెడతాం దీపములూ!
భగీరథుల మౌతాం!
జగాన స్వర్గము చూతాం!
కష్టపడిన వారూ! ఎన్నడు
నష్ట మొంద బోరూ!
అందరు కలవండీ! ఇప్పుడె
ముందుకు నడవండీ!

కృష్ణ : శాంతి విధానము కాంతి విధానము
వర దాయిని యీ వర నిర్మాణము!
ఉర్వి సమస్తము సుఖీభవా!
సర్వజనమ్ములు సుఖీభవా!

నరులు : అదె నాగార్జున సాగరమూ!
అది యాంధ్రావని సుందరమూ!
భారతీయ శక్తుల కాకరమూ!
ధారుణి శుభసంపత్కరమూ

పాడియు పంటయు పెంపు నందగా—
వాడవాడలూ వెల్గు నొందగా—
వరమ్మిదే సకలాంధ్ర జనానికి!
చిర కీర్తి దమ్ము భరతావనికీ!!

నాటిక:

# కథ అడ్డం తిరిగింది

"ప్రేమేంద్ర"

( గత సంచిక తరువాయి )

సుబ్బా: (చిన్నగా నవ్వి) ఏవిటోయ్ అంత గాభరా పడుతున్నాడు ?

సుంద: (మెల్లగా...మందహాసం చేస్తూ) హంతకుడు యితడేగా గాభరా వుండదూ మరి ?

సుబ్బా: ఓహో! అలాగా! ఆ కళ్ళల్లోనే కరడుగట్టినమంతా గూడు కట్టుకుని వున్నట్టుంది.

(కుడివేపు గదిలోంచి గంగాధరం, శివరామ్, గిరి వస్తారు ఆత్రంగా. గిరి తటపటాయిస్తూ వెనుక నడుస్తూ వస్తాడు.)

సుంద / సుబ్బా : (నిల్చుని) నమస్కారమండీ.

గంగా: నమస్కారం ... కూచోండి ... కూచోండి.

(సోఫాలో కూచొంటాడు. అతని ప్రక్కన గిరి కూడా ఆశీనుడౌతాడు. శివరామ్ నుంచుని వుండగా సుందరం, సుబ్బారావు కూడా కూచుంటారు)

శివ : నాకు కలవిప్పించండి మరి

గంగా: ఉండవోయ్ తొందరేమొచ్చింది ? అలా కూచో.

(శివరామ్ చిత్తుగా కూచుంటాడు. గిరి ప్రక్కనే వున్నకుర్చీలో)

సుంద: "చక్రదారి" మీ యింట్లోనే వుంటున్నాడు కదండీ. అతనితో మాట్లాడాలని వచ్చాం

(శివరామ్ గుటకలు మ్రింగుతూ వుంటాడు)

గంగా: (కలవరపాటు కనబర్చకుండా) ఔనండీ. వుండేవాడు కాని, వారం రోజుల్నుంచీ అగుపించడం లేదు. రోజూ వస్తాడనే యెదురుచూస్తున్నాం. మా కళ్ళు కాయలు కాస్తున్నాయి గాని, అతని జాడ మాత్రం లేదు. పోనీ, యెక్కడికైనా వెళ్ళేవాడవుతే, మాకు చెప్పి వెళ్ళొద్దటండీ. మేం యెంత ఆతృత పడతామో అన్న ఆలోచన అంత తెలివైనవాడికీ వుండొద్దూ?

సుంద: (ఆశ్చర్యపోతూ) ఏవిటీ వారం రోజుల్నుంచి అగుపించడం లేదా? ఎక్కడికి వెళ్ళినట్లవుతే? (గిరివేపు చూసి) మీవండీ మీకు తెలుసునా ?

గిరి : (తృళ్ళిపడుతూ) నాకా ? అబ్బే నాకెలా తెలుస్తుంది ?

సుంద: కంగారుపడకండి. తెలుసునేమోనని అడిగానంతే.

సుబ్బా: (శివరామ్ వేపు చూపిస్తూ) ఈయన యెవరండీ.

గంగా: 'శివరామ్' అని ఓ ప్రచురణ కర్తలెండి

సుబ్బా: ఓహో, ఏమన్నా పుస్తకాలు ప్రచురింపిస్తున్నారా యేవిటి! మీరు కూడా రచయితలని మాకు తెలీసుమండీ! నిజంగా మిమ్మల్ని కలుసుకోవడం నాకెంతో ఆనందంగా వుంది.

గంగా: (తడబడి) అబ్బెబ్బే నేను రచయితను కాదండీ !

సుంద: అలా తప్పించుకోవడం భావ్యం కాదండీ ? కొందరు రచయితలు, కవులు అజ్ఞాతంగానే వుండాలని భావిస్తారు. మీరు కూడా ఆ కోవకి చెందినవారేలా వుంది.

గంగా: (విసుగ్గా) నా మాట నమ్మండి. నేనేం రచయితను కాదు. ఈయన కూడా ఆ "చక్రధారి" గారి కోసమే వచ్చాడు.

సుంద: ఓ హో అలాగా (శివరామ్ చేతిలో వున్న బొండు పుస్తకాలు చూసి) అదిగో అతనిచేతిలో యేవో బొండు పుస్తకాలు వున్నట్టున్నాయే ?

శివ : ( కలవరపడి ) అబ్బే ! యివి నేను వచ్చినప్పుడు తెచ్చాన్లెండి

గంగా: (ప్రస్తావన మార్చాలని) ఏవండీ, మీరు రావడం "చక్రధారి" గారి కోసమేనా ?

సుంద: ఔనండీ

గిరి : అతను లేడుకదండీ ! ఇక మీరు వెళ్ళకూడదూ ?

సుబ్బా: మీరు అంత అసహనంగా, అసభ్యంగా మాట్లాడ్డం సబబుగా లేదండీ !

గంగా: (కలిగించుకుని) అతడితో యేవిటి లెండి వయస్సులో పిన్నవాడు. దురుసుతనం కాస్త వుంటుంది. ఇంతకీ తమ పరిచయం చెప్పకుండానే యిలా సంభాషణ సాగిస్తున్నాం.

సుంద: ఇప్పుడైనా మించిపోయిందేమిటిలెండి. నాపేరు సుందరం. నేనూ ఓ రచయితనే గాని, "చక్రధారి" లాంటి గొప్పవాణ్ని కాదు. అతనితో నాకు బాగా పరిచయముంది. అతని అడుగుజాడల్లోనే పోవాలని నా వాంఛ. మా యిరువురికీ యెప్పుడూ వుత్తరప్రత్యుత్తరాలు నడుస్తూ వుంటాయి. ఇదిగో యీయన సుబ్బారావుగారని ఓ ప్రచురణకర్త. కొత్తగా ఓ సంస్థ పెట్టారు. యువరచయితల్ని ప్రోత్సహించాలని యీయనగారి ఆశయం. "చక్రధారి" యీ

మధ్య యేదో నవల రాసినట్టు నాకు ఉత్తరంలో రాశారు. ఆ నవల యీయన ప్రచురిస్తామంటున్నారు. రచయితను కలుసుకొన్నట్టు వుంటుంది, రమ్మనమన్నాను.

(గంగాధరం, శివరామ్ మొహాలు వివర్ణమౌతాయి. గిరి ఉక్రోషంతో చూస్తుంటాడు)

సుబ్బా: "చక్రధారి" గారికి పాఠకలోకంలో మంచి పేరుందండీ! అతని రచనలు ప్రచురించుకుంటే, యేదో కాస్త లాభ సాటిగా వుంటుందనీ, ఆయననీ ప్రోత్సహించినట్టూ వుంటుందనీ, నా ఆశ. అంతే కాదు. అతనికి ముందుగానే మూడువందలు అడ్వాన్సుగా యివ్వాలన్న తలంపుతో నే వచ్చాను పుస్తకం ప్రచురించాక మిగతా రెండువందలూ యిస్తాను.

గిరి: (ఆశ్చర్యంగా) ఒక్క పుస్తకానికి అయిదువందలన్న మాట ?

సుంద: "చక్రధారి" పుస్తకానికి అంత గిరాకీ వుందండీ! కాని, యేం లాభం? అతనికి అనుభవించే యోగం లేదు.

గంగా: (అదిరిపడి) అంటే మీ వుద్దేశం ?

సుంద: అబ్బే యేమీలేదండీ! ప్రస్తుతం లేదు కదూ ? అందుకే అంటున్నాను. దేనికైనా యోగమంటూ ఒకటి వుండాలి కదండీ ?

గంగా: అంతేనండీ! అసలు, అతను యెక్కడికి పోయాడో తెలిస్తే యింత రాద్ధాంతం వుండేదికాదు.

సుబ్బా: కొంపదీసి, యేదన్నా యాక్సిడెంటు జరగలేదు కదా?

గంగా: అబ్బే! అలా జరిగి వుండదండీ! మనిషి చాలా జాగ్రత్తగా నడుస్తాడు.

సుంద: ఎంత జాగ్రత్తగా నడచినా, చెప్పలేమండీ! ఇన్నాళ్ళ వరకూ ఆచూకీ తెలియటం లేదంటే, ఆశ్చర్యంగా వుంది కదూ ?

సుబ్బా: ఆశ్చర్యమే మరి! పోనీ, యాక్సిడెంటు జరగలేదనే అనుకుందాం. మరవుతే యేమైనట్టు ? ఎవరైనా అతణ్ణి హత్య చేశారా ?

గంగా: (గాభరాపడి) హత్యా ?

(గిరి మొహం పాలిపోతుంది. స్వేదంతో ఫాలభాగం. మెరిసిపోతూ వుంటుంది)

సుబ్బా: ఔనండీ ఎందుకు జరక్కూడదు.

గిరి: (లేచి నుంచుని) మీరు మాట్లాడుతూ వుండండి...వస్తా.

సుంద: అదేవిఁటి ? లేచిపోయారేం?

గిరి: మళ్ళీ యిప్పుడే వస్తానుండండి...తల నొప్పిగా వుంది.

సుంద: ఒక ప్రఖ్యాత రచయిత జాడ తెలీక చర్చిస్తుంటే, అది మీకు తలనొప్పి కలిగిస్తుందంటే, వింతగా వుందే వెళ్ళండి.... వెళ్ళండి.

(గిరి విసురుగా వెళ్ళిపోతాడు)

శివ: (లేచి నుంచుని) గంగాధరంగారూ! మరి, నాకు శలవిప్పిస్తారూ ? బోలెడు అర్జెంటు పనులున్నాయి.

సుంద: మీరు కూడా లేచిపోతున్నారేవిఁటండీ ? మేం యిక్కడ వుండటం మీకు అంతగా యిష్టం లేకపోతే, ఆ సంగతి చెప్పేయండి వెళ్ళిపోతాం. అతనికోసం వచ్చాంగాని లేకపోతే వచ్చేవాళ్ళమా ?

శివ: అబ్బే! మీరలా భావించడం భావ్యంకాదు. నిజంగా నాకు అర్జంటు పనులున్నాయి.

సుబ్బా: నాకూ అర్జంటు పనులున్నాయండీ! కొత్తగా పబ్లికేషన్ పెట్టానా? బోలెడు పనుంది. కాని, యిక్కడికి రావడం తప్పనిసరయ్యింది. రాస్సేపు కూచోండి ... మాట్లాడుకుందాం...

శివ: (విసుగ్గా కూచుని) సరే...

సుబ్బా: "చక్రధారి" గారి పుస్తకాలు, మీరు యింతకు ముందు ప్రచురించారనుకుంటాను ?

శివ: ఔనండీ!

సుబ్బా: ఎలా అమ్ముడు పోయాయంటారు ?

శివ: బాగా అమ్ముడుపోయాయండీ! ఎంతయినా అతని రచనల్లో ఓ విధమైన ఆకర్షణ వుందండీ!

సుంద: అవుతే, మీకూ అతనికీ బాగా పరిచయముండివుండాలి.

శివ: లేకేం ? బాగా పరిచయముంది

సుంది: అల్లాంటప్పుడు అతని విషయం యేమీ తేలకుండానే లేచిపోతున్నారేవిఁటి ? నిజం చెప్పుకోవాలంటే. అతని జాడ తెలుసుకునే బాధ్యత మీరు నిర్వహించవల్సింది. కారణం యేమిటంటే, అతని పుస్తకాలు మీరింకా యెన్నో ప్రచురించాలన్న యోచనతో వున్నారు ఔనా ?

శివ ; నిజమే అనుకోండి.

సుంద: అందుకే మాచర్చలో పాల్గొనమంటున్నాను.

(శివరామ్ ఆముదం త్రాగినట్టుగా ముఖం పెట్టి మౌనం వహిస్తాడు)

గంగా: అయినా, యిప్పుడా చర్చ యెందుకు లెండి...ఏ విషయమూ యిదమిద్ధమని తేల్చలేకండా వున్నాం.

సుంద: అలాగంటే యెలా చెప్పండి? మనకి అప్పుడు కొటట్టి, మనమే ఆరా తియ్యడానికి ప్రయత్నించాలి. ఏ రోజు ఇంటికి రాలేదో, అతని జాడ తెలుసుకుందుకు యేమన్నా మీరు ప్రయత్నించారా ?

గంగా: (గుటకమ్రింగుతూ) ఏవిఁటి మీ ప్రశ్నలు ?

సుబ్బా: (చిరునవ్వుతో) అబ్బే! మీరలా అనుమానించడం అనవసరం. అతనంటే మీకూ మంచి ఆదరముంది. మీ యింట్లో అద్దెకుంటున్న వాడూను. అందుకే మీరు అతని జాడ తెలుసుకునేందుకు ప్రయత్నించకుండా వుంటారా అని యీయన ప్రశ్న.

గంగా: (ధైర్యం కూడగట్టుకుని) ప్రయత్నించకుండా వూరుకుంటామటండీ ? ఓ రోజంతా నాకు అన్నం ముట్టబుద్ధి పుట్టింది కాదు...రెండు రోజులు వెదికించాను. ఫలితం శూన్యం. గత్యంతరం లేక, మూడో రోజు పోలీసు స్టేషన్లో రిపోర్టు యిచ్చాను.

సుంద: అలాగా ! మీరైనా వుండబట్టి, అ మాత్రం శ్రద్ధ వహించారు. ఎంతయినా కాబోయే మావగారు కదూ ?

సుబ్బా: అదేవిఁటిదీ ?

సుంద: ''చక్రధారి'' యీయనగారి పుత్రికా రత్నాన్ని ప్రేమించాడట. అది నేను చెప్పకూడదనుకోండి గంగాధరం గారూ ! కాని, వుపక్రమణిక చెప్పాలంటే, ఆ విషయమూ మనవి చెయ్యాలి. ఆమెను పెళ్ళి చేసుకోడానికి తగిన అవకాశాలు కల్పించుకుంటున్నట్టు కూడా ఓసారి ఉత్తరంలో రాశాడాయన.

గంగా: (మొహం కోపంతో యెర్రబడగా) ఏమిటీ! అలా రాశాడా? ఎంత ద్రోహం ? ఈ విషయం నాకు తెలీనే తెలీదు సుమండీ!

శివ : కొంపలేదని కనికరించి, తమ యింట్లోని ఓ గది అద్దెకిస్తే యిలాంటి నీచపు పనికి తలబెట్టిన వ్యక్తి. ఒక ప్రఖ్యాత రచయిత అంటే, యెవరైనా నమ్ముతారా ?

(గిరి అప్పుడే ద్వారం దగ్గరకు వచ్చి తీవిగా నుంచుని అంతా వింటూంటాడు.)

సుంద: ఇందులో నీచం యేముంది ? ప్రేమించడం నీచమా ? ఇది యే శాస్త్రంలో వుందండీ ? ప్రఖ్యాత రచయిత అయినంత మాత్రాన ప్రేమించకూడదా ? అతనికి హృదయం లేదా ?

శివ : హృదయం వుండొచ్చునండీ ! అంతస్తు చూసుకోకండా అన్నీ తెలిసిన వ్యక్తి ప్రేమించడం తప్పే అంటాను.

గిరి : (వస్తూ) ఔను: నేనూ అదే అంటాను.

సుబ్బా: ఏవిఁటీ ! మీరూ అదే అంటారా ?

గిరి : ఔను! అతని అంతస్తు యేవిఁటి? మా మావగారి అంతస్తు యేవిఁటి ?

సుంద: మీకు పెళ్ళయిందేవిఁటండీ ?

గిరి : చేసుకోబోతున్నాను.

గంగా: మా అమ్మాయిని ఇతనికిద్దామని వుందండీ ! మాంచి డబ్బుంది. దగ్గరివాడు.

సుబ్బా: బావుంది. ఇంకేం ? అవుతే మీరు ''చక్రధారి'' గారికి ప్రతిపక్షులన్న మాట.

గిరి : (విసుగ్గా) ఛా ! అలా అనుకోవడం నాకే చిన్నతనం. అటువంటి సామాన్య వ్యక్తిని నాకు పోటీగా పెట్టుకోవడం యేవిఁటండీ ?

సుంద: పోటీగా పెట్టుకోలేదంటూనే అంత కసిగా మాట్లాడుతున్నారే ! చాల చిత్రంగా వుంది.

శివ : మనం అసలు విషయాన్ని విడిచి, అనవసరపు ప్రస్తావనలోకి పోతున్నామండీ !

సుంద: ఇది అనవసరం కాదండీ శివరామ్‌గారూ; విషయం యిప్పుడిప్పుడే లీలగా అవగాహన అవుతుంది. ఇందులో యేదో మోసం వున్నట్టు కన్పిస్తుంది ఏసీ. మీ చేతిలో వున్న పుస్తకం యిలా యిస్తారూ?

శివ: (గతుక్కుమని) ఇదెందుకు?

సుంద: ఎవరు వ్రాసిందో చూద్దామని.

శివ: మీకు అతను తెలీదు లెండి.

సుంద: నేనూ ఓ చిన్న రచయితను గాబట్టి, ఆ ఆసక్తి అలా వుంటుంది. ఓ సారి యివ్వండి చూస్తాను.

గంగా: మీధోరణి యేవిఁటో నాకు బోధ పడ్డం లేదు.

సుంద: ఆయన ఆ పుస్తకం యివ్వడానికి, యెందుకంత సంశయ పడాలో నాకూ బోధపడ్డం లేదండీ.

గిరి: సంశయం యేవిఁటండి? ఆయన కొనుక్కున్న పుస్తకం అది. అతనికి యిష్టముంటే చూపిస్తాడు. లేకుంటే లేదు.

సుంద: అందుకే, అనుమానించాల్సి వస్తుంది.

గంగా: ఏవిఁటి అనుమానిస్తున్నారు!

సుంద: అది 'చక్రధారి' వ్రాసిన పుస్తకమే యెందుకు అయ్యుండ కూడదు?

గంగా: (చప్పున నుంచుని) ఏవిఁటి మీరంటున్నది? అతని పుస్తకం ఆయన తస్కరించాడని మీ వుద్దేశమా?

( అందరూ నుంచుంటారు...గిరి కోపంతో కళ్ళెఱ్ఱ జేస్తాడు శివరామ్‌ను భయం ఆవహిస్తుంది)

సుంద: అతను తస్కరించాడని, ఆరోపిండం లేదు...మీరంతా కలిసి కుట్ర చేశారేమోనని అంటున్నా.

గంగా: (క్రోధంతో) మాటలు తిన్నగా రానీయండి...అసలు, నా యింట్లో...

సుబ్బా: (చిరు నవ్వుతో) ఆవేశం తెచ్చుకోకండి, ఆయన చెప్తున్నదేదో పూర్తిగా వినకూడదండీ?

గంగా: ఏవిఁటి వినడమండీ నా బొంద: నా యింటికి వచ్చి నన్ను అపమాన పర్చడ మేవిఁటి?

సుంద: మిమ్మల్ని నేను అవమాన పర్చడం లేదే; పుస్తకం చూపించమని, ఆయన్ని నేను అడుగుతుంటే, మీరే కలిగించుకుని కథ మధ్యకు వచ్చారు.

గంగా: రానూ మరి! అందరం కలిసి కుట్రచేశామంటుంటే రాకండా వుండటమెలా?

సుబ్బా: పోనీ ఆ పుస్తకమేదో చూపించేయకూడదండీ: ఈ రాద్ధాంతమే వుండదుగా?

గిరి: ఎందుకు చూపించాలీ అంటాను!

సుంద: అసలు, ఆ పుస్తకాన్ని చూపించడానికి భయమెందుకో అంటాను.

గిరి: ఈ వివరాలన్నీ అడగడానికి మీకేం హక్కు లేదు వెళ్ళండి.

సుంద: స్నేహితుడిగా, నాకు ఆ హక్కుంది.

గంగా: నాయింట్లో, మీ హక్కు ప్రసక్తే లేదు.

సుంద: అంటే, మీ నిరంకుశత్వాన్ని నిరూపించుకుంటున్నా మాట! ఇప్పుడు తెలిసిపోతుందిగా యేదో మోసం జరిగిందని.

గిరి: (కోపంగా) వచ్చినవాళ్ళు, వచ్చినట్టు తిరిగి వెళ్ళక, యీ అనవసర అధిక ప్రసంగమంతా యెందుకు? గౌరవంగా తిరిగి వెళ్ళడానికి యిష్టం లేదా?

సుంద: ఏం? అగౌరవరప పరుస్తారా? (చిన్నగా నవ్వి) ఔను మరి! మీరు చేస్తున్న అక్రమాలను యెత్తి చూపడం నా తప్పే.

గిరి: ముందు బైటికి నడవండి. లేకపోతే చెయ్యి చేసుకోవల్సి వస్తుంది.

సుంద: ఏవిఁటండీ గంగాధరం గారూ! మీ యింట్లో మాకు జరిగే గౌరవం యిదేనా?

గంగా: అది మీ ప్రవర్తనబట్టి వుంటుంది. గౌరవానికి అర్హులు కారు మీరు.

సుంద: ఔను మరి: మేం మీ వంటి పెద్ద మనుషులం కాంకదూ?

గంగా: ఏవిఁటి మీ ప్రేలాపన? ముందు బైటికి నడవండి. మీతో మాట్లాడుతూ కూర్చోడానికి నాకు తీరక లేదు. (లోపలికి పోవాలని ప్రయత్నించుతాడు.)

సుంద: ఆగండి!

గంగా: ఏవిఁటీ బెదిరింపు ?

సుంద: (మందహాసంతో) మీరు వెళ్ళవల్సింది యింట్లోకి కాదు పోలీసు స్టేషనుకి.

శివ : (హడలిపోయి) పోలీసు స్టేషనుకే.

గంగా: మతి చలించి మాట్లాడుతున్నారా ?

సుంద: మతి చలించడం నాకు కాదు...మీకే! ఈ పుస్తకాల్ని "చక్రధారి" గదిలోంచి తస్కరించినందుకు సమాధానం చెప్పుకోవాలి.

గంగా: (వికటాట్టహాసం చేసి) నాతోనే పరాచికాలా ? ఓయ్ గిరీ వాళ్ళకి తగిన సన్మానం చెయ్యి

గిరి : అదే నేనూ అనుకుంటున్నానండి...నిప్పుతో చెలగాటం ముప్పని వాళ్ళకి తెలీదు (ముందుకు రాబోతాడు)

సుబ్బా: (జేబు నుండి పిస్టలు తీసి గురిపెడుతూ) ఆగు! అడుగు ముందుకు వేశావా కాల్చేస్తాను. నేను యెవర్నో తెలుసా? సి.ఐ.డి. యిన్‌స్పెక్టర్ని.

(గిరి షాక్ తిన్నవాడిలా ఆగిపోతాడు)

గంగా: (తెల్లబోయి) సి.ఐ.డి (లోలోన గొణుక్కుంటూ అయో మయంగా చూస్తాడు. ఈ సమయంలో శివరామ్ మెల్లగా జారుకోవాలని ప్రయత్నిస్తాడు)

సుంద: ఆగండి శివరామ్‌గారూ! పలాయనం చిత్తగించడానికి ప్రయత్నించకండి. (శివరామ్ వణికిపోతూ ఆగిపోతాడు) ఎవ్వరూ కదల్డానికి వీల్లేదు. ఓసారి నా నిజరూపం చూడండి. (గడ్డం, మీసం తీసివేస్తాడు)

గంగా: |
గిరి : | (అదిరిపడి ఒక్కసారి) చక్రధారి!
శివ : |

సుంద: ఔను. నేనే చక్రధారిని...చచ్చినవాణ్ణి భూతమై వచ్చానను కుంటున్నారా యేవిఁటి?

గంగా: (సంభాళించుకుని) మీరు చచ్చిపోయారా? మీరు యీ మధ్య కనిపించకపోతే యెంతో ఆరాటపడ్డాం.

సుంద: (నవ్వి) మీలో అద్భుతమైన తెలివితేటలు వున్నాయి గాని, కాలం మాత్రం కలిసిరాలేదు పాపం!

గంగా: మీ మాటలు నాకు అర్థం కావడం లేదు.

సుంద: అర్థమయ్యాయి. కాని, అర్థం కానట్టు నటిస్తున్నారు. నన్ను చంపించడానికి ప్రోత్సహించింది మీరు కాదూ?

గంగా: (విస్తుపోయినట్టుగా నటిండి) నేనా? మీరు యీ లోకంలో వున్నారా?

సుంద: మీ ప్రయత్నం ఫలించి వుంటే, యీ లోకంలో వుండే వాణ్ణి కాదు. నా అదృష్టం బావుంది గాబట్టి, తలవెంట్రుక వాసిలో చావు తప్పింది.

గంగా: అసందర్భంగా మాట్లాడకండి.

సుంద: దబాయించడానికి ప్రయత్నించకండి గంగాధరంగారూ! సంఘంలో ఓ పెద్దమనిషిగా చెలామణీ అవుతున్న మీరు యింత క్రూరులనీ, రాక్షసులనీ నేనెప్పుడూ అనుకోలేదు.

గంగా: (కోపంగా) చక్రధారీ!

సుంద: చెప్పనీయండి. మీ అమ్మాయి నన్ను ప్రేమించిందని, ఆమెను నేను కూడా ప్రేమిస్తున్నానని, మీకు తెలుసు. మా ప్రేమలత విడివడని బంధంగా అల్లుకుపోయే సమయానికి మీరు కళ్లు తెరిచారు. మా యిరువురికీ వివాహం జరిపించ డానికి యిష్టపడని మీరు, మాకు యెడబాటు కలిగించే వుద్దేశంతో, నన్ను యీ లోకం నుండే వేరు చెయ్యాలను కున్నారు. (చిన్నగా నవ్వి) కాని, విధి చాలా చిత్రమైనది గంగాధరంగారూ! మీకు ధైర్యం చాలింది కాదు. అప్పుడే యీ గిరి మీ దృష్టిలో మెదిలాడు. మీ అమ్మాయంటే, ప్రాణాలు సహితం ధారపోయడానికి వెనుదీయని యీ గిరి సహకారంతో, మీ మనసులో వున్న కార్యాన్ని నిర్వి ఘ్నంగా కొనసాగించదల్చారు. పాపం, యీయన మీ అమ్మాయి ప్రేమలో పడి పిచ్చెక్కి, మంచీ చెడూ విచక్షణ లేకండా, ఆ రోజు నా వెనుకచాటుగా వచ్చి తలమీద దెబ్బ వేశాడు. నిజానికి ఆ దెబ్బతో నేను అంతమవ్వ వల్సిందే కాని, కాస్తంత గురితప్పి పక్కగా తగిలింది ... స్పృహ తప్పి పడిపోయాను. నా చావు మీరు కోరారు గాని, దైవం కోరలేదు. ఓ ధర్మాత్ముడు నన్ను తన యింటికి తీసుకుపోయి, చికిత్స చేయించాడు. అతనే నాకు ప్రాణ భిక్ష పెట్టాడు.

గంగా: అయ్యిందా మీ వుపన్యాసం? మిమ్మల్ని చంపాలని నేను ప్రయత్నించానా? (అదోలా నవ్వి) ఎవరైనా నమ్ముతారా?

సుంద: ఇది నా వూహ. అది తప్పయినా అయ్యిండొచ్చు. అటు వంటప్పుడు యీ గిరిగారే స్వార్థ చింతతో, ఆ అక్రమా నికి పూనుకొని వుండవచ్చు.

గిరి : (కలవరపాటుతో కంపితుడై) అబ్బే...అబ్బే...నాకేమీ తెలీదు

సుంద: మీరు తెలీదంటే సరిపోతుందా యేవిఁటి? తలమీద దెబ్బ తగలగానే, వెనుదిరిగి పడిపోయాను. అప్పుడే మీరూపాన్ని లీలగా చూశాను. మొహపరిచయం లేని వ్యక్తి కాదుగా మీరు?

సుబ్బా: పదండి పోలీసు స్టేషనుకి.

గిరి : (అదిరిపడి) ఎవరు?

సుబ్బా: మీరూను.

గిరి : (చలించిపోతూ) నేనెందుకు? బుద్ధిపూర్వకంగా, అతణ్ణి చంపాలని వెళ్ళలేదు. అదిగో మామగారే నన్ను ప్రోత్సా హపర్చారు. (గంగాధరం వేపు చూపిస్తాడు) మొదట్లో నేనా అక్రమానికి ఒడిగట్టనని అన్నాను. నన్ను బలవం తంగా పంపారు.

గంగా : (సూటిగా, క్రోధంగా చూసి) ఏమిటోయ్ ఆ వాగుడు?

నేను నిన్ను ప్రోత్సహించడమేవిఁటి ? అసలు ఆ విషమే నీతో చెప్పలేదు. అయినా, నాకు యిందులో ఒరిగేదేముందని ? నువ్వు చేసిన నేరాన్ని మరొాహరి మీద రుద్దడమెందుకు ?

గిరి : (హతాశుడై) అదేవిఁటండీ ! నిలువునా అబద్ధమాడుతున్నారేవిఁటి ? మీ అమ్మాయి కోసం పరితపిస్తున్న నన్ను వెర్రివాణ్ని చేసి ఆమెను నాకిచ్చి పెళ్ళి చేస్తాననీ యెఱ చూపించి, యీాయన్ని హత్య చెయ్యమని ప్రోద్బలపరిచింది మీరు కాదూ?

గంగా: (కోపంగానే) పిచ్చిపిచ్చిగా మాట్లాడకు గిరీ !

గిరి : ఇంత అన్యాయం కూడదు మావఁయ్యా!

గంగా: ఇంతవరకూ వచ్చిందటోయ్ ? నీ మనసులో వున్న అక్కసుని తీర్చుకోడానికి, ఆయన్ని హత్య చెయ్యాలని ప్రయత్నించి, ఆ నేరాన్ని నాపై మోపాలని చూస్తున్నావా?

గిరి : (వుక్రోషంతో) ఛీ! ఛీ!! నీ వంటి స్వార్థపరుడు, క్రూరుడు మరొాహడు వుండడు యీ ప్రపంచంలో. సరే—మీరు ఎలా తప్పించుకుంటారో, కోర్టులో నేనూ చూస్తానుగా ?

సుబ్బా: అవన్నీ అక్కడ చూసుకుందాం. ముందు నడవండి. మీరు కూనా పదండి శివరామ్ గారూ ?

శివ : (భయకంపితుడై) నేనా ?

సుబ్బా: ఔను.

శివ : నేనెందుకండీ ? చక్రధారిగారూ, మీరైనా చెప్పండి. నేనెల్లాంటివాణ్నో మీకు తెలుసునుగా !

సుంద: బాగా తెలుసునండీ ! నేను వ్రాసిన వ్రాతప్రతులు, నా అనుమతి లేకుండా నా గది నుండి తీసుకుపోతే, పైగా మీ నేరమేమీ లేదని అడుగుతున్నారా ?

శివ : ఔనండీ ! ఇందులో నా తప్పేమీ లేదండీ ! గంగాధరంగారే యీ పుస్తకాన్ని నాకిచ్చారు. మిమ్మల్ని చంపించినట్టు కూడా నమ్మించారు. నన్నేం చెయ్యమంటారు చెప్పండి ?

సుంద: ఓహో ! నన్ను చంపించినట్టు ఆయన చెప్తే, మీరూ నమ్మేశారన్న మాట ?

శివ : (తడబడి) మరి, అటువంటి పెద్దమనిషి చెప్తుంటే, నమ్మకుండా యెలా వుండడం చెప్పండి ?

సుబ్బా: దాపుంది కోర్టులో మీరు యీ మాటలే చెప్పాలి తెలుసా?

శివ . (సవినయంగా) చిత్తం...చిత్తం...వున్న విషయం చెప్పడానికి భయమేవిఁటండీ ?

గంగా: (క్రోధంగా చూసి) చెప్తావూ ? సరే.. మీ మేనత్త హత్య విషయం కూడా వున్న విషయమేగా ?

శివ : (హడలిపోయి) బాబ్బాబూ! సాక్ష్యం చెప్పనండి. నాపిల్లల మీద ఒట్టు.

గంగా: ఆ ! అలా దారికి రా !

సుబ్బా: ఏవిఁటిదంతా ? సరే! మీ మేనత్త హత్య విషయం ఆరా తీయిస్తా నుండండి.

శివ : (మనిషి వణికిపోతాడు. మొహం స్వేదంతో నిండిపోతుంది. ఒక్క అంగలో సుందరం దగ్గరికి పోయి, అతని రెండు చేతులూ పట్టుకుని ప్రాదేయపూర్వకంగా) చక్రధారిగారూ! యీ సమయంలో మీరే నా దిక్కు. మీరే నన్ను రక్షించాలి. ఈ వ్యూహం నుండి బైటికి లాగాలి. పిల్లల గలవాణ్ణి. మీ పుస్తకాలన్నీ నేనే ప్రచురిస్తాను. కావాలంటే పైకం ముందుగానే యిస్తాను. ఏదో తెలీక యీ వలలో చిక్కుకున్నాను. యివి చేతులు కావు కాళ్ళు. నన్ను రక్షించండి.

సుంద: ఈ ఆలోచన మొదట్లో వుండవల్సిందండీ ?

శివ : బుద్ధి గడ్డి తిన్నదని ఒప్పుకుంటున్నాను కదండీ !

సుంద: సరే తర్వాత ఆలోచిద్దాం. ముందు నడవండి..
(ఎవ్వరూ కదలరు)

సుబ్బా. ఏవండీ గంగాధరంగారూ నడవండి [గంగాధరం నీరసంగా దృక్కులు ప్రసరిస్తాయి]

సుంద: ఏవండీ గంగాధరంగారూ అలా నిల్చున్నారేం ? మీ మర్యాద మంటగలుస్తుందని గుర్తుకొస్తుందా ? నలుగుర్లో మొహమెత్తుకు తిరగడం యిక దుర్లభమని యోచిస్తున్నారా? ఈ యోచన, యీ విచక్షణ మొదట లేకపోయిందా ?

సుబ్బా: ఊఁ....కాలయాపన చేయకండి ..పదండి....

గిరి: (కళ్ళనీరు తిరుగుతుంటే) మావఁగారూ! యేదో పరిష్కార మార్గం ఆలోచించండి. మీ బ్రతుకుతో బాటు నాబ్రతుకు రచ్చకెక్కించకండి. నేను యువకుణ్ణి, ఎన్నోయేళ్ళు గౌరవంగా బ్రతుక వల్సిన వాణ్ణి, నాబ్రతుకు నాశనం చెయ్యకండి...మీరైనా మీ తప్పును ఒప్పుకోండి.

గంగా: (క్షణం యోచించి గట్టిగా నిట్టూరుస్తాడు) చక్రధారిగారూ; జరిగిందేదో జరిగిపోయింది. అదంతా ఓ కలగా భావించి మర్చిపోండి. నేను చేసిన తప్పుకు పశ్చాత్తాప పడుతున్నా. నా గౌరవాన్ని కాపాడమని అభ్యర్థిస్తున్నా.

సుంద: ఇప్పుడు పశ్చాత్తాపపడి ప్రయోజనమేముందండీ? 'అందితే జుత్తు అందకపోతే కాళ్ళు' అన్నవిధంగా వుంది మీధోరణి లాభంలేదు సమయం మించిపోయింది.

గంగా: పెద్దవాణ్ణి...ప్రాధేయపడుతున్నాను.

సుబ్బా: ఈ ప్రాధేయతలు యిప్పుడు ఫలించవు. నడవండి.

గంగా: (బొంగురు గొంతుతో) చక్రధారిగారూ! నాగౌరవం, నా మర్యాద, నా ప్రతిష్ట యిప్పుడు మీచేతిలో వుంది నడి వీధిలో నన్ను చిత్రవధ చెయ్యకండి. ఈ ఆపదనుండి నన్ను కాపాడండి.

శివ : చక్రధారిగారూ; మీరు సహృదయులు. అపకారం చేసిన వాళ్ళకి వుపకారం చెయ్యడయే సజ్జనుల కర్తవ్యం. ఆ గౌరవం మీరు దక్కించుకోండి. లేకుంటే, యే పాపమూ యెరుగని నేనుకూడా రచ్చకెక్కవల్సి వస్తుంది.

సుంద: (కాస్తంత కరిగిపోయి—సుబ్బారావు వేపుచూస్తూ) ఏవిఁటండీ సుబ్బారావుగారూ; వాళ్ళు తమతప్పులు తెలుసుకుని, పశ్చాత్తాపంతో పరితపిస్తూ వున్నారు. ఇప్పుడు మనం యేం చేద్దామంటారు?

సుబ్బా: ఇంత నవనీత హృదయుడవైతే యెట్లాగయ్యా మహాను భావా? నిన్ను హతమార్చాలని ప్రయత్నించిన వారినే రక్షింప జూస్తున్నావా?

సుంద: తప్పు తెలుసుకుని పశ్చాత్తాప పడ్డమే, వారికి తగిన ప్రాయశ్చిత్తం.

సుబ్బా: కాని, నేనిప్పుడేం చెయ్యగలను? ప్రభుత్వ వుద్యోగిగా నా విధి నేను నిర్వర్తించు కోవాలిగా;

సుంద: వద్దని యెవరూ అనడంలేదు. కాని, యిప్పుడు నేను నా రిపోర్టును వుపసంహరించుకుంటే?

సుబ్బా: అలాగవుతే, అభ్యంతరంలేదు.

గంగా: (ప్రాణం లేచి వచ్చినట్టయి) నిజంగా, మీవంటి వుత్తముల్ని వుక్కడింప జూచిన మేం క్షంతవ్యులం కాదు చక్రధారిగారూ: మాపాపాలకు తగిన ప్రాయశ్చిత్తంలేదు.

సుంద: లేకేం; వుందండీ: ఏవివాహం నిరోధించడానికైతే, నన్ను తెగటార్చడానికి ప్రయత్నించారో, అది యిప్పుడు జరగాలి.

గంగా: అంటే?

సుంద: అర్థంకాలేదూ? మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి. అన్యోన్యంగా ప్రేమించుకుని మనసుల్ని పెనవేసుకున్న మమ్మల్ని వేరుచెయ్యడం కూడా మీకు భావ్యంకాదు

సుబ్బా: సుందరం! (ఆశ్చర్యంగా చూసి) ఏవిఁటిది!

సుంద: ఔను సుబ్బారావ్! ఆమెను విడిచిపెట్టుకోలేను...నా కేసు వుపసంహరించుకోవడానికి ప్రబలకారణం కూడా యిదేను.

గిరి: (వుక్రోషంతో) అది అసంభవం! వాళ్ళ అమ్మాయిని, నాకిచ్చి వివాహం చేస్తానని మాటిచ్చారు మావఁగారు.

సుబ్బా: (వెటకారంగా) ఓహో: అలాగా: అవుతే సరే! ముందు పోలీసుస్టేషనుకి నడవండి...అక్కడే ఆ పెళ్ళి జరుగుతుంది. మీరు చేసిన నేరానికి శిక్ష యేవిఁటో తెలుసునా? యావజ్జీవ కారాగార వాసం.

గిరి; (గుడ్లు తేలవేసి) యావజ్జీవమే!

సుం: ఏం భయంకరంగా వినిపిస్తుందా ఆ మాట?

గంగా: సుబ్బారావుగారూ! (ఒక నిర్ణయానికి వచ్చి నిట్టూరుస్తూ) ఇంక అవన్నీ మర్చిపోండి. చక్రధారిగారూ చెప్పిన షరతుకి సమ్మతిస్తున్నాను.

గిరి: మావఁయ్యా ఒప్పుకుంటున్నారేమిటి?

శివ: అబ్బ! మీరూరుకోండి గిరిగారూ; ఎలాగో యీ వ్యూహం నుండి తప్పుకుని బైటపడ్డం ముఖ్యం గాని, మీ వివాహం ముఖ్యంకాదు.

గిరి: అలాగవుతే. నేనే కేసుపెడతా.

సుంద: (నవి) మీగోతిని మీరే త్రవ్వుకుంటున్నారన్నమాట: మీ య్యానేరాన్ని మర్చి పోతున్నారా?

గంగా: అబ్బబ్బ: యిక వూరుకోండి సుందరంగారూ: అతనితో యేఁవిటి?

సుంద: అవుతే, మావివాహానికి యిష్టపడినట్టే నన్నమాట.

గంగా; ఇన్నిసార్లు మీరు అడగాలటండీ?

సుబ్బా: మాట తప్పి, మళ్ళీ చక్రధారి గారి ప్రాణాలతో చెలగాటం ఆడరుకదా?



ఈజిప్టు సాంస్కృతిక బృందంవారు గత ఫిబ్రవరి 26వ తేదీన హైద్రాబాదులో నృత్యనాటికలు ప్రదర్శించారు శృంగారమైన వేషధారణ ఈ ప్రదర్శనల ప్రత్యేకాకర్షణ. ఆకర్షణీయమైన నాట్య భంగిమలో ఒకనర్తకిని ఈ చిత్రంలో చూడవచ్చును.



"ఆర్థికాభివృద్ధి—జాతీయకరణ" అనే విషయంపై హైద్రాబాదులోని సమాచార, ప్రజాసంబంధములశాఖ కార్యాలయంలో గత ఫిబ్రవరి 28వ తేదీన కళాశాల విద్యార్థీవిద్యార్థినులకు వక్తృత్వ పోటీజరిగింది. ప్రథమ బహుమతి పొందిన న్యాయ కళాశాల విద్యార్థిని కుమారిఅన్నపూర్ణ ప్రసంగిస్తుండటం ఈ చిత్రంలో చూడవచ్చు.



ఒరిస్సా కళాకారులు: ఒరిస్సా రాష్ట్రానికి చెందిన కళాకారులు గతమార్చి 12వ తేదీన హైద్రాబాదులో సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు.



ఆరవ అఖిలభారత అగ్నిప్రమాదాల నిరోధక సప్తాహం సందర్భంగా గత మార్చి 6 వ తేదీన హైద్రాబాదులో శకటాల ఊరేగింపు జరిగింది.



హైద్రాబాదు జిల్లా మేడ్చల్ పంచాయతీ సమితిలోని 'చిన్నబందంకుంట' గండ్లను మరమ్మతుచేసే నిమిత్తం సూరారం కిసాన్ క్లబ్ అధ్వర్యంక్రింద గత జనవరి 8వ తేదీనుంచి 17వ తేదీవరకు భారత్ సేవక్ సమాజ్ శిబిరంవారు శ్రమదానం చేశారు.



రాత్రి కాపలాదారు: హైద్రాబాదు సాలార్ జంగ్ వస్తుప్రదర్శనశాలలోని ఒక అద్భుతమైన ప్రతిమ.



మద్రాసులో జరిగిన రెండవ జాతీయ వ్యవసాయ ప్రదర్శనంలో నెలకొల్పిన ఆంధ్రప్రదేశ్ మంటపానికి ప్రథమ బహుమతి లభించింది. ఈ ప్రదర్శనం గత నెలలో ముగిసింది. ఆంధ్రప్రదేశ్ మంటపంలో ఒక చిత్రాన్ని మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ నాడార్ ఆసక్తితో తిలకిస్తున్న దృశ్యం.




శ్రీమతి లలితాసచాం గతమార్చి 1వ తేదీన హైద్రాబాదు జూబిలీహాలులో ఏడవ త్రైమాసిక బహుమతిపత్రాల 'డ్రా'ను ప్రారంభించారు.



ప్రసూతిశాల: మంత్రి శ్రీ పి. వి. జి. రాజు గతఫిబ్రవరి 14వ తేదీన సాలూరులో "ఆరిశెట్టి గున్నయ్య ప్రసూతి ఆలయా"నికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీ ఆరిశెట్టి సత్యనారాయణమూర్తిగారు రూ. 10,000 ల వ్యయంతో దీనిని నిర్మించి ప్రజల వినియోగానికై దానంగా ఇచ్చారు.



ఆంధ్రప్రదేశ్ క్రొత్తమంత్రులు గత మార్చి 12 వ తేదీన హైద్రాబాదు రాజ్‌భవన్‌లో పదవీ ప్రమాణ స్వీకారం చేశారు. ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ప్రమాణస్వీకారం చేసిన పిమ్మట రిజిష్టరులో సంతకం చేస్తున్నదృశ్యం.

గంగా: (గాభరాపడి) ఎంత మాటన్నారు? మళ్ళీ గడ్డితింటానా? అయినా, యిప్పుడు అల్లుడౌతున్నాడు కదండీ!

సుబ్బా: ఒకవేళ ఆ ప్రయత్నం జరిగిందా, ప్రప్రథమంగా నేరం మాత్రం మీమీద మోపబడుతుంది.

గంగా: అబ్బే: నామీద యింకా మీకు నమ్మకం కలగడం లేదా?

గిరి: (పుడుకు మోత్తనంతో) అవుతే, యిందుకేనా మావయ్యా నన్ను రప్పించారు? నేను చూస్తుండగానే, జానకి వివాహం మరొకరితో జరుపుతారా?

గంగా: ఏంచెయ్యను గిరీ! పరిస్థితులు మనకి అనుకూలంగా లేనవుడు, తల వంచాల్సిందే: నువ్వు యావజ్జీవ కారాగారావాసం అనుభవించడం నాకు మాత్రం యిష్టంగా వుంటుందా చెప్పు? నీకోసమే ముఖ్యంగా 'వూఁ' అన్నాను.

గిరి: (కోపంగా) నామీద యెంతో జాలి వున్నట్టు చెప్తున్నారు: హూ...నేనిక్కడ ఒక్క క్షణం కూడా వుండను.

గంగా: (నిశ్చలంగా) వుండమని నేనూ చెప్పను.

(గిరి తీక్ష్ణంగా గంగాధరం వేపుచూసి, కోపం–దుఃఖం మిళితమై ముంచుకొస్తూ వుంటే చరచరా లోపలికి పోతాడు)

సుంద: (నిట్టూర్చి) పాపం: అమాయకుడు...ఎవరేం చెబితే అదే నమ్మేస్తాడు.

శివ: హమ్మయ్య: తుపాను వచ్చి పోయినట్టయ్యిందండీ! ఇప్పుడు కాస్త వూపిరాడుతూ వుంది. మరి, నాకు శలవిప్పిస్తారా?

సుంద: మంచిది. వెళ్ళండి. ఇలా యెప్పుడూ మోసం చెయ్యకండీ?

శివ: ఇంకానా: ఇదుగో లెంపలు వేసుకుంటున్నాను. (లెంపవేసుకుంటాడు.) ఇదిగోండి, యీ పుస్తకం పెళ్ళినరికే ప్రచురించేస్తాను, సరిగ్గా ఆరోజే మీకు దీని డబ్బు కూడా ముట్టజెప్తాను

సుంద: (మందహాసంతో) ఒక్క సంఘటనతో, యెంతగా మారిపోయారండీ మీరు?

[అప్పుడే గిరి ఓ సూటుకేసు పట్టుకుని లోపల్నుంచి వస్తాడు. ఎవ్వరూ మాట్లాడరు. గిరి గంగాధరంవేపు, సుందరం వేపు చురచుర చూస్తూ బైటికి పోతాడు.]

గంగా: శని విరగడయ్యింది:

సుంద: చాలా ఆలస్యంగా గుర్తించారండీ గంగాధరం గారూ:

గంగా: లేదు మందుపడితేనేగాని రోగం కుదరదంటారు అందుకే:

సుబ్బా: సుందరం, మరినేను వస్తానోయ్...

సుంద: నీకు చాలా శ్రమ కలిగించాను సుబ్బారావ్. మిత్రుడివిగాబట్టి, యీ సమయంలో యీ విధంగా నన్ను ఆదుకున్నావు. నీమేలు యెన్నటికీ మర్చిపోను. నీ సహకారం వల్లనే నేను ఒక యింటివాణ్ణి అవుతున్నాను. పెళ్ళి నీ చేతుల మీదుగానే జరగాలిసుమా:

సుబ్బా: (నవ్వుతూ) అలాగేలే...వస్తామరి: వస్తానండీ గంగాధరం గారూ...

గంగా: ఇప్పుడెక్కడికి వెళ్తారండీ; ఈ పూట అతిథిగా వుండి, యిక్కడే భోజనం చేద్దురుగాని.

శివ: (నవ్వుకుంటూ)ఉన్నవూరువాణ్ణి...నన్ను వుండమనరుగా! వస్తామరి... అందరికీ నమస్కారం... (నమస్కరిస్తూ మెల్లగా జారుకుంటాడు)

(ముగ్గురు నవ్వుకుంటారు)

గంగా: మీరిద్దరూ స్నానానికి లేవండి...వంట యేర్పాట్లు చేయిస్తాను... (లోపలికి పోతాడు)

సుంద: (గంగాధరం పోయిన వరకూ ఆగి సుబ్బారావు భుజం తట్టుతూ) భేష్; బాగా నటించావురా, సుబ్బారావ్! చూశావా, (మెల్లగా రహస్యం చెప్తున్నట్టు) నాటకం పిస్టల్ యెంతగా వుపయోగ పడిందో;

సుబ్బా: (మెల్లగా) గట్టిగా ఆ మాట అనకురా...నీరూమ్‌కి పద...

(ఇద్దరూ కుడివేపు గదికి వెళ్తుండగా)

—తెర—

## క్రీడారంగము

ఈ గ్రామీణులలో వివిధరకముల ఆటల పోటీలలో ప్రథమ బహుమతులు పొంది గ్రామానికి మంచికీర్తి తెచ్చిన వారు కూడ కలరు.

## వ్యాపార రంగము

ఈ గ్రామములో (50) మందికిపైగా వ్యాపారస్థులు కలరు. కొంతవరకు దీనిని వ్యాపార కేంద్ర మనవచ్చును. వినిమయదారు లకు కావలసిన వస్తువలన్ని లభించుచున్నవి.

## వైద్యరంగము

ప్రభుత్వ వైద్యశాల లేకపోయినను ఇచ్చట (5) గురు వైద్యులున్నారు. పరిసర గ్రామ ప్రజలకు వైద్య సౌకర్యములు ఈ వైద్యులచే కలుగుచున్నవి.

## తంతి తపాల

ఇచ్చటి తపాల కార్యాలయము సబ్ పోస్టాఫీసుగా మార్చ బడినది. టెలిఫోను సౌకర్యముల గురించి ప్రయత్నము జరుగు చున్నది.

## మంచి నీటి సమపాయములు

ఇచట మంచి నీటి బావులు (7) ఉన్నవి. అందు (4) ప్రభుత్వమువారు త్రవ్వించినవి (3) ప్రజలు స్వయముగా నిర్మించినవి. గ్రామ ప్రజలకు మంచి నీటి సౌకర్యముకలదు.

## మందిరము

ఇచ్చట దేవాలయము, ఒక ధర్మశాల. ఒక హాలు, వంటశాల, గదితో కూడికొని యున్నది. దీనిని యిరువై సంవత్సరములకు పూర్వమే గ్రామస్థులు నిర్మించిరి ఇందు సభలు, సమావేశములు, హరికథలు, పెండ్లిళ్ళు జరుపుకొనుటకు వీలు కల్పించబడుచున్నది.

## కట్టడములు

పాఠశాల భవనములో (16) గదులు కలవు. అందు కంట్రి బ్యూషన్ పద్ధతిన (10) గదులు నిర్మించిరి (3) గదుల పెంకుటిల్లు గ్రామస్థులచే నిర్మింపబడినది. రేడియో, పెట్రోమాక్స్, మైకు, బావికి కరెంటు మోటారు, గదులలో కరెంటు, పాఠశాలకు కావల సిన యితర సౌకర్యములు గ్రామ ప్రజలచే కల్పించబడినవి.

2) ఉన్ని మరియు గొఱ్ఱెల అభివృద్ధి కేంద్రము ప్రభుత్వ ముచే నిర్మించబడినది.

3) చేనేత, ఉన్ని, గ్రామీణ వృత్తుల కొనుగోలుదారుల సహకార సంఘములు, గ్రామీణ సహకార బ్యాంకు తమ స్వంత భవనములు కల్గివున్నవి.

4) చర్మ సహకార కేంద్ర భవనము నిర్మాణములో నున్నది.

## సహకార రంగము

ఈ గ్రామములో పూర్వము సహకార ధాన్యపు బ్యాంకు స్థాపించబడినది, కాని కొన్ని కారణములచే అభివృద్ధిలోనికి రాలేకపోయినది.

## చేనేత సహకార సంఘము

ఈ సంఘములో ప్రస్తుతము (720) మంది సభ్యులు కలరు. రు. (17,102)ల వాటాధనము, రు. (52045)ల వ్యాపార ధనముగల ఈ సంఘము సభ్యులకు పని కల్పించుచు ప్రజలకు బట్టలు అందించుచున్నది.

## ఉన్ని సహకార సంఘము

ఈ సంఘం 1955 సంవత్సరములో స్థాపించబడినది. ఇందు (500) సభ్యులు కలరు ఈ సంఘం వాటాధనం రు (5590) వ్యాపార ధనము రు (27000)లాభము రు. (27252). ఈ సంఘం ఒక స్వంత భవనము, రెండు విక్రయశాలలు కల్గి నవీన పరికరాలు రాట్నములు మగ్గములు అందిస్తూ సభ్యులకు పని కల్పించి వినియోగదారులకు సేవ చేయుచున్నది ఈ సంఘం కృషి ఫలిత ముగా ఇచట గొఱ్ఱెల అభివృద్ధి కేంద్రము స్థాపించబడినది.

## గ్రామీణ సహకార బ్యాంకు

ఈ బ్యాంకులో (1406) మంది సభ్యులు కలరు ఈ బ్యాంకు రు. (47,700) వాటాధనము, రు. (37,000) డిపాజిట్లు రు (30,000) భవన నిధి రు (9200) కలిగి 1961-1962 సహ కార సంవత్సరములోని ఆరు నెలల పదిహేను రోజులలో రు 2 16,000/- విలువచేయు సరకులు సభ్యులకు అందించినది. రు 3,10,000/- స్వల్ప కాలపు అప్పులు ఇచ్చుటయే కాక సరస మైన ధరలకు, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, క్రిమి కీటక మందులు, స్ప్రేయర్లు, డస్టర్లు, పశుగ్రాసములు, కరెంటు మోటార్లు, ఆయిల్ యింజన్లు అందించుచున్నది. సభ్యులలో పొదు పరితనము అలవరచుటకు గ్రెన్ బ్యాంకు, చిట్ ఫండ్ గ్రూపులు నడుపబడుచున్నవి.

## గ్రామీణ వృత్తుల కొనుగోలుదారుల సహకార సంఘము

ఈ సంఘములో (401) మంది సభ్యులున్నారు. వాటాధనము రు. (12110), వ్యాపారధనము రు. (49,360) కలదు. స్వంత భవనము, ఒక ఎకరము భూమి కల్గియుండి కుటీరపరిశ్రమల అభివృద్ధికి సహకరించుచున్నది. ఖాది, అంబర్ దారము. కిసాన్ చర్ఖా దారము, నబ్బులు, నూనెలు ఉత్పత్తి చేయుచున్నది.

## చర్మ పార్రిశామిక సహకార సంఘము

ఈ సంఘములో (58) మంది సభ్యులు కలరు. రు (725) వాటాధనము కలదు. ప్రభుత్వముచే ఆర్థిక సహాయము ఇంతవరకు లభించలేదు. చర్మ వస్తువులు ఉత్పత్తి చేసి విక్రయము చేయుచున్నది.

## కుమ్మరి పారిశ్రామిక సహకార సంఘము

ఈ సంఘములో (58) మంది సభ్యులున్నారు. రు. (725) వాటాధనము కలదు. సభ్యులు మట్టి పాత్రలు చేయుచు గ్రామీణులకు అందజేయుచున్నారు. ప్రభుత్వమునుండి ఆర్థిక సహాయము ఇంకనూ లభించలేదు

## కఱ్ఱ మరియు ఇనుప వస్తువుల పారిశ్రామిక సహకార సంఘము

ఈ సంఘములో (66) మంది సభ్యులు కలరు. వాటాధనము రు. (1650) వ్యాపార ధనము రు. (9150) కలిగి ఉన్నది. ఇందు ఇనుప నాగండ్లు. పీడర్లు. సైడ్ మరలు, కర్ర వస్తువులు, మేజాలు, బల్లలు, కుర్చీలు ప్రభుత్వముచే ఆర్డరు పొంది తయారు చేయబడుచున్నవి. ఇనుప మరియు కఱ్ఱ వస్తువుల కేంద్రములు రెండునూ ఒకే చోట పని చేయుచున్నవి.

## గృహ నిర్మాణ సహకార సంఘము

ఈ సంఘములో (25) మంది సభ్యులున్నారు. రు. (2,500) వాటాధనము కలదు, ఇంక పని ప్రారంభింప వలసియున్నది.

## పరపతి సహకార సంఘము

ఇది గ్రామీణ బ్యాంకులో లీనము కావలసియున్నది

ఇదే గాక ఇచట వైద్య సహకార, పాల సరఫరా, మార్కెటింగ్, భూ తనఖా బ్యాంకు, సహకార వ్యవసాయ ఫలముల ఉత్పత్తిదారుల సహకార సంఘము, ఒక విద్యార్థి వసతి గృహము, ఒక గ్రంథాలయమును స్థాపించుటకు కూడా ప్రయత్నములు జరుగుచున్నవి. కాని ఇచట కార్యకర్తల లోటు కలదు.

పై సహకార సంఘములు ఒక ముల్కనూరు గ్రామ ప్రజలకే కాక పరిసర గ్రామ ప్రజలకుకూడా సేవ చేయుచున్నవి. గ్రామములో నిరుద్యోగము లేదు. ప్రతి వ్యక్తికి పని దొరుకుటయే గాక యితర గ్రామాల కూలి ప్రజలు ఈ గ్రామములో కూలి పనికి వచ్చుచుందురు. పై అభివృద్ధికి ముఖ్య కారకులు గ్రామ ప్రజలే. ఈ అభివృద్ధికి పెద్దలలో నున్న సహకార సహన గుణములే కారణములు. ముల్కనూరు గ్రామీణులు అభివృద్ధిపొంది పరిసర గ్రామాలకు మార్గదర్శకులగుచున్నారు. కాని గ్రామము ఇంకా అభివృద్ధి పొందవలసి ఉన్నది, ప్రతి పిల్లవానికి విద్య, ప్రతి వ్యక్తికి వైద్య సహకారము, ప్రతి వ్యక్తికి తన ముసలితనములో ఆధారము, ప్రతి వ్యక్తికి ఇల్లు, పనికి తగ్గ ఫలితము, పొదుపరితనము, గ్రామములో దైవశక్తి తద్వార నీతి నియమములు, ధర్మము—ఇవన్నియు సాధించవలసి ఉన్నవి. కావున గ్రామీణులు కుల, మత, రాజకీయ పార్టీ కక్షలు లేకుండా ఇంతవరకు పనిచేయుచున్నట్లే ఇకముందు కూడ సహకార సహజీవనము కొరకు కృషి జరిపి ఈ గ్రామము అన్ని రంగాలలో ఆదర్శ గ్రామముగా రూపొందగలదని ఆశించవచ్చును. ★



ఆటవిక జాతులు:

# సవరల వ్యాధులు-చికిత్సలు

శ్రీ జి. వి. రామమూర్తి

ఎవరికి ఏ చెడుగు వచ్చినా, ఏ వ్యాధి వచ్చినా ఎవరు చనిపోయినా ఏ భూతానికో కోపం వచ్చిందనే సవరలు అనుకుంటారు. ఆ భూతం తనంతటతానే ఆ చెడును తలపెట్టి ఉండవచ్చును. లేక ఇంక ఎవరైనా చిల్లంగిపెట్టి ఆ భూతం చేత ఆ పనిని చేయించి ఉండవచ్చును, అని కూడా అనుకుంటారు.

ఎవరికి ఏ బాధవచ్చినా వెంటనే వారు మాంత్రికుని వద్దకు వెళ్లి ఏ భూతానికి కోపం వచ్చిందో అడుగుతారు. ఆ భూతానికి ఆ కోపం ఎందుకు వచ్చిందో కూడా అడుగుతారు. ఎవరైనా చిల్లంగి పెట్టేరేమోనని కూడా కనుక్కుంటారు. ఇంతకూ ఆ బాధను అనుభవిస్తున్నవాడు ఏం తప్పును చేశాడో అడుగుతారు. వాడి బాధ పోవడానికి ఏ ప్రతిక్రియ చేయాలో, మొదలయిన అనేక విషయాలు ఆ మాంత్రికుడ్ని అడిగి తెలుసుకుంటారు

మాంత్రిక ప్రతిక్రియ కూడా లేందే ఏ మందూ పుచ్చుకోరు. పుచ్చుకున్నా ఆ మందు పని చేయదని వారి పూర్తి నమ్మకం. మాంత్రికుడు ఏ భూతానికి కోపం వచ్చిందని చెప్తాడో ఆ భూతానికి వీలయినంత త్వరలో యివ్వవలసిన బలిని యిస్తారు. తర్వాత ఒక బలికుండను ఏర్పాటు చేస్తారు. ఆ కుండ నిండా అన్నం పెట్టి అందులో ఒక అల్లం ముక్కను, ఒక రాగి పైసాను కూడా వేస్తారు. ఆ కుండను యింటి చూరుకు కడతారు. దానితో ఆ భూతానికి తృప్తి కలిగి మరి ఎవర్నీ ఆ యింట్లో బాధించకుండా ఉంటుందని వారికి ఎంతో నమ్మకం. కొన్ని వ్యాధులు వచ్చినప్పుడు బలి యిచ్చినా దిష్టి కూడాతీయిస్తారు.

'కన్నిబోజ్' అనే చాలా చెడ్డదైన ఒక ఆడ భూతం వలన చిన్న పిల్లలకు మూర్ఛ రోగం వస్తుందంటారు సవరలు. ఈ భూతం అడవులలో పెద్ద పెద్ద చెట్లమీద నివాసముంటుందిట. ఆ మూర్ఛ రోగికి మందు యిస్తున్నా, ఆ భూతానికి చేయవలసిన పూజలు చేస్తారు, మంత్రాలు వేయిస్తారు, తాయెతులు కట్టిస్తారు.

ఈ కన్నిబోజ్ భూతానికి ఏనుబోతుల్ని బలి యివ్వాలి. చేయవలసిన పూజలలో కొంతవరకు సాయంత్రం పూట యింటి వద్దనే చేసి తర్వాత పూజలు రాత్రిపూట ఊరి వెలుపల అడవిలో చేయాలి. అంతే కాదు, భూత వైద్యుడు సిరికేసనము గింజలను హారంగా గుచ్చి రోగి మెడలో వేస్తాడు. ఆట రకాల మూలికలను నూరి, మందు చేసి రోగికి యిస్తాడు. నత్తగుల్ల పరిమాణంలో రోజుకు రెండు సార్లు పదిహేను రోజుల పాటు యీ మందును రోగి సేవించాలి, ఈ చికిత్సను పొందుతున్న కాలంలో రోగి పథ్యం కూడా చేయాలి.

ఎటువంటి పెద్ద వ్యాధి అయినా సరే, చిన్న దెబ్బ అయినా సరే ఏదో ఒక భూతంవల్ల వచ్చిందనే నమ్ముతారు గనుక భూత వైద్యుడు ఆ భూతాన్ని రోగినుండి ఒక చెట్టులోకిగాని, యింక దేనిలోకి అయినా పంపించేసేటట్టు తన చేత్తో దారి చూపిస్తాడు.

భూతములకన్నా, చిల్లంగి పెట్టేవారిని చూస్తే సవరలు ఎక్కువ జడుస్తారు. ఈ చిల్లంగి విద్యను నేర్చుకున్నవారు రెండు రకాలు, అని అంటారు. కొంత మంది తమకు కిట్టనివాళ్లకు, తమ సహాయం కోరినవారికి కిట్టని వాళ్లకు చిల్లంగి పెట్టి పగ తీర్చుకుంటారు. కొంత మంది ఎవరకూ చిల్లంగి పెట్టరు కాని ఎవరైనా చిల్లంగి పెడితే దానికి విరుగుడు మంత్రం వేస్తారు. ఇటువంటి వారిని సవరవారు ఎక్కువగా గౌరవిస్తారు. చిల్లంగి పెట్టి పగతీర్చుకునేవారిని చూస్తే చాలా అసహ్యించు కొంటారు.

ముందారీ వారయితే యీ చిల్లంగి పెట్టేవారిని తలకిందకు, కాళ్లు మీదకు పెట్టి, చెట్టు కొమ్మకు కట్టి, కింద మంట పెట్టి వాటి చుట్టూ నృత్యం చేస్తారుట

పూర్వం నుండి మనవారికి సవర మంత్రాలంటే నమ్మకము ఉన్నట్టు వేదాల వల్లనే తెలుస్తున్నది. ఈ సవరలకు మొదటి నుండి వైద్యం తెలిసినట్టు కనబడదు. ఇటీవల ఇతరులతో వీరికి సంపర్కం కలిగిన తర్వాతనే వీరు మూలిక వైద్యం నేర్చుకొని ఉంటారని మనవారి అభిప్రాయం మన పూర్వులకు కూడా మంత్ర చికిత్స మీద ఎక్కువ నమ్మకముండినట్టు కనబడుతుంది ఇప్పటికీ మనవారు పాము మంత్రం, తేలు మంత్రం, యిరుకు మంత్రం వేస్తున్నారు ఇవన్నీ మనవారు సవరల నుండి నేర్చుకున్నవేనని కొందరు అంటారు. సవరలు కూడా మనవారిలాగే గ్రహణంనాడే మంత్రాలను యితరులకు నేర్పుతారు.

అనాదినుండీ కాకపోయినా చాలాకాలం నుండీ, వివిధ రోగాలకు వివిధ మూలికలతో మందులు తయారు చేసి చికిత్స చేయడం సవరులు కూడా నేర్చుకున్నారు. కాని వీరు శరీర శాస్త్రం తెలుసుకుని వైద్యం చేయడం లేదు రోగ నిదానం వారికి తెలియదు. తరతరాలుగా మూలికా వైద్యం వారికి అలవడింది అలవాటుతో బాటు అనుభవం వల్ల కూడా వారు వైద్యం చేస్తున్నారు. మొన్న మొన్నటి వరకు వారికి లిపి అంటూ లేక వ్రాయడం, చదవడం అంటూ తెలియక పోవడంవలన వారికి వస్తుగుణదీపిక అంటూ లేదు.

సవర వైద్యుడు మూలికలకోసం అడవిలోకి వెళ్ళేటప్పుడు చిన్న బుట్టతో అన్నం తీసుకు వెళ్తాడు. ఏ మూలికను తవ్వాలో ఆ చెట్టు వద్ద కూర్చుని, బుట్టలోని అన్నం మెతుకులను కొన్నిటిని అక్కడ జల్లి, సవర భాషలో మంత్రం చదువుతాడు. ఆ సవర మంత్రానికి తాత్పర్యం :

"ఓ పెద్దల్లారా ! దేవుళ్ళూ, దేవతలూ వేసిన యీ చెట్లను రోగ చికిత్సకు ఉపయోగించడం మీరు నేర్చుకున్నారు. మీకు నమస్కరించి యీ మూలికలను నేను తవ్వుతున్నాను. మీ వరప్రసాదముగా యీ మూలికల ఉపయోగాన్ని నేనూ నేర్చుకున్నాను." అని

ఆ మూలికతో మందు తయారు చేసి ఆ మందును రోగికి యివ్వడానికని అతని ముందు కూర్చుని, ఆ యింటివారు చిన్న బుట్టతో తెచ్చి యిచ్చిన అన్నంలోని కొన్ని మెతుకులను తీసి నేలపైని జల్లి మళ్ళీ మరొక మంత్రం చదువుతాడు.

"ఓ పెద్దల్లారా ! ఓ దేవతల్లారా ! పూర్వ వైద్యుల్లారా ; ఇదిగో రోగి, ఇదిగో మందు, దీన్ని యితనికి యిస్తున్నాను. ఇతడు రోగవిముక్తుడు అగుగాక ; సంతోషంగా ఉండుగాక ; ఇతనికి రోగం పోయి ఆరోగ్యం చేకూరిన తర్వాత జంతువులను, కోళ్ళను మీకు బలియిస్తాను. మీ సేవచేసి నమస్కరిస్తాను." అని ప్రార్థించిన తర్వాతనే రోగికి మందు యిస్తాడు

చిల్లంగి వల్ల ఎవరికైనా రోగం వచ్చిందంటే దానికి విరుగుడుగా 15 మూలికలతో "సోలాన్-అ-రేగమ్" అనే చిల్లంగి మందును తయారు చేసి, అయిదు లోహాలతో తయారు చేసిన తావేజులో దాన్ని కొద్దిగా పెట్టి ఆ తాయెత్తును రోగి మొలకో, చేతికో మంత్ర వైద్యుడు కడతాడు. తర్వాత కోడినో, మేకపోతునో, పందినో రోగ కారణమైన భూతానికి బలి యిచ్చి కొన్ని మంత్రాలు చదివి తంత్ర కార్యాన్ని పూర్తి చేస్తాడు.

సవరదేశానికి చేరువగా ఉన్న మనవారిలో కొంత మందికి సవర మంత్రాల మీద, సవర మందుల మీద నమ్మకముంది. గంజాం, శ్రీకాకుళం జిల్లాలలోని కొంత మంది ఆయుర్వేద వైద్యులు సవరల వద్ద నేర్చుకున్న కొన్ని మందులను వాడి చూశారు ఆ మందులు బాగా పని చేశాయని కూడా అన్నారు. దానికి ఒక ఉదాహరణ : మధు మూత్ర రోగికి చీపురుగడ్డి కషాయం యిస్తే మూత్రంలో చక్కెర తగ్గిపోతుంది. ఈ కషాయాన్ని ఆయుర్వేద వైద్యులు వాడుతున్నారు. ఇది సవరల మందు.

సవరులకు కొన్ని మంత్రశక్తులు ఉన్నాయట. సవర దేశానికి చేరువలో ఉన్న మనవారు నుయ్యి తవ్వించే ముందు సవర మాంత్రికునితో సంప్రదిస్తారు. ఎక్కడ తవ్విస్తే నూతిలో నీరు బాగా పడుతుందోనని. ఆ మాంత్రికులు చెప్పిన చోట తవ్వితే తప్పకుండా నీరు బాగా పడుతుందని చూసినవారు చెప్పేరు. ఇలాంటి శక్తులు సవరలకు అనేకం ఉన్నాయట.

ముహూర్తఫలాలు : సవరలు శుభ ముహూర్తాలు పెట్టడంలో చాలా నిపుణులు. పెళ్లి మొదలయిన శుభకార్యాలకు ఏ లగ్నంలో ఏ నక్షత్రముండగా ముహూర్తము పెట్టాలో వారూ మనలాగే నిర్ణయిస్తారు. మనకు నక్షత్రాలు వేరు, గ్రహాలు వేరు, కాని వారికి అన్నీ నక్షత్రాలే. ముఖ్యమైన నక్షత్రాలు వారికి ముప్ఫయి. ఆ నక్షత్రాలకు సూర్యుడు తల్లి, చంద్రుడు తండ్రి, తల్లి

యీ బిడ్డలను కనగానే చాలా ఆకలివేసి తనపిల్లలనే తింటూ వచ్చిందట. చంద్రుడు (తండ్రి) వెంటనే వెళ్ళి అడ్డుకున్నాడట. కాని యీ లోపునే సగం మంది పిల్లల్ని తల్లి తన పొట్టను పెట్టు కుందిట. అందువల్లనే కన్నతల్లికి జడిసి యీ నక్షత్రాలు పగలు కనబడవని సవరలు అంటాడు.

## సాహిత్య సంగీతములు

సహజమైన ప్రకృతి వాతావరణములో సవరలు నివసిస్తు న్నారు. వారు అనునిత్యమూ ఉండే ఆ అందమైన అడవులలోనికి మనము వెళితే కవిత్వము దానంతట అదే మన నోటి వెంట రావచ్చును. అటువంటిది సవరలు మంచి కవిత్వము చెప్పగల రనడంలో వింత ఏమీ లేదు. అప్రయత్నముగా సహజ ధోరణిలో సవరలు కవిత్వమును అల్లుకుపోతూ ఉంటారు వారు పాడే ప్రతి పాట సరి కొత్తపాటే అవుతూ ఉంటుంది.

దురదృష్ట వశాత్తూ మొన్న మొన్నటి వరకు వారికి లిపి అంటూ లేకపోవడంవలన అనుశ్రుతముగా వారి సాహిత్య స్రవంతి లిఖిత రూపములో లేకుండానే ప్రవహిస్తున్నది. పాత పాటలు ఒకరి నోటి నుండి ఒకరికి తరతరాలుగా వస్తున్నా ఎప్పటి కప్పుడు మారుతూ కొత్త కల్పనలతో కొత్త పాటలుగా రూపొందు తున్నాయి. "పాత పాటలు పాడకోయ్! కొత్త పాటలు పాడ వోయ్!" అంటుంది ప్రేయసి ప్రియునితో. సరికొత్త పాటలను కల్పించి పాడడము వారికి అవసరమయి పోయింది. అందువల్ల చిన్నా, పెద్దా అందరకూ కవిత్వం అలవడింది.

ప్రకృతిని చాలా చక్కగా పరిశీలిస్తారు సవరలు. పక్షుల కూతలను, జంతువుల అరుపులను నేర్పుతో అనుకరించగలరు వారు. వాటి అరుపులను బట్టి, కూతలను బట్టి అవి సంతోషముతో ఉన్నవో, కోపముతో ఉన్నవో, భయపడినవో సులభముగా వారు చెప్పగలరు. అవి ఆడవో, మగవో కూడ పోల్చగలరు. "కుర్ కురోకో" అని కోడి పుంజు అంటుందట. "కుర్ కుర్ కుర్ కురురోకుర్" అని కోడిపెట్ట అంటుందిట. "మే ఖోంగ్ మేకోజ్" అని మగనెమలిన్నీ "పెకొంగ్ పెకోజ్" అని ఆడనెమిలిన్నీ అంటాయట.

చాలా నిశితమైన పరిశీలన సవరలు చేస్తారు. కనుకనే వారి కవిత్వము ఎక్కువగా ప్రకృతి పరముగా ఉంటుంది. జంతువులు పక్షులను గురించిన పాటలను ఎక్కువగా పిల్లలు కల్పించుకు పాడతారు. వారి పంటికి కనిపించే వడ్రంగి పిట్టను గురించి వారు పాడే పాట యిలా ఉంటుంది.

ఇట్టట్టు చూసి వడ్రంగి పిట్టా
"కుక్ కుక్ మంటూ, తింటాను నేను
తింటాను నేను జీడిపండిప్పుడు
తీయగా" అంటుంద వడ్రంగి పిట్టా
ఇట్టట్టు చూసి వడ్రంగి పిట్టా
"కుక్ కుక్ మంటూ తింటాను నేను
తింటాను నేను నా బొజ్జనిండా
హాయిగా" అంటుంది వడ్రంగి పిట్టా"

ఇదే వరుసలో వడ్రంగి పిట్ట తినే అనేక యితర పండ్ల పేర్లను మారుస్తూ అనేక చరణములను కల్పించి పాడతారు సవర పిల్లలు.

సవర దేశములో తరచుగా వినబడే మరియొక పాట యింత కన్నా మంచిది "గువ్వ పాట" ఉన్నది. ఈ పాటకు పల్లవి కూడా ఉన్నది. ఈ పాటను చాలా కాలం క్రిందటనే ఎవరో రచించి ఉండవచ్చునని, పాట బాగుండడంవలన అనుశ్రుతంగా వారిలో నిలచి ఉన్నదని డా. సీతాపతిగారు తమ సవర పాటలలో పేర్కొ న్నారు. ఆ పాట :

కురీ! కురీ! కురీ!
గాప్లె
గూతాయ్, గూతాయ్, గూతాయ్!!
బురోయ్! జవోంగ్, గంగా జవోంగ్
సాజవోంగ్, సిత్రీజవోంగ్
ఇజ్గాయ్! ఇజ్గాయ్! ఇజ్గాయ్!
గాప్లె
గూతాయ్! గూతాయ్! గూతాయ్:
కుర్రీ! కుర్రీ! కుర్రీ!
గాప్లె
గూతాయ్! గూతాయ్! గూతాయ్!
కురోయ్ జవోంగ్! కంబూరు జవోంగ్
బుడేతేన్‌వాంగ్, ఇజ్జావాంగ్
ఇజ్గాయ్! ఇజ్గాయ్! ఇజ్గాయ్!
గాప్లె
గూతాయ్! గూతాయ్! గూతాయ్!

(తెలుగు అనువాదం)

కురీ కురీ కురీ

అంటూ

కూస్తా కూస్తా కూస్తా

కందులే కాని, జొన్నలే కాని సామలే కాని

తెస్తా, తెస్తా, తెస్తా

అంటూ

కూస్తా కూస్తా కూస్తా

కురీ కురీ కురీ

ఇదే వరుసలో వివిధ కాయ ధాన్యముల పేర్లను పాటలో చేరుస్తూ "కుర్, కుర్" అని కూసే "కుర్ కురాన్" అంటే గువ్వ పాటను వీరు పాడతారు.

తరచు గా వారు చూసే పిట్టలు, జంతువులవలె ఆడవలెనని, పాడవలెనని ప్రయత్నిస్తూ ఉంటారు. ఆ కోర్కె వారు పాడే పాటల్లో కూడా కనబడుతుంది.

"జాంబవంతుని నాట్యమాడుకొందాము

హనుమంతు నాట్యమే ఆడుకొందాము,"

అంటూ యిలాగే అనేక జంతువుల తీరులను పరిశీలించి వారి పాటల్లో పొందుపరుస్తూ పాడుకుంటారు.

తల్లి తండ్రుల వద్ద నుండి నేర్చుకునే పాటలనే కాక అప్పటికప్పుడు పాడగల శక్తి సవర పిల్లలకు పుట్టుకతోనే వస్తుందా అనిపించే ముచ్చటలను డాక్టర్ సీతాపతిగారు తమ రచనలలో తెలియజేశారు. వాటిలో రెండు ముచ్చటలు : వారు ఒకసారి సవరదేశములో నివాసముండగా వారింటి దాసీది తన ఏడు నెలల చంటి పిల్లను తన ఏడు సంవత్సరముల పెద్ద పిల్లకు నిద్ర పుచ్చమని అప్పజెప్పినది చిట్టి చెల్లాయి ఏడుస్తూ ఉంటే ఆ పెద్ద పిల్ల చంటిపిల్లను జోకొడుతూ,

"ఏడువకు ఏడువకు నా చిట్టి తల్లీ

ఏడువకు ఏడువకు మా మంచి పిల్లా

ఏడువకు ఏడువకు బంగారు తల్లీ

ఏడువకు ఏడువకు రాణులా పిల్లా

ఏడువకు ఏడువకు అందాల చెల్లీ

ఏడువకు ఏడువకు గుడ్డంటి పిల్లా,"

అంటూ జోలపాట పాడింది. ఆ పాటకు ఆమె చిట్టి చెల్లి ఏడుపు మాని గునవడం మొదలుపెట్టింది. వెంటనే ఆ పెద్ద పిల్ల పాట వరుస మార్చి.

"ఊరుకో బంగారు పిల్లా—పెద్దపులి వచ్చేను—ఊరుకోవమ్మా

ఊరుకో—అందాల పిట్టా—నాగుల్లు వచ్చేను—ఊరుకోవమ్మా

ఊరుకో—పద్మాలరాణీ—దెయ్యాలు వచ్చేను—ఊరుకోవమ్మా

ఊరుకోఝుంఝుం ఈగా—భూతాలువచ్చేను ఊరుకోవమ్మా,

అని పాడడం మొదలు పెట్టింది. ఆ పాట వరుసకు డాక్టర్ సీతాపతిగారు ముచ్చటపడి బాగా వినాలని గదిలో నుండి బయటకు రాగానే ఆ పిల్ల సిగ్గుపడి పాడడం మానేసింది. "ఫరవాలేదు పాడు, పాట బాగుంది పాడు వింటాను," అని అన్నారుట, యీయన. ఆ పిల్లకు ధైర్యం వచ్చి వెంటనే,

"ఏడువకు ఏడువకు బంగారు తల్లీ

బాబుగారొస్తారు ఊరుకోవమ్మా

ఊరుకో ఊరుకో మా చిట్టి చెల్లీ

ఏడిస్తే బాబుల్లు కోపగిస్తారు,"

అంటూ అశువుగా కల్పించి ఆ ఏడు ఏళ్ళ పిల్ల పాడిందిట!

పెళ్ళి కాకముందే సవరతీ యువకులు అడవులలో కలుసుకున్నప్పుడు ఒకరితో ఒకరు పరిచయము చేసుకొనడము సవరలలో ఆచారము. అందువల్ల యువకుడు తనకు నచ్చినపిల్ల ఒంటరిగా కనబడితే మెల్లగా మాటలు కలిపి పాట వరుసను,

"అందాల రాణీ! ఓ అందాల భరణీ!

వెలగపండూ వంటి అందాల రాణీ!", అంటూ

పాడతాడు, ఆ పిల్లకు యీ యువకుడు యిష్టమయితే,

"అందగాడా! ఓ అందగాడా!

అరటిపండూ వంటి ఓ అందగాడా!", అంటూ

వరుస కలుపుతుంది. దాంతో యువకునికి ఉత్సాహం కలిగి,

"రావే చెలియా! పాడుకొందాం

రావే సఖియా ఆడుకొందాం

నేను మధుపుడ నీవు మధుకరి

నా మధూకపు చెట్ల నీడను,

ఆడుకొందాం మరి పాడుకొందాం", అని

పాడుతూ ఆమెను నాట్యానికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఆమె వెంటనే

"రార ప్రియుడ పాడుకొందాం
రార సఖుడ ఆడుకొందాం
ఆడి ఆడి పాడదాం
పాడి పాడి ఆడదాం
ఆ మధూకపు చెట్ల నీడను
ఆడుకొందాం, మరి పాడుకొందాం." అని

పాడుతూ తన అంగీకారాన్ని సూచిస్తుంది

ఈ విధముగానే ప్రేయసీ ప్రియులు పాడుకుంటూ ఉంటారు ప్రేయసి దేహాన్ని లేత మర్రి ఆకులతోను గేదె తోక తోను, ఆవు తోక తోను పోల్చి పాటలు పాడుతూ ఉంటాడు ప్రియుడు. వారి దాంపత్యము మంగిలి పిట్టల, పిగిలి పిట్టల, గువ్వ పిట్టల దాంపత్యంవలె నుండవలెనని పాడుకుంటారు వారి పాట లన్నిటిలోను వారు నిత్యమూ చూచే పువ్వులతోను, పక్షులతోను, జంతువులతోను వారి వారి అందాన్ని పోల్చి పాటలు కల్పిస్తారు. ఇదివరకు విన్న పాత పాటలను పాడడానికి వారు యిష్టపడరు. కొత్త పాటలనే కల్పించి పాడుకుంటారు.

ప్రియుని రాకకోసం చూసి, చూసి అతడు ఎన్నాళ్లకు రాకపోతే కోపం వచ్చి విరహంతో ప్రియురాలు వుండగా ప్రియుడు వస్తే, "నేనేమో ఏడుస్తూ ఉంటే నీవేమో నవ్వుతున్నావు నేను నిన్నెప్పుడూ రమ్మనలేదు నీవు యింకెప్పుడూ నావద్దకు రాకు వెళ్లవయ్యా వెళ్లు", అంటూ పాడుతుంది. ప్రియుడు ఆలస్యంగా వచ్చాడన్న కోపం కొద్దీ సౌమ్మంటుందే కాని మనసులో సంతోషం కలుగక కాదు.

ఎన్నాళ్లకూ ప్రియుడు రాకపోతే ఒంటరిగా [illegible] విర హంతో తన బాధను చెప్పుకొను [illegible] పక్షులతోను చెప్పుకొని ఏడుస్తుంది. "ఓ ప్రియమైన మైనా! దుఃఖంతో నేను కుంగిపోతూ ఉంటే నువ్వేమిటే అలా సంతోషంగా పాడుకుంటూ కులుకుతున్నావు?," అని అంటుంది

ఆడపిల్లను అత్తవారింటికి పంపించేటప్పుడు పాడే పాటలు కూడా ఉన్నాయి. బావ తన అక్కను తీసుకుని పోవడానికి వచ్చి నప్పుడు మరదలు,

"వడ్లు దంచమని బాధించకుమా
వంట చేయమని వేధించకుమా
పొయ్యి యూదుమని నొప్పించకుమా
కట్టె కొట్టుమని కోపించకుమా."

అని తన అక్కకు కష్టమైన పనులేవీ చెప్పవద్దంటూ,

"పేరంటానికి పంపించవోయ్
నాట్యమాడుటకు పోనీవోయ్
కొప్పు ముడుచుకొని రానీవోయ్
అప్పను ఆటకు వెళ్లనీవోయ్".

అని చెప్పి తన అక్కను సంతోసింప జేయమంటుంది.

తనకు యిష్టంలేని మగడ్ని తన తల్లిదండ్రులు కట్టబెట్ట దలచి నప్పుడు సవరచిన్నది,

"చేపలను బట్టు జాలరి వచ్చె
ఏడుస్తున్నోయమ్మ ఏడుస్తునే
వలయొగ్గి నాడిచటి జలములోపలను
చేపలన్నీ యిచట చెదరి పోయినవి
నన్నుపట్టుకు అతడు వెడలనున్నాడు.
ఏడుస్తున్నోయమ్మ ఏడుస్తునే." (సీతాపతి)

అంటూ ఏడుస్తుంది.

ఎంత పేదవాడు అయినా సవరవాడు తన అతిథుల్ని చాలా ఆప్యాయతతో చూస్తాడు. తనకేమి ఉంటే దాన్నే తన చుట్టాల కిచ్చి అందు సంతోషిస్తాడు.

"నా యింట్లో ఉన్నది ఒకే చాప అదైనా చిరిగిపోయింది. దానినే నా అతిథికి వేసి నేను నేల కూర్చుంటాను. నా యింట్లో రెండే రెండు కోడిపిల్లలున్నాయి అందులో ఒకటే మిగిలింది. దాన్ని నా చుట్టానికి యిచ్చి నేను పచ్చిదే తింటాను." అని పాడ తాడు.

సవరలలో తాగనివారు ఉండరు ఆడా మగా చిన్నా పెద్దా అందరూ కల్లు తాగుతారు. దేవతలకు, దెయ్యాలకు కూడా కల్లును నైవేద్యంగా పెడతారు. అతిథులు వస్తే వారికి కల్లును ఇచ్చి తీరాలి. ఇవ్వకపోతే మర్యాదకాదు. ఏ యింట్లో కల్లు ఉండదో ఆ యిల్లు ఒక యిల్లే కాదంటారు.

అయినా ఎవడైనా తప్పతాగి పడిపోతే వాడ్ని చూసి అందరూ నవ్వుతారు. "అన్నం బాగుండదు. అది నాకు వద్దు. చెరకు పానకం కూడా ఏం లాభం లేదు. కనుక కల్లునే నేను తాగుతాను." అంటూ ఆ తాగిపడిపోయినవాళ్ని చూసి హేళన చేస్తారు. ఆ తాగిన వాడు విని ఊరుకోడు. "నేను రోజంతా దుక్కి

దున్నేను. దున్ని దున్ని అలసిపోయాను. కనుక నేను కల్లునే తాగుతాను." అని సమాధానమిస్తాడు. అ తాగిన వాడ్ని చూసి వాడి పెళ్ళాం కూడా చెప్పుతుంది. ఆమె.

"కల్లుతాగి నామగడు తెలివితప్పేడు.
నాట్యమాడి నామగడు తెలివితప్పేడు", అంటుంది.

ఒకతరం వారి నుండి యింకో తరం వారికి వస్తున్న వారి సాహిత్యంలో పొడుపు కథలు కూడా ఉన్నాయి. వాటిలో ముచ్చటకు రెండు తెలియజేస్తాను.

"ముందు నొక కన్నుంది
వెనుక నొక కన్నుంది
ఏమిటది " ? (పీత)

"చెట్టుక్కి కూర్చుంటుంది
తోకనేమో ఆడిస్తుంది
ఏమిటది ?" (ఉడుత)

"దీని భావమేమి తిరుమలేశా ?" అని అడిగేవి కూడా ఉన్నాయి.

"ఎలుకను పట్టుకు తిన్నది పిల్లి
పిల్లిని పట్టుకు తిన్నది కుక్క
కుక్కను పట్టుకు తిన్నది ఏదో ?
దీని భావమేమి తెలియజెప్పు."

సాధారణంగా సవరలు పాడేటప్పుడు ఫిడేలు వంటి నారి వాద్యం, "గాగ్గోడ్ రాజన్ మీద గాని, వీణ వంటి, "కెంకెన్ రాజన్" మీద గాని వాయిస్తూ పాడతారు. ఎవరైనా పాతపాటలు పాడితే,

"పాత పాటలు నాకు రోతగా ఉంటాయి
పాడరా పాడరా సరికొత్త పాట".

అంటాడు సవరవాడు.



ముందె గల వెన్నొ అందాలు, ముందె గలవు
పాడవలసిన చిక్కని పాట లెల్ల,
ఆడవలసిన చక్కని యాట లెల్ల;
ముందునకు పాగి. సాగిపోదము లెమ్ము!

"మధుగీత"

# ???? ప్రశ్నలు - సమాధానాలు !!!!!

శ్రీ యు. భూమాచారి పట్వారి, బొమ్మెన (గ్రామం), కోరట్ల, కరీంనగరం జిల్లా.

ప్రశ్న: బొమ్మెన గ్రామం ప్రక్కన ప్రవహిస్తున్న పెద్దవాగుకు అడ్డంగా ఒక ప్రాజెక్టును నిర్మించడానికి రెండు సంవత్సరాల క్రితం సర్వే జరిపారు. ఈ ప్రాజెక్టును నిర్మిస్తారా? అయినట్లయితే దీనికి సుమారు ఎంత ఖర్చవుతుంది? దీని క్రింద ఎంత ఆయ కట్టువుంటుంది? ఏయే గ్రామాలకు దీనివల్ల లాభిస్తుంది?

సమాధానం: కరీంనగరం జిల్లా, మెట్‌పల్లి తాలూకా, బొమ్మెన గ్రామంవద్ద పెద్దవాగు పాయకు ఒకదానికి అడ్డంగా ప్రాజెక్టును నిర్మించడానికి సంబంధించిన అంచనాలు పరిశీలనలో వున్నాయి. ఈ పథకం వివరాలు ఈ విధంగా వున్నాయి:

| | |
|---|---|
| (1) అంచనా మొత్తం | 12,52,000/- |
| (2) ఆయకట్టు | సుమారు 900 ఎకరాలు |
| (3) లాభం పొందగల గ్రామాలు | పొసరుపేట, దూలూరు, దుంపేట |

శ్రీ ఎన్. ఆర్. కుమార్ (ఎ) మౌంగ్‌హెల, మాల్మీన్, ఎల్. బర్మా.

ఆంధ్ర ప్రదేశ్‌లో నిర్మించబడుతున్న నాగార్జున సాగర్, తూర్పు పంజాబ్‌లోని భాక్రానంగల్—ఈ రెండింటిలో ఏది పెద్దది?

సమాధానం: నాగార్జునసాగర్ ఆనకట్ట ప్రపంచంలోని రాతి ఆనకట్టలన్నింటిలోకీ పెద్దది. 9.18 మిలియన్ ఎకరాల అడుగుల నీటిని నిలువచేసే శక్తి దీనికి వుంది కాగా భాక్రా రిజర్వాయరులో 7.4 మిలియన్ ఎకరాల అడుగుల నీరు మాత్రమే నిలువ వుంటుంది. కాబట్టి నాగార్జునసాగరే పెద్దది.

శ్రీ జె. లక్ష్మీనారాయణరెడ్డి, గద్వాల, మహబూబ్‌నగరం జిల్లా.

ప్రశ్న: మూడవ ప్రణాళికలోని నిర్బంధ ప్రాథమిక విద్యా పథకం క్రింద, గద్వాల తాలూకా దంతార్‌పల్లి గ్రామంలో ఒక పాఠశాలను తెరిచారు. కాని రోజూ ఉపాధ్యాయుడు గ్రామస్థుల ఇండ్లకు వెళ్లి అడిగినప్పటికీ తలిదండ్రులు తమ పిల్లలను బడికి పంపడానికి ఇష్టపడటంలేదు. ఈ గ్రామంలో 6—7 సంవత్సరాల మధ్య వయస్కులైన పిల్లలు నూరు మంది వున్నారు. ఈ విషయంలో ఏమి చేయాలి?

సమాధానం: ఉపాధ్యాయుడు, ఒకరిద్దరు గ్రామపంచాయతీ సభ్యుల తోకలిసి పిల్లల తలిదండ్రుల వద్దకువెళ్లి, నిర్బంధ విద్యాపథకం వర్తించే వయస్సులోనున్న పిల్లలను పాఠశాలకు పంపించ దానికి వారిని సమ్మతింప జేయాలి. ఒకివేళ తలిదండ్రులు తమ పిల్లలను పాఠశాలకు పంపనట్లయితే ఆ విషయాన్ని అటెండెన్స్ అథారిటీ అంటే పాఠశాలల డిప్యూటీ ఇనస్పెక్టరుకు తెలియజేయాలి ఆయన పిల్లలను బడికి పంపని తలిదండ్రులకు నోటీసులు జారీచేసి అవసరమైతే అటెండెన్స్ ఆర్డర్లు జారీచేస్తారు. ఈ చట్టం, నియమావళులలో నిర్దేశించిన మేరకు ఆయన ఆ తరువాత కూడా ఏదైనా చర్య తీసుకోవచ్చు.

శ్రీ ఏ. లక్ష్మణమూర్తి, దామల చెరువు, చిత్తూరుజిల్లా.

ప్రశ్న: పుంగనూరు జమీందారీ ప్రాంతంలోని భూములను సర్వే చేయడం అయితే జరిగింది కాని ఆయా పట్టేదార్లకు పట్టాలు ఇచ్చినట్టు లేదు. దీని మూలంగా వారు, సబ్సిడీలు, ఋణాలు మొదలైన పలురకాల ప్రభుత్వ సహాయాలను పొందలేకుండా వున్నారు. ఈ పరిస్థితి ఈ విధంగా ఎంతకాలము వరకు కొనసాగుతుందో దయచేసి తెలియజేయండి.

సమాధానం; పుంగనూరు జమీందారీ ప్రాంతంలో సర్వే, సెటిల్మెంటు పనులు ఇదివరకే ముగిశాయి ఆయా రైతులకు 1959వ సంవత్సరంలోనే చిత్తుపట్టాలను ఇవ్వడం కూడా జరిగింది ఈ జమీందారీ ప్రాంతాన్నంతటినీ రైత్వారీక్రింద మార్చారు కాబట్టీ, మామూలు రెవెన్యూ అధికార్ల నిర్వహణ క్రిందనే ఈ ప్రాంతంవుంది కాబట్టీ పట్టాల మంజూరీకి సంబంధించిన ఫిర్యాదులు మొదలైనవాటిని తహశీల్దారు మొదలైన అధికార్లకు దాఖలు చేయవలసి వుంటుంది. పోతే ఈ విషయంలో ఇంకా ఏదైనా వివరణ కావల్సివస్తే మీరు చిత్తూరులోని అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసరును సంప్రదించవచ్చు.

ప్రశ్న: ప్రభుత్వం ఇనాముల రద్దు చట్టాన్ని ఎందుకు ప్రవేశ పెట్టింది? దీనివల్ల ప్రయోజనం పొందినవారు యెవరు? భూములను స్వాధీనం చేసుకున్నందుకు ఏ ప్రకారం నష్టపరిహారం చెల్లించారు? ఇప్పటి వరకు ఎంతమొత్తం చెల్లించారు? ఇంకా ఎంత మొత్తాన్ని చెల్లించాల్సివుంది?

సమాధానం: జమీందారీ ప్రాంతాలలోని రైతుల ప్రయోజనార్థం ఎస్టేట్ల రద్దుచట్టాన్ని ప్రవేశపెట్టారు. రైతులూ, ప్రభుత్వానికి మధ్యభూస్వాముల మధ్యవర్తిత్వాన్ని రద్దుచేయడానికీ, జమీందారీప్రాంతాలలోని రైతులు, రైత్వారీప్రాంతాలలోని రైతులతో సమానంగా అవకాశాలను పొందగలగ డానికీ ఉద్దేశించిన భారీ భూసంస్కరణఇది. స్వాధీన పరుచుకున్న ఎస్టేట్ల వార్షిక నికారాదాయం ప్రాతిపదికపై నష్టపరిహారాన్ని నిర్ణయిస్తారు. నష్టపరిహారం మొత్తాన్ని జిల్లాజడ్జి, ఎస్టేట్ల రద్దు ట్రిబ్యునల్ వద్ద డిపాజిటు చేస్తారు. శాసనం ప్రకారం ఆయన ఆ మొత్తాన్ని పంపిణీచేస్తారు. ఇప్పటి వరకు సుమారు రూ. 6 కోట్లు చెల్లించారు. ఇంకా సుమారు రూ. 3 లేక 4కోట్లు వరకు చెల్లించవలసి వుంటుంది

శ్రీ ఎం. రంగయ్య, కేసముద్రం.

ప్రశ్న: అటవీ శాఖద్వారా ఆంధ్రప్రదేశ్‌కు ఎంతరాబడి వస్తుంది? దయచేసి జిల్లాలవారీగా వివరాలు తెలపండి.

సమాధానం: 1960–61 వ సం. పు ఆదాయ వివరాలు ఈ విధంగా వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| మెదక్ | ... | రూ. | 9,61,957 |
| నిజామాబాదు | ... | ,, | 21,50,434 |
| ఆదిలాబాదు | ... | ,, | 100,92,927 |
| శ్రీకాకుళం / విశాఖపట్నం | ... | ,, | 4,60,440 |
| పశ్చిమగోదావరి / తూర్పుగోదావరి | ... | ,, | 40,21,161 |
| కృష్ణా, గుంటూరు | ... | ,, | 6,64,594 |
| నెల్లూరు | ... | ,, | 10,80,874 |
| హైద్రాబాదు | ... | ,, | 3,19 040 |
| కరీంనగరం | ... | ,, | 36,38 896 |
| ఖమ్మం | ... | ,, | 26,72,089 |
| మహబూబ్‌నగరం | ... | ,, | 7,85,908 |
| నల్గొండ | ... | ,, | 1,79,837 |
| వరంగల్ | ... | ,, | 31,92,159 |
| కర్నూలు | ... | ,, | 19,78,001 |
| అనంతపురం | ... | ,, | 2,20,184 |
| కడప | ... | ,, | 6,07,589 |
| చిత్తూరు | ... | ,, | 5,12,877 |

★

# రేపు నీదే

" రమ్మిశెట్టి "

నీవు బుద్ధిహీనుడవని
నిరసిస్తోందా లోకం?
బాధపడకు
రేపన్నది వస్తున్నది....
ఓపిక వహించమన్నది—

నీముఖాన దుమ్ముకొట్టి
నిందిస్తోందా లోకం?
నిశ్శబ్దంగా సహించు—
రేపన్నది వస్తున్నది....
నీకోసం
పూలమాల తెస్తున్నది—

కర్కశ పదఘట్టనలో
కనలి కనలి క్రుంగేవా?
నిరీక్షించు రేపటికై—
నేరం చేసిన లోకం
నీముందర
శిరం వంచి నిలుస్తుంది—

(టాగూర్ గీతానికి స్వేచ్ఛానుసరణ)

ప్రణాళికాబద్ధంగా దేశం అభివృద్ధికై మూడవ జాతీయ కృషి 1961 ఏప్రిల్‌లో ఆరంభమైంది స్వయం శక్తితో అభివృద్ధి జెందడంతో నిర్దిష్టమైన ఫలితాలను సాధించడమే దీని లక్ష్యం.

ఈ కృషి ద్వారా సాధించవలసిన ప్రధాన లక్ష్యాలు ఇవి : జాతీయాదాయంలో సంవత్సరానికి అయిదు శాతం చొప్పున పెరుగుదల; ఆహార ధాన్యాలలో స్వయం సంవృద్ధి; ఎగుమతులు, పరిశ్రమల నిమిత్తం ఇతోధికంగా వ్యవసాయోత్పత్తి; ఉక్కు, ఇంధనం, విద్యుచ్ఛక్తి, యంత్రాల నిర్మాణం వంటి ప్రాతిపదిక పరిశ్రమల అభివృద్ధి; మానవశక్తి వనరుల సంపూర్ణ వినియోగం; ధరలను అదుపులో పెట్టడం; సంపద, ఆదాయాల దృష్ట్యా సమాజంలో అసమానతలను తగ్గించడం; ఆర్థిక శక్తిని ఇంకా ఎక్కువగా సరిసమానంగా పంపిణీ చేయడం.

మన రెండవ ప్రణాళికా లక్ష్యాలు కూడా ఇవే. మూడవ ప్రణాళికలో కూడా ఈ ఆదర్శాలనే లక్ష్యంగా పెట్టుకున్నాము. అయితే గ్రామీణాభివృద్ధికి ఈ ఈ పర్యాయం మరింత ప్రాముఖ్యత లభించింది. మన గ్రామీణ ఆర్థికాభివృద్ధికై ఉత్పత్తి లేదా ఉద్యోగావకాశాలు పెంపొందవలసిన అవసరం దృష్ట్యా ఈ ప్రణాళికలో గ్రామీణ కార్యక్రమాలకు ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. మనది ప్రధానంగా వ్యవసాయిక దేశం, కాబట్టి వ్యవసాయోత్పత్తుల అభివృద్ధికి ప్రాముఖ్యత ఇవ్వడమైనది. వ్యవసాయంతో పాటు పరిశ్రమలకు కూడా ప్రాముఖ్యతనిచ్చి వాటిని అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకత వుంది. ఎందుచేతనంటే దీనివల్ల భూమి మీద ఒత్తిడి తగ్గగలిగి, తీవ్రతరంగా అభివృద్ధి జరగడానికి అవకాశం ఏర్పడుతుంది. ఒకవంక ప్రణాళిక యొక్క జాతీయ లక్ష్యాలు, అనేకమైనవీ, అత్యవసరమైనవి అయిన రాష్ట్రావసరాలనూ, మరో వంక పరిమితమైన వనరులనూ దృష్టిలో పెట్టుకొని రాష్ట్ర మూడవ ప్రణాళికను రూపొందించడం జరిగింది.

పద్మశ్రీ
శ్రీ సి. నరసింహం,
ఐ. ఏ. ఎస్.

రాష్ట్ర రెండవ ప్రణాళిక వ్యయం రూ. 188 కోట్లు కాగా మూడవ ప్రణాళికకు రు. 305 కోట్ల పెట్టుబడిని నిర్ణయించారు.

రాష్ట్ర తృతీయ ప్రణాళిక అంశాలను పరిశీలించినట్లయితే ద్వితీయ ప్రణాళికలో ప్రాముఖ్యత ఇచ్చిన అంశాలకే దాదాపు ఈ ప్రణాళికలో కూడా ప్రాధాన్యత లభించినట్లు విదితమవుతుంది. ఏ వ్యావసాయక రాష్ట్రం యొక్క ప్రణాళికాబద్ధమైన అభివృద్ధికైనా ఈ విధానాన్ని అవలంబించడం అవసరమవుతుంది. రాష్ట్ర ప్రణాళిక రూ. 305 కోట్ల పెట్టుబడిలో రూ. 73.08 కోట్లను వ్యవసాయ కార్యక్రమాలకు కేటాయించారు. రూ. 141.17 కోట్లకు పైగా నీటి వనరులు, విద్యుచ్ఛక్తి పథకాలకు ప్రత్యేకించారు. అలాగే పరిశ్రమలు, ఖనిజాల అభివృద్ధికి రూ. 19.43 కోట్లు కేటాయించారు. రవాణాకు రూ. 14.56 కోట్లు, సాంఘిక సేవా కార్యక్రమాలకు రూ. [illegible] 51 కోట్లు, యితర పథకాలకు రూ. 4.25 కోట్లు ప్రత్యేకించారు. రెండవ ప్రణాళిక అఖరు నాటికి ఆహారోత్పత్తి కార్యక్రమం క్రింద 69 లక్షల టన్నుల ఉత్పాదకశక్తి వుంటే మూడవ ప్రణాళికాంతానికి 96 లక్షల టన్నులకు పెంపొందించడానికి ఈ ప్రణాళిక లక్షిస్తున్నది. అంటే మూడవ ప్రణాళికా కాలంలో 27 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను అధికంగా ఉత్పత్తి చేయవలసివున్నమాట. ప్రత్తి ఉత్పత్తిని 85,000 బేళ్ళకు, చెరకును 1.18 లక్షల టన్నులకు పెంపొందించడం జరుగుతుంది. అదనంగా బుల్‌డోజర్లను, ట్రాక్టర్లను కొనడం ద్వారా కొత్తగా 2.29 లక్షల ఎకరాలను సాగుచేయడానికి తలపెట్టారు. విస్తృత ప్రాతిపదికపై వ్యవసాయాభివృద్ధికి ఉద్దేశించిన ఈ కార్యక్రమాలతో పాటు తీవ్రతర వ్యవసాయాభివృద్ధి నిమిత్తం సకాలంలోనూ, సమృద్ధిగాను ఎరువులను సరఫరా చెయ్యడానికీ, మేలిరకం విత్తనాలు, ఆధునిక వ్యవసాయ పనిముట్లు, పచ్చి ఎరు

వులు మొదలైన వాటి వాడకాన్ని ప్రోత్సహించడానికీ, జపాను పద్ధతి వరిసాగును ప్రచారం చేయడానికి కూడా ప్రణాళికలో అవకాశం కల్పించారు. ఇంతే గాక ఫిల్టర్ పాయింట్ గొట్టపు బావులు, పంపు సెట్లు మొదలైన వాటి సరఫరా ద్వారా చిన్న తరహా నీటి వనరుల సౌకర్యాలను కూడా ఈ ప్రణాళికా కాలంలో కల్పించదలిచారు. చిన్న నీటి పారుదల పథకాల ద్వారా సుమారు 8.56 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించడానికి ఉద్దేశించారు. కట్టలు వేయడం, కాలువలను ఆపడం వంటి భూసార సంరక్షణ చర్యల ద్వారా 2.25 లక్షల ఎకరాలలో భూసారం క్షీణించకుండా కాపాడడానికి తలపెట్టారు కమతాల ఏకీకరణ కార్యక్రమాన్ని చేపట్టటం ద్వారా కమతాలను చిన్నచిన్న భాగాల క్రింద విభజించటం వల్ల కలిగే అనర్ధాలను నివారించడం జరుగుతుంది

మూడవ ప్రణాళికా కాలంలో సాంఘిక పరిణామం లక్ష్యాన్ని సాధించడమే గాకుండా, వ్యవసాయదార్లకు స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలు లభింపజేయడం ద్వారా ఉత్పత్తిని పెంపొందింపజేయాలనే మన ఆశయాన్ని నెరవేర్చడానికి వీలుగా కూడా సహకారోద్యమాన్ని పటిష్ఠం చేయడమవుతుంది

1960-61 వ సంవత్సరంలో ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల ద్వారా సుమారు రు. 24 కోట్ల మేరకు స్వల్పకాలిక ఋణాలు, మధ్యకాలిక ఋణాలు ఇచ్చారు. మూడవ ప్రణాళికా కాలంలో జనాభాలో సుమారు మూడింట రెండు వంతుల మందికి ఈ పరపతి సౌకర్యాలు కల్పించటానికీ, 1965-66 వ సం.లో రు. 60 కోట్ల మేరకు స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలు ఇవ్వడానికి తలపెట్టారు ఇంతే గాక సుమారు రు. 6.00 కోట్ల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వడం కూడా జరుగుతుంది.

రాష్ట్రమంతటిలోనూ 1963 అక్టోబరు నాటికి సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని అమలుపరుస్తారు.

రాష్ట్ర ప్రజలకు తగు విధంగా పోషక పదార్థాలతో కూడిన ఆహారం లభించగలిగే విధంగా, "పశుపోషణ", "మత్స్యసంపద అభివృద్ధి", "పాడిపరిశ్రమ అభివృద్ధి", "పాలసరఫరా" పథకాలు రూపొందించ బడినాయి. "పశుపోషణ" కార్యక్రమం క్రింద, కీలకగ్రామ కేంద్రాలు, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు, కోళ్ల విస్తరణ కేంద్రాలు, గొర్రెలు, ఉన్ని అభివృద్ధి కేంద్రాల స్థాపన ద్వారానూ, పందుల పెంపకం పథకం ద్వారాను అభివృద్ధి జరుగుతున్నది. పశువులకు సకాలంలోనూ సులభంగానూ చికిత్స చేయగలగడానికి వీలుగా పశువైద్య శాలలను, ప్రథమ చికిత్సా కేంద్రాలను తెరవడం జరుగుతుంది. "మత్స్యసంపద అభివృద్ధి కార్యక్రమం" క్రింద, సముద్రంలోని చేపలు, ఇతర జలాధారాలలోని చేపల అభివృద్ధికై రెండవ ప్రణాళికలో చేపట్టిన కార్యక్రమాలనే ఈ ప్రణాళికా కాలంలో కూడా మరింత తీవ్రంగా నిర్వహించడం జరుగుతుంది సముద్రం ఒడ్డునవుండే మత్స్య కేంద్రాలనుండి ప్రధాన రోడ్డు మార్గం పైకి గానీ లేదా రైలు కేంద్రానికి గాని సులభంగా రాకపోకలు వుండడానికి వీలుగా రాష్ట్రంలో కోస్తాతీరంలో భారీఎత్తున రోడ్డు మార్గాలను నిర్మించడం జరుగుతుంది. మూడవ ప్రణాళికలో తలపెట్టిన విభిన్న కార్యక్రమాల మూలంగా ఈ ప్రణాళిక ముగింపునాటికి చేపల ఉత్పత్తి సంవత్సరానికి సుమారు 30,500 టన్నులకు పెరగవచ్చని ఆశించబడుతున్నది

"పాడి పరిశ్రమ, పాల సరఫరా" క్రింద తలపెట్టబడిన పథకాల ప్రధానాశయం ప్రజలకు ముఖ్యంగా పట్టణ ప్రాంతాల వారికి చక్కని పాలను చవుకి ధరకు సరఫరా చేయడం. ఆంధ్ర ప్రదేశ్‌లో రోజుకి పాల తలసరి వాడకం 3 ఔన్సులు మాత్రమే. కాని మన దేశంలో నియోజనుల సతులాహారంలో 10 ఔన్సుల పాలువుండాలి కాబట్టి పాలసరఫరాను తగినంత హెచ్చింపాలని ఈ ప్రణాళిక ఆశయం

మన రాష్ట్రంలోగల భూముల పూర్తి వినియోగానికి తేవటానికి నీటి వనరులను చక్కగా అభివృద్ధి పరచాలి. తృతీయ ప్రణాళికలో వివిధ భారీ, మధ్యరకం ప్రాజెక్టులక్రింద దాదాపు 13.16 లక్షల ఎకరాలకు నీటి పారుదల లభించగలదని భావించబడుతున్నది.

మన రాష్ట్రంలో పరిశ్రమల అభివృద్ధికి చక్కని అవకాశాలున్నప్పటికీ, ఇది పారిశ్రామికంగా చాలా వెనుకబడే వుంది. ఇందుకు చవుకగా, పుష్కలంగా విద్యుచ్ఛక్తి లభించకపోవడం ఒక కారణం. రాష్ట్రంలో లాభసాటిగా అభివృద్ధి పరచవలసిన పుష్కలమైన విద్యుచ్ఛక్తి వనరులు వున్నాయి. ప్రథమ, ద్వితీయ ప్రణాళికల క్రింద విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల విషయంలో జరిగిన అభివృద్ధి చాలా ప్రోత్సాహకరంగా వున్నది. తృతీయ ప్రణాళిక సమాప్తినాటికి విద్యుచ్ఛక్తి వుత్పత్తిని దాదాపు మరి 459 మి.వాట్లకు పెంచాలనీ, తలసరి వాడకాన్ని 40 యూనిట్లకు పెంచాలని ఈ ప్రణాళిక ఆశయం.

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికంగా, ఆర్థికంగా వెనుకబడి వున్నది. ఇప్పుడు రాష్ట్ర జాతీయాదాయంలో పరిశ్రమల వల్ల వచ్చే ఆదాయం సంతు చాల తక్కువగా వున్నది అది బహుశా 6 శాతాన్ని మించదు దేశం మొత్తంమీద యీ శాతం 25 కాబట్టి రాష్ట్రపు జాతీయాదాయానికి యింత కంటే యెక్కువగా పరిశ్రమలు తోడ్పడాలంటే వాటి పెట్టుబడిని బాగా హెచ్చించాలి, ఆపైన. సహజసౌధా సనులలో మిగులుగా వున్న శక్తులను క్రమేపీ, పరిశ్రమలకు మళ్లిస్తే తప్ప వ్యవసాయం ఒక మేరను దాటి అభివృద్ధి చెందలేదు కాని ప్రథమ ద్వితీయ ప్రణాళికల కాలంలో, భారీ చిన్నలను అవసరమైనంత ద్రవ్యంలేని కారణాన పరిశ్రమల విషయంలో యెక్కువ అభివృద్ధి కలుగలేదు. కొన్ని తక్షణావసరాల ప్రాతిపదికపై 'పరిశ్రమల' ప్రణాళిక రూపొందించబడినది ఈ ప్రణాళిక కాలంలో రాజమండ్రిలోని ఆంధ్ర పేపరు మిల్లు వుత్పత్తి శక్తి బాగా హెచ్చించబడుతుంది.

ద్వితీయ ప్రణాళికా కాలంలో చేపట్టిన సహకార పంచదార ఫ్యాక్టరీలకు తోడు తృతీయ ప్రణాళికా కాలంలో మరొక సహకార పంచదార ఫ్యాక్టరీని నెలకొల్పడానికి సంకల్పించారు కుటీర పరిశ్రమలు, ఖనిజ సంపదల అభివృద్ధితో సహా భారీ చిన్న పరిశ్రమలు చిన్నరకం పరిశ్రమల నిమిత్తం మొత్తం రూ. 19.43 కోట్లు ఖర్చుకాగలవని భావించబడుతున్నది. ఇందులో 6.65 కోట్లు భారీ, మధ్యరకం పరిశ్రమలకు ఖర్చుచేస్తారు. రాష్ట్రంలో ఖనిజ సంపద అభివృద్ధికై రూ. 0 11 కోట్లు కేటాయించారు చిన్నరకం పరిశ్రమలలో, చేనేత పరిశ్రమ అభివృద్ధికై రూ. 5.40 కోట్ల పెద్ద మొత్తాన్ని కేటాయించారు.

జాతీయాభివృద్ధికి రోడ్ల అభివృద్ధి అత్యంత ముఖ్యం, సత్వరాభివృద్ధి కాలంలో, సమర్థమైన రవాణా పద్ధతిని హెచ్చువుత్పత్తి కార్యక్రమాలతో సమన్వయ పరచిననాడు యెంతో లాభం కలుగగలుగుతుంది. కాబట్టి, ఆర్థికాభివృద్ధి ప్రణాళికా విజయానికి, సమర్థమై చక్కగా అభివృద్ధి పరుపబడిన రవాణా, రాకపోకల సౌకర్యాల పద్ధతి అత్యవసరం. ప్రస్తుతం రాష్ట్రంలో రోడ్లు ప్రతి 100 చ.మై.కు సగటున 18 మైళ్లు మాత్రమే వున్నవి. ఈ సగటును 20 సంవత్సరాలలో 65 మైళ్లకు పెంచటానికి ఒకరోడ్డు అభివృద్ధి ప్రణాళిక రూపొందించబడింది. తృతీయ ప్రణాళికలో రోడ్డు అభివృద్ధి పథకం పైనచెప్పిన రోడ్డు అభివృద్ధి ప్రణాళిక దృష్ట్యా సిద్ధం చేయబడినది.

వివిధ చిల్లర కార్యక్రమాలతో సహా సాంఘిక సేవకు రూ. 59.76 కోట్లు కేటాయించారు. ఇది ప్రణాళిక మొత్తం పెట్టుబడిలో 19.6 శాతం. ఈ ప్రణాళికలో 6–11 సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్లలలో 81.5 శాతం మందికి ఉచిత నిర్బంధ విద్యావిధానాన్ని వర్తింపజేయడానికి అవకాశం కల్పించారు. విద్యా ప్రణాళికలో తలపెట్టబడిన ప్రకారం, సాంఘికవిద్య. గ్రంథాలయాల అభివృద్ధి, ఎన్. సి. సి., ఎ. సి. సి., బాలభటులు. గరల్ గైడ్ యూనిట్లు మొదలైనవాటి విస్తరణకు విరివిగా సొమ్ము లభించబోతున్నది అదనంగా దాదాపు 10.24 లక్షలమంది పాఠశాలల్లో చేరటానికి అవకాశం కలుగుతుంది. విశ్వవిద్యాలయవిద్య అభివృద్ధి విషయంలో ప్రస్తుతపు పథకాలను అభివృద్ధి పరచబడతాయి. ఇందుకుగాను విద్యార్థుల సంఖ్య కళాశాలల శక్తికి అనుగుణంగా పరిమితం చేయబడుతుంది. నవీన సౌకర్యాలు సమకూర్చబడతాయి. సాంకేతిక విద్య విషయంలో, 180 మంది విద్యార్థులను చేర్చుకోగల పాలిటెక్నిక్‌ను ఒక దానిని నెలకొల్పాలనీ, ప్రస్తుతపు ఇంజనీరింగ్ కళాశాలలు, పాలిటెక్నిక్‌లలో యెక్కువమంది విద్యార్థులను చేర్చుకునే వీలు కల్పించాలని సంకల్పించారు.

ప్రజలు ముఖ్యంగా వైద్య సదుపాయాలు సరిగా అందుబాటులో లేని గ్రామీణప్రజల ఆరోగ్యాన్ని పెంపొందించడం అత్యంత ప్రయాసం. ప్రజాసీకానికి ప్రత్యేకించి గ్రామాలలో నివసిస్తున్న వారికి సముచితమైన స్థాయిలో వైద్య సదుపాయాలు కల్పించడానికి ఇప్పుడు మన రాష్ట్రంలో వున్న వైద్య సంస్థలు చాలవు. అందువల్ల ఆసుపత్రి సౌకర్యాలను పెంపొందించడంతో పాటు ఆసుపత్రులలో వైద్య సేవలను అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకత కూడా వుంది.

మూడవ ప్రణాళికా కాలంలో రాష్ట్రంలోని వివిధ ఆసుపత్రులలో పడకల సంఖ్యను 5 000 వరకు పెంచడం జరుగుతుంది. 300 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను తెరవడానికి కూడా తలపెట్టారు. మలేరియా నివారణ, బోదవ్యాధి నిరోధన, కుష్టువ్యాధి నిరోధన, బి. సి. జి. ఉద్యమంవంటి వివిధ అఖిలభారత పథకాలను కొనసాగించడం జరుగుతుంది. పట్టణ ప్రాంతాలలో శుభ్రమైన మంచినీటి సౌకర్యాలనూ, మురుగు పారుదల సదుపాయాలను కల్పించేనిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ. 6 80 కోట్లు కేటాయించారు. గృహావసతి సమస్యను పరిష్కరించే నిమిత్తం రెండవప్రణాళికా కాలంలో చేపట్టిన కార్యక్రమాలను తృతీయ ప్రణాళికలో అమలు పరిచే నిమిత్తం రూ. 5.35 కోట్లు కేటాయించారు. ఈ కాలంలో 10,000 మందికి గృహావసతి కల్పించబడుతుంది. నిమ్నజాతులు, నిమ్నతెగలు

ఇతర వెనుకబడిన తరగతులవారి సంక్షేమ కార్యక్రమాల క్రింద నివేశన స్థలాల కేటాయింపు. ప్రజారోగ్యం, విద్యాభివృద్ధి, పథకాలకు ప్రాముఖ్యత లభించింది. ఈ ప్రజలు అత్యధిక సంఖ్యలో నివసించే ప్రదేశాలతో రాకపోకల సౌకర్యాలను అభివృద్ధి పరచడం. కాలనీలను స్థాపించడం, వారి ఆర్థికోన్నతికి సహాయపడటం వంటి కార్యక్రమాలకు కూడా హెచ్చు మొత్తాలను కేటాయించడం జరిగింది. వెనుకబడిన తరగతుల వారికి ఉద్దేశించిన కార్యక్రమాలను ఇతర అభివృద్ధి పథకాలతో సమన్వయపరిచి, అన్నిరకాల అభివృద్ధి కార్యక్రమాలద్వారా కూడా వెనుకబడిన తరగతులవారు తగువిధంగా ప్రయోజనం పొందకలిగే విధంగా చర్యలు తీసుకునే నిమిత్తం సరైన యంత్రాంగాన్ని నియమించడానికి కూడా తలపెట్టబడింది.

మహిళలు, శిశువులు, వికలాంగుల సంక్షేమానికి ఉద్దేశించిన కార్యక్రమాలు, సాంఘిక, నైతిక పునరుద్ధరణ కార్యక్రమాలు మొదలైన వాటికికూడా మూడవ ప్రణాళికలో తగు విధంగా ప్రాధాన్యత ఇవ్వడమైంది.

అభివృద్ధికి సంబంధించిన సమస్య నిరంతరం వుండేదే. ఒక ప్రణాళికలో జరిగిన కృషి, తదనంతపు ప్రణాళికలలో ఇతోధికాభివృద్ధికై ప్రాతిపదికగా ఉపయోగపడుతుంది

ఆర్థికపరిస్థితి, స్వయంశక్తిపై ఆధారపడగలిగే ఒక దశకు చేరుకునేవరకూ, ప్రణాళికా కర్తవ్యం, ఏమైనా లోపాలుంటే సవరించే నిమిత్తం ప్రణాళికా కార్యక్రమాలను ఎక్కువ అప్రమత్తతతో రూపొందించడం. అమలుపరచడం సమీక్షచేయడం అవసరం. ఇందుకొరకు ప్రతిఒక్కరూ త్యాగబుద్ధిని ప్రదర్శించడం. ఈ కార్యక్రమాలను విజయవంతంగా అమలు పరచడానికి దీని దీక్షాసక్తులను కనబరచడం ఎంతో అవసరం.

ప్రతిపౌరునిలోనూ ఈ దృక్పథం ఏర్పడాలి. అది మృగ్యమైనప్పుడు మన ప్రణాళికలు విఫలమొందుతాయి.

(ఇంగ్లీషు మూలానికి అనువాదం)



ఒరిగి పడిపోవు పూవుల మరచి పోయి
క్రొత్త మొగ్గల స్నేహమ్ము గోరుచుండు
యౌవనం, బిందులేదు దాహమున కింతు,
రస పిపాసికి లేదు జరాభరమ్ము,

"మధుగీత"

# విద్యుచ్ఛక్తి సరఫరా

కర్నూలు జిల్లాలోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలకు 1962 జనవరి నెలలో విద్యుచ్ఛక్తిని సరఫరా చేశారు:

(1) తిమ్మాపురం (నంద్యాల తాలూకా): (2) రాచెర్ల (గిద్దలూరు తాలూకా); (3) ఎదురూరు; (4) ఒస్సిపాడు; (5) చెట్లమల్లాపురం: (6) పైడికుర్తి (కర్నూలుతాలూకా)

ఈ నెలలోనే అనంతపురం జిల్లాలోని దిగువ గ్రామాలకు కూడా విద్యుత్ సౌకర్యాన్ని లభింపజేశారు:

(1) కొత్తకోట (గుత్తితాలూకా); (2) ఖదరగుంట (అనంతపురం తాలూకా): (3)కొండాపురం (తాడిపత్రి తాలూకా): (4) అర్కటవేముల (తాడిపత్రితాలూకా) (5) సొమ్మందపల్లె (పెనుగొండ తాలూకా). (6) ఆత్మకూరు (అనంతపురం తాలూకా), (7) బండ్లపాడ (అనంతపురం తాలూకా).

చిత్తూరు జిల్లాలో ఈ క్రింద తెలిపిన గ్రామాలకు ఇదే నెలలో విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడం జరిగింది:

(1) రామాపురం (వాయల్పాడు తాలూకా). (2) కుంట్రపాకం (చంద్రగిరి తాలూకా).

ఈ నెలలో విశాఖపట్నం ఆపరేషన్ సర్కిలులోని దిగువ ఊళ్లకుకూడా విద్యుచ్ఛక్తి సరఫరా జరిగింది:

(1) పోతయ్యవలస (నరసన్నపేట తాలూకా, శ్రీకాకుళం జిల్లా) (2) కురుపం, (3) శివన్నపేట, (4) పెదమరంగి (5) కన్నపుదొర వలస, (6) రాముడునాయుడు వలస (పార్వతీపురం తాలూకా, శ్రీకాకుళంజిల్లా). (7) ఆనందపురం (8) కట్టుబోలు, (9) తెరువుపల్లె.

తెలంగాణా ప్రాంతంలో దిగువ తెలిపిన గ్రామాలకు 1962 జనవరిలో విద్యుత్ సౌకర్యాలను సమకూర్చటం జరిగింది:

| | గ్రామం | తాలూకా | జిల్లా |
|---|---|---|---|
| (1) | సజ్జాపూర్ | జహీరాబాదు | మెదక్ |
| (2) | రంగసముద్రం | షాద్‌నగర్ | మహబూబ్‌నగరం |
| (3) | రెగనాడె | సుల్తానాబాదు | కరీంనగరం |
| (4) | వాడికల్ | హుజూరాబాదు | ,, |
| (5) | మాలంగర్ | ,, | ,, |
| (6) | మక్తల్ హెడ్డాఫీస్ మలంగర్ | ,, | ,, |
| (7) | బొర్నపల్లి | ,, | ,, |
| (8) | కిందికొండ | మహబూబాబాదు | వరంగల్ |
| (9) | కిష్టానగర్ | షాద్‌నగర్ | మహబూబ్‌నగరం |
| (10) | వడమజిసోమరం | భువనగిరి | నల్గొండ |
| (11) | ఇంకిర్యాల్ | ,, | ,, |
| (13) | చందూరు | నల్గొండ | ,, |
| (13) | నగ్నూర్ | కరీంనగరం | కరీంనగరం |
| (14) | అలగ్నూర్ | ,, | ,, |
| (15) | మర్పాక | సిర్పిల్లా | ,, |
| (16) | అలీపూర్ | నాగర్‌కర్నూల్ | మహబూబ్‌నగరం |
| (17) | షమీర్‌పేట | మేడ్చల్ | హైద్రాబాద్ |
| (18) | మరిపడగ | సిద్దిపేట | మహబూబ్‌నగరం |
| (19) | లక్ష్మీపూర్ | హుజూరాబాద్ | కరీంనగరం |
| (20) | దెండుకూరు | మధిర | ఖమ్మం |
| (21) | అర్వపల్లపాడు | ,, | ,, |
| (22) | కొత్తఇల్లందులపాడు | ,, | ,, |
| (23) | మాచాపురం | వరంగల్ | వరంగల్ |
| ( 4) | అగ్రారం హెడ్డాఫీసు మర్పాక | సిర్పిల్లా | కరీంనగరం |
| (25) | మల్యాల | మహబూబాబాదు | వరంగల్ |
| (26) | ఎల్లాపూర్ | జనగామ | వరంగల్ |
| (27) | రహీంఖాన్‌గూడ | భువనగిరి | నల్గొండ |

—:0:—

# గుడ్డితనము

ప్రొ॥ దివాకర్ల వెంకట సుబ్బారావు

[ప్రపంచ ఆరోగ్య సంస్థ వారు యీ నెల 7 వ తేదీన జరుపుచున్న ఆరోగ్యవారోత్సవాల సందర్భంగా "గుడ్డితనము" అన్న విషయంమీద సంశోధనాత్మకమైన గోష్ఠులను ఏర్పాటుచేశారు. ఈ వారోత్సవాల సందర్భంగా "గుడ్డితనం" గురించిన ప్రత్యేక వ్యాసాన్ని ప్రకటిస్తున్నాము]

ప్రపంచములో ఈనాడు నివసించు మూడువేల మిలియనుల ప్రజలలో సుమారు పదిమిలియన్లు, అందు అసంఖ్యాకుల ఏబది వేల బాలబాలికలు అంధకారమందు నివసించుచున్నారు. ఇందు ఏడు వేల మిలియనులు గ్రామవాసులు. ఈ గుడ్డితనము అన్ని దేశములందును గానవగును. నాగరిక ప్రపంచమునకు చెందిన పశ్చిమ ఐరోపా, ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికాల యందు ప్రతి వెయ్యి మనుష్యులకు ఇద్దరు గుడ్డివారున్నారు. యూరప్పునందలి యితర భాగములలోను, ఆసియా ఖండమందును ప్రతి వెయ్యి జనాభాకు నల్గురు గుడ్డివారున్నారు మెడిటరేనియన్ తూర్పు భాగములందు, ఆఫ్రికా ఖండమందు వెయ్యికి ఆరు నుండి పది వరకు గుడ్డివారు. భారతదేశమందు రెండు మిలియనుల గుడ్డివారు కలరు. ఇందులో మూడవ భాగము 21 వర్షముల వయస్సు ప్రవేశించక ముందే గుడ్డివారైనవారున్నారు. ఆరు లక్షల మంది మొదటి ఐదు సంవత్సరములలో గుడ్డివారైరి. భారతదేశమందలి గుడ్డివారు (Los Angeles) లాస్ ఏంజెల్స్ పట్టణ ప్రజలను మించిరి. ఒక్క కలకత్తానగరమందలి గుడ్డివారు కెనడా దేశమందలి ప్రజలను మించియున్నారు గుడ్డివారిని పోషించుటకైన అగు ఖర్చులు అంచనా వేయగా అందు సగము వంతు గుడ్డితనము నివారించుటకు వెచ్చించినచో నెంతయో మనదేశము అభివృద్ధి పొందగలదు. ఇదిగాక ప్రస్తుతము గుడ్డివారైనవారు, దుఃఖ జీవితమును అనుభవించుచున్నవారు కనుక నచ్చి, ఎంత సుఖించుచురో చెప్పవలసిన పనిలేదు. భారతదేశమందున్న గుడ్డివారిని పోషించుటకు సంవత్సరమునకు 60 కోట్ల రూపాయలు ఖర్చగుచున్నదని అంచనా వేయబడినది. ఇదిగాక 2 మిలియనుల ప్రజలు పనిచేయు చాలని వారగుటవల్ల దేశమునకు ఎంత నష్టము సంభవించు చున్నదో గమనింపవలెను. ప్రపంచ చరిత్రలో ఇంత త్వరగా సంభవించి, ఇంత త్వరగా నష్టము గావించు వ్యాధి వేరొకటి లేదు.

## భారతదేశమందలి గుడ్డితనపు సమస్య

1944 సంవత్సరములో వేసిన అంచనానుసరించి మన దేశమందు ప్రతి 100,000 ప్రజలలోను 250 మంది అంధులు. సమాన సంఖ్య గల వారు పూర్తిగా అంధులు గాకున్ననూ కంటి వ్యాధులతో బాధపడుతున్నారు, వీరు స్వతంత్ర జీవులు కారు. బ్రిటనులో ఇట్టివారు 205, అమెరికా యందు 198, భారతదేశమందు 500 ఉన్నారు. 90% గుడ్డితనము మనదేశమందు నివారింపవీలగును మనదేశమందు 80% ప్రజలు గ్రామవాసులని తెలిసిన విషయమే. మన దేశమందు గుడ్డివారని లెక్కించబడువారిలో 3 మిలియనులు రెండు మీటర్ల దూరము నుండు అంకెలను లెక్కించజాలరు, అనగా వీరు స్వతంత్రజీవులుగారని అర్థము. ఇట్టివారికి నాలుగు రెట్లు అనగా 12 మిలియనులు స్వతంత్ర జీవులుగ పరిగణించుటకు వీలులేని స్థితిలో నున్నారు. అనగా మొత్తము 15 మిలియనుల ప్రజలు ఆర్థిక అస్వతంత్రులు. ఎన్ని ప్రయత్నములు చేసిననూ మనదేశమందున్న ప్రస్తుత పరిస్థితులలో గుడ్డితనము నిర్మూలించుట అసంభవము. ఇందులకు ముఖ్య కారణములు, ఆర్థిక లోపము, తగు నిపుణ వైద్యులు లేకుండుట, ఇతర ముఖ్య పనులకు మన ఆదాయము వినియోగింపవలసివచ్చుట. వ్యాధులు ఎల్లప్పుడును వాటి స్వాభావికతమీదనే కాక అమాయ

కత్వము, ఆర్థిక హీనతల ననుసరించి కూడ వ్యాపించుచుండును. కనుక గుడ్డితనము నివారింపవలెనన్న, మన ప్రభుత్వము జీవితావసరముల పెంపు చేయుట, విద్య, పరిసర పరిశుభ్రత, ఆరోగ్యము సమీకృతాహారము మొదలుగాగల ముఖ్యాంశములు విచారించి తగు సహాయము చేయవలెను.

## గుడ్డితనము గలుగజేయు వ్యాధులు

భారతదేశమందు గుడ్డితనము గలుగజేయు వ్యాధులు అనేకములున్నవి. అందు ముఖ్యమైనవి (a) (Trachoma) ట్రెకోమా, దీనిననుసరించి యుండు తాపజనకమైన పరిస్థితులు (b) గ్లాకోమా (Glaucoma)(c)మశూచికము(Smallpox) (d) కెరటోమలాసియా (Keratomalacia) (e) అసంపూర్ణ ఆహారము ననుసరించు వ్యాధులు, (f) సుఖ వ్యాధులు, (g)జనన సంబంధమైన అసాధారణములు(Congenital Abnormalities) (h) వంశ పారంపరమైన వ్యాధులు (i) ఉపద్రవములు (Injuries) (j) మధుమేహము (k) అనుకూలింపని అంగ విన్యాసముల నేతరించు(Ill effects of faulty postures) (l) కండ్లు మిరుమిట్లు గొలుపు కాంతుల చూచుట (Glare) (m) సరియగు వెల్తురు లేని స్థలములందు నివసించుట (n) (o) సరిగా అచ్చుగాని పుస్తకముల చదువుట (p) వక్రీకరణ ప్రమాదములు (Refractive errors) ఇతరములనేకములు గలవు. ఇందు అనేక వ్యాధులు నివారింప వీలగునవి ట్రెకోమా సంభవించిన త్వరలో వైద్య సహాయము నొందిన గుడ్డితనము నివారింపగలము. గ్రామములందు నివసించు ప్రజలు కండ్లలో "సుర్మా" లేక "కాటుక" వాడుచున్నారు ఇది మంచిదిగానుండిన ప్రమాదములు సంభవించుచున్నవి. మంచిదో కాదో తెలియని వాటిని వాడుట మానివేయుట మంచిది, టీకాలు వేయించుకొనుట మశూచికమును నివారించు మార్గము ఈ మశూచి సంబంధమగు గుడ్డితన ప్రాప్తిని గూడ నివారించును నూటికి 90 కేటరా వ్యాధులు క్రమ కాలములో ఆపరేషను వల్ల నివారింపవచ్చును అనేక మంది కండ్లలోని పొరలు తీయించుకొనుటవలన గుడ్డితనము నొందుచున్నారు పొరలు తీయుట తాత్కాలికముగా చూపు ప్రసాదించినను ప్రమాదమునకు గురిచేయుచున్నది. ఏలన గ్రామ గ్రామమునకు తిరుగు పొరలు తీయు తెలియని వైద్యులు కొందరు పొరలు తీసి ప్రమాదముల తెచ్చిపెట్టుచున్నారు ఇందు 90% వెంటనే గాని, కొలదికాలమైన తర్వాత గాని కండ్లు పోగొట్టుకొనుచున్నారు. నిపుణులుగాని వైద్యులు గ్లాకోమా (glaucoma) కేటరా (cataract) వ్యాధిగా పరిగణించి వైద్యము చేయుచున్నారు. ఇదికూడ ప్రమాద హేతువగుచున్నది. నూటికి 30 మంది మనదేశమందు 21 సంవత్సరముల వయస్సు రాకమునుపే గుడ్డివారగుచున్నారు గదా, ఇందులో 5 సంవత్సరముల వయస్సు లోపుననే అనేక మంది గుడ్డివారగుచున్నారు ఇందుకు కారణము లను అప్తాల్మియా నియోనెటోరము (opthalmia neonatorum) మశూచికము (Small pox) సమీకృతాహారము లేకుండుట (Poor or unbalanced diet) ట్రెకోమ (Trachoma) మరియు దీనికి సంబంధించి యుండు కంజెక్టివైటిస్ (conjunctivitis) మొదలైనవి. నివారింప వీలగు వ్యాధులు. ఇట్టి వ్యాధుల నివారించుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. క్రమముగా సత్ఫలితములు గన్పించుచున్నవి. గ్రామములందు శిక్షణ నొందిన మంత్రసానులు పనిచేయ ప్రారంభించినందున అప్తాల్మియా నియోనెటోరము తగ్గుచున్నది. మశూచికము చాలా భాగము నివారింపబడినది. త్వరలో పూర్తిగా ఈ వ్యాధి నిర్మూలించు ప్రయత్నములు జరుగుచున్నవి. మనదేశములో నూటికి 60 మంది ట్రెకోమా వలన గుడ్డితనము నొందుచున్నారు ప్రజల ఆర్థిక స్థితి అభివృద్ధి నొందువరకు ఈ వ్యాధి నివారింప కష్టమగును. పాఠశాలలందు విద్యార్థులు అక్రమ పద్ధతిలో కూర్చుండి విద్య నభ్యసించుట, తగు వెల్తురు లేకుండుట లేదా అధికముగా వెల్తురు ఉండుట, సరిగా ముద్రింపబడని పుస్తకములు చదువుట వలన గుడ్డితనమునకు గురియగుచున్నారు కాన పాఠశాల అధికారులు తగు శ్రద్ధ వహించిన బాలురు రక్షింపగలరు. విద్యార్థుల ఆరోగ్య స్థితి కాపాడుట ముఖ్యావసరము ఇందు పెరిగేటు స్కూళ్ళ పరిస్థితి చెప్పనలవి గాదు ఇందుకుగాను ప్రభుత్వమువారు స్కూళ్ళ ఆరోగ్య సంఘముల ప్రారంభించిన ఇట్టి ప్రమాదములు సంభవింపకుండా కాపాడవచ్చును

21–40 సంవత్సరముల ప్రాయమందుండువారికి, గుడ్డితనము, ట్రెకోమా, కంజెంక్టివైటిస్, సుఖవ్యాధులు, ప్రమాదములు, మధుమేహములవలన ప్రాప్తించుచున్నది ఈ వయస్సునందు సుఖ వ్యాధులు కలవారు తగు చికిత్స నొందకుండిన దృష్టి గోల్పోవుట ప్రాప్తించుచున్నది ఇట్టి ప్రమాదములు నివారించుటకు తగు శ్రద్ధ వహింపవలెను. ప్రభుత్వమువారు వ్యభిచారము నరికట్టుటకు ప్రయత్నింపవలెను.

ప్రమాదవశమున సంభవించు గుడ్డితనము, ఫ్యాక్టరీలలో, వర్కుషాపులలో పనిచేయువారలకు ఎక్కువగా ప్రాప్తించుచున్నది

ఇట్టి ప్రమాదముల నివారించుటకు ఫ్యాక్టరీచట్టములందు వివిధోపాయములు పొందుపరచి యున్నవి. వీనిని ఆచరణలో ఉంచుట ముఖ్యావసరము. గాగుల్సు (రంగుటద్దములు) ధరించక పనిచేయువారు ఎక్కువగా అంధత్వము నొందుచున్నారు. వైద్యులుగూడ X-rays తీయునపుడు, Ultra Violet rays, High temperature heat waves పనులజేయునపుడు గాగుల్సు ధరింపనందున, తగు శ్రద్ధ వహింపనందున కేటరావ్యాధికి గురియగుచున్నారు కాన ప్రమాదముల తప్పించు సాధనముల శ్రద్ధతో ప్రవేశింపబెట్టుట, ఆచరించుట ముఖ్యావసరము. పనిశాలయందు ప్రమాద వశమున గుడ్డితనము నొందుటగూడ ఎక్కువగనున్నది.

వృద్ధాప్యమును సమీపించు కేటరా, గ్లాకోమా వ్యాధులు నివారించుట కష్టము. ఇవి శరీరమునందు స్వాభావికముగా కలుగు మార్పులవల్ల సంభవించుచున్నవి. వెంట్రుకలు తెల్లబడునట్లు ఈ వ్యాధులు సంభవించును. ఇందులో కేటరా వ్యాధినిమాత్రము కొంతవరకు నివారింపవచ్చును. దీనికి శస్త్రచికిత్సతప్ప వేరొక మార్గము గాన్పింపదు. గ్లాకోమా వ్యాధి నయముచేయుట కష్టము గాని నివారించు మార్గములు లేకపోలేదు. ఈ వ్యాధిని త్వరలో గ్రహించి ప్రథమావస్థలో చికిత్సచేసిన నయమగును, దీనిని కేటరాయని భావించి తగుచికిత్స నొనర్పకుండిన నివారించుట దుర్లభమగును కండ్లయందు బాధగలిగిన 'అట్రోపిన్' వాడుట సహజమైనది. సుర్మావాడుట కూడ గ్లాకోమా వ్యాధికి కారణమగుచున్నది. గనుక క్రమపద్ధతిన వ్యాధిని కనుగొనుట, తగుచికిత్స నొనర్చుట అవసరము. 40 సంవత్సరముల ప్రాయము దాటిన ప్రతి మనుష్యుడు నేత్రవైద్యుని సలహానొందిన ఈ జబ్బు ప్రథమావస్థలో నుండగనే చికిత్స నొందుటకు అనుకూలించును. గ్లాకోమా వ్యాధికి మూలకారణముల నన్వేషించు కృషిసల్పుట కూడ అవసరము.

## గుడ్డివారితో సంచరించు వారికి కొన్ని ముఖ్య సలహాలు

గుడ్డివారితో సంచరించువారు మామూలు పద్ధతిన వారితో సహకరింపవలెను వారితో ప్రసంగించు నపుడు 'చూడు' అను మాటను వ్యవహరింపకుండుట ఉత్తమము ఇతరుల విషయముల గురించి వారి అభిప్రాయముల నడిగిన వారు సంతోషింతురు. వారలకు దృష్టిలేదని అడుగుట మానిన బాధపడగలరు. వారు నివసించుగదులకు తలుపులు పూర్తిగా తెరచియుంచుట లేక పూర్తిగా మూసివేసి యుంచుట గాని మంచిది. సగము తెరచుట వారికి ప్రమాదము. వారలకు సహాయ్యము చేయబూనుటకు పూర్వము సహాయ్యమవసరమాయని ప్రశ్నింపవలెను. చాలమంది గుడ్డివారు వారి పనుల వారు నిర్వహింప గలరని మరువగూడదు. గుడ్డివారితో నడచునపుడు మన చేతిని వారికి సహాయ్యముగా నీయవలెను వారికి మార్గములను తెలుపునపుడు 'కుడి' 'ఎడమ' అను మాటలు వాడవలెను. గుడ్డివారితో మాట్లాడునపుడు వారిని చూచి మాట్లాడవలెను గాని ప్రక్కనున్నవారిని చూచి మాటలాడరాదు.



# వసంత

శ్రీ శంకర శ్రీరామారావు

ఓ వసంత మహోదయ! ఓగసాల
పల్లవాటవ స్ఫుటాభాభాసమాన
చారుతరదేహ! నీకిదే స్వాగతమ్ము!
అందుకొనుమయ్య దివ్యకళ్యాణమూర్తి!

నీపరిమళ వీచుల నిఖిలలోక
దురితదుర్గంధ సందోహభీరమునూడ్చి
విశ్వసౌభ్రాత్రభావనా విమలగీతు
లాలపింపుము కోకిలా లాపసరణి

చూడుమటు స్వార్థభావ భాసురమహాగ్ని
కీలలకుజిక్కి సంస్కృతీ జాలమెట్లు
మాడిబొగ్గగుచున్నదో! మానవతకు
ప్రాణములుపోసి కాపాడవయ్యసుంత

వచ్చికొంగ్రొత్త వెలుగులందించుననుచు
ఎదురుతెన్నులు చూచుచున్నదిజగమ్ము
నీశుభాగమనమ్ము వర్ణించుకొంచు
కవులపాలిటి కల్పవృక్షమ! వసంత!

నీవునేర్పిన పాఠాలు నేర్వకున్న
ఎక్కడిదిశాంతిమాకు మహీతలమున
నిన్నుదలపోసి తలపోసి నెమ్మనమ్ము
క్షాళనము నేయకున్న నెక్కడిదిసుఖము

ప్రకృతి సౌందర్యమున పరాత్పరవిభూతి
నరులకందించు గురువరేణ్యా! మహాత్మ!
మరపుముసుగులు తొలగించి మధురమధుర
భావసుధలను పంచియిమ్మా! వసంత!






(జిల్లాల నుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## అనంతపురం

### పశుప్రదర్శనం

కొడిగెనపల్లి పంచాయతీ సమితిలోని లేపాక్షిగ్రామంలో కీ.శే. గ్రామకేంద్రం ఆధ్వర్యంక్రింద గత ఫిబ్రవరినెల 10 వ తేదీన పశుప్రదర్శనం జరిగింది. హిందూపురంలో కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రానికి శాశ్వతం ప్రయోగశాల భవనాన్ని నిర్మించడానికి గ్రామస్థులు కూడా రొక్కపు విరాళాలు ప్రకటించారు.

## కడప

### పాఠశాలభవనం

పెండ్లిమర్రి పంచాయతీ సమితిలోని నల్లాయగారిపల్లి గ్రామంలో కడప జిల్లా కలెక్టరు గత ఫిబ్రవరినెలలో ప్రాథమిక పాఠశాలా భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

## చిత్తూరు

### మధ్యాహ్న భోజన కేంద్రాలు

గంగాధరనెల్లూరు బ్లాకు ప్రాంతంలో గత ఫిబ్రవరిలో మధ్యాహ్న భోజన కేంద్రాలను ఏడింటిని తెరిచారు ఇరవై పాఠశాలల్లో బడి పిల్లలకు పలకలు పంచిపెట్టారు ఫిబ్రవరి 28వ తేదీన హరిజన దినోత్సవం జరిపారు.

### శిక్షణ శిబిరం

సత్యవీడు పంచాయతీ సమితిలోని సిరునంబుదూరు గ్రామంలో గత ఫిబ్రవరి 26 వ తేదీనుంచి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం జరిగింది,

## గుంటూరు

### సంగీత, నాటకగోష్ఠి

గత ఫిబ్రవరి 14, 15 తేదీలలో గుంటూరులోని ప్రభుత్వ మహిళా కళాశాలలో సంగీత, నాటకగోష్ఠి జరిగింది, గురజాల ఉన్నత పాఠశాలవారు ప్రదర్శించిన "ఎంతమార్పు" అనే నాటకానికి ప్రథమ బహుమతి, బి.బి.హెచ్. ఉన్నత పాఠశాల వారు ప్రదర్శించిన "ప్రజారాజ్యం" అనే నాటకానికి ద్వితీయ బహుమతులు లభించాయి.

## ఖమ్మం

### నూతనభవనానికి ప్రారంభోత్సవం

ఖమ్మంజిల్లా రఘునాధపాలెం పంచాయతీ సమితి తాలూకు తోలుపని శిక్షణ పారిశ్రామిక సహకార సంఘం నూతన భవనానికి జిల్లా కలెక్టరు ఫిబ్రవరి 17వ తేదీన ప్రారంభోత్సవం చేశారు,

### పాఠశాలభవనం

తిప్పారెడ్డి గూడెంలో పాఠశాలభవనానికి కలెక్టరు ఫిబ్రవరి 16 వ తేదీన శంకు స్థాపనచేశారు.

### పంచాయతీ గృహం

ఖమ్మంజిల్లా, తిరుమలాయపాలెం పంచాయతీ సమితిలోని పాతర్లపాడు గ్రామప్రజలు పూర్తిగా స్వకృషి ద్వారా నిర్మించిన పంచాయతీ గృహా (ఘర్) న్ని జిల్లా కలెక్టరు ఫిబ్రవరి 16 వ తేదీన ప్రారంభించారు.

## కరీంనగరం

### శిక్షణ శిబిరం

మల్లంపల్లి గ్రామంలో ఫిబ్రవరి 26 నుంచి మూడురోజుల పాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. యాభైమంది శిక్షణ పొందారు.

## కృష్ణా

### లోక సహాయక సేనాశిబిరం

నందిగామలో ముప్పై రోజులపాటు జరిగిన లోకసహాయక సేనా శిబిరం ఫిబ్రవరి 16 వ తేదీన సమాప్తమైంది. 55 మంది శిక్షితులు శిక్షణ కాలంలో ప్రథమ చికిత్స, ఫీల్డ్ ఇంజనీరింగ్ మొదలైన వాటితో సహా వివిధ విషయాలలో శిక్షణపొందారు.

### ఉత్తమ పంచాయతీ

అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడం దృష్ట్యా 1960–61వ సంవత్సరానికి ఉత్తమ పంచాయతీగా బండిపాలెం పంచాయతీని ఎన్నికచేసి, పంకజం రామారావు రోలింగ్ షీల్డును బహూకరించారు.

## మెదక్

### శిక్షణ శిబిరం

వెర్గల్ బ్లాకు పంచాయతీ సమితివారు షన్‌పూరు గ్రామంలో గత ఫిబ్రవరి 10 వ తేదీనుంచి మూడురోజుల పాటు గ్రామ సహాయకుల శిక్షణశిబిరాన్ని నిర్వహించారు. సమితి అధ్యక్షుడు శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. 53 మంది గ్రామస్థులు గ్రామ సహాయకులుగా శిక్షణ పొందారు.

## నెల్లూరు

### మంచినీటి సౌకర్యం

కొండపి పంచాయతీ సమితిలోని పంగులూరువారి పాలెంలో ఎలిమెంటరీ పాఠశాల భవనాల నిర్మాణం గత జనవరి నెలలో ముగిసింది. భవనాల నిర్మాణానికి సుమారు రూ. 7,000 లు ఖర్చయింది దీనిలో రూ. 1,500 ల మొత్తాన్ని సమితి విరాళంగా ఇచ్చింది ఖర్చులో నాలుగవ వంతును ప్రజలు భరించే పద్ధతిమీద నెన్నూరు గ్రామం, చవట హరిజనపాలెం, మాదిగపాలెంలలో మంచి నీటిబావుల నిర్మాణాలు సంతృప్తిగా కొనసాగుతున్నవి. ఒక్కొక్క బావికి సుమారు రూ 3,000ల చొప్పున ఖర్చవుతుంది.

## నల్గొండ

### పరిశీలకబృందం పర్యటన

ఇతర జిల్లాకు ప్రాంతాలలో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలను గురించి తెలుసుకునే నిమిత్తం ఆలేరు పంచాయతీ సమితి వారు ఈ సమితికి చెందిన మహిళామండలి సభ్యులాంధ్ర పర్యటనను ఏర్పాటుచేశారు సభ్యురాండ్రు రాజేంద్రనగర్ క్షేత్రం, నాగార్జున సాగర్ ప్రాజెక్టులను కూడా సందర్శించారు.

## శ్రీకాకుళం

### సాంస్కృతిక ప్రదర్శనలు

ఒక రాష్ట్రానికి చెందిన కళాకారులు మరో రాష్ట్రంలో సాంస్కృతిక ప్రదర్శనలివ్వడానికి సంబంధించి భారత ప్రభుత్వ శాస్త్రీయ పరిశోధనలు, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖ వారు ప్రారంభించిన పథకం క్రింద ఒరిస్సా రాష్ట్రానికి చెందిన కళాకారులు గత మార్చి 7 వ తేదీన శ్రీకాకుళంలో సాంస్కృతిక ప్రదర్శనలిచ్చారు. స్థానిక మునిసిపల్ హైస్కూలులో జరిగిన ఈ ప్రదర్శనలకు కలెక్టరు అధ్యక్షత వహించారు.

## విశాఖపట్నం

### మొక్కల సంరక్షణ కార్యక్రమం

కోటవురట్ల పంచాయతీ సమితి ప్రాంతంలో సుమారు 100 ఎకరాలమేరలో గత ఫిబ్రవరిలో మామిడి మొక్కల సంరక్షణ కార్యక్రమాన్ని అమలు జరిపారు.

## పశ్చిమ గోదావరి

### మహిళా సమితులు

పశ్చిమ గోదావరి జిల్లాలోని ఆకివీడు బ్లాకులో గతఫిబ్రవరిలో కొత్తగా ఒక పాఠశాలను తెరవడం, ప్రస్తుతం పనిచేస్తున్న రెండు పాఠశాలలను అభివృద్ధిపరచడం జరిగింది ఇంతేగాకుండా మూడు బావులలో పూడిక తీశారు రెండు మహిళా సమితులను ప్రారంభించడంకూడా జరిగింది.

# ఉగాది

వేప ప్రసాదం సేవించడం, నూతన వస్త్రాలు ధరించడం. రాబోయే సంవత్సరంలో "దేశ పరిస్థితి"ని గురించి పంచాంగ శ్రవణం చేయడం—ఇవీ "ఉగాది" నాడు తెలుగు వారు విధిగా ఆచరించే కార్యక్రమాలు.

ఈ కాల చక్రంలో "ప్రభవ" తో ప్రారంభమై వరుసగా ఒకటి తరువాత ఒకటి దొర్లిపోయే అరవై సంవత్సరాలలో ఒకటైన "శుభకృతు" 1962 ఏప్రిల్ 5 వ తేదీ నుంచి ఆరంభమవుతుంది. అంతరించిపోతున్న "ప్లవ" నామ సంవత్సరం నాటితో వీడ్కోలు పుచ్చుకుంటుంది

ఒక మనిషి జీవితంలో సంభవించే ప్రధాన సంఘటనలు అతని జనన సమయంలోని "గ్రహస్థితి" పై ఆధారపడి వుంటాయంటారు అతని "జన్మ నక్షత్రం" ఆధారంగానే అతని భవిష్యత్తుపై జోస్యం చెప్తారు. ఇదేవిధంగా వ్యవసాయం, పశుసంపద, పరిశ్రమలు, విద్య, ప్రజారోగ్యం, ప్రకృతి దుశ్చర్యలు, నేరం, న్యాయం మొదలైన సమస్త విషయాలలోనూ ప్రపంచ పరిస్థితిని గురించి విద్వాంసులు ఈ నాడు వివరంగా ఫలితాలు చెప్తారు ప్రజానీకంలో వీటిపట్ల విశ్వాసం బాగా ప్రవేశ్యబారింది. ఉగాదినాడు తెలుగు నాట "పంచాంగ శ్రవణం" జరగని ఊరు వుండదు. ఈ రోజున ప్రతి గ్రామంలోనూ దేవాలయ ప్రాంగణంలోనో లేదా వటవృక్షం క్రిందనో పండితులు నూతన సంవత్సరంలో దేశం, ప్రజల బాగోగులను గురించి "పంచాంగం" చదివి వినిపిస్తారు. భక్తి భావంతో, పూర్ణ విశ్వాసంతో అక్కడ చేరిన పౌరులు వాటిని శ్రద్ధగా ఆలకిస్తారు.

"సంవత్సరం మొదటి రోజు గడిచిన ప్రకారమే సంవత్సరం అంతా గడుస్తుంద"నే నమ్మకం ఒక సామెతై పోయింది. కనుకనే ఎంత పేదవారైనా సరే ఈనాడు నూతన వస్త్రాలు ధరించడంతో, ప్రీతిపాత్రమైన వంటకాలను ఆరగించడంతో సంతృప్తిగా గడుపుతారు. ఉగాదినాడు ఉదయం తలంటు స్నానం అయిన వెంటనే తమకు ప్రియమైన పదార్థాలను పుచ్చుకోడానికి మొదలు. చేదుచేదుగా, తీపితీపిగా వుండే వేప ప్రసాదాన్ని తప్పనిసరిగా చవిచూడవలసి వుంటుంది. ప్రకృతికి వింత శోభనిస్తూ ఈ ఋతువులో మనకు విరివిగా కనిపించే వేపపువ్వు, బెల్లం, కొత్త చింతపండు, ఇదే ఋతువులో లభించే మామిడికాయ ముక్కలను కలిపి దీనిని ప్రత్యేకంగా తయారు చేస్తారు. చేదు, తీపి, పులుపు—ఈ మూడు రకాల రుచులు కలిసిన ఈ పదార్థాన్ని మహానందంగా సేవించినట్టే నూతన సంవత్సరంలో సుఖదుఃఖాలు మొదలైన అన్ని రకాల అనుభవాలనూ సమభావంతో ఎదుర్కోడానికి సిద్ధంగా వుండాలని హెచ్చరిక చేయడం కూడా "వేప ప్రసాదం" పరమార్థాల్లో ఒకటి.

ఉగాది పండుగ ఎప్పుడూ ఆహ్లాదంగా, హాయిగానే గడుస్తుంది. ఈ వసంతఋతువులో పరిసరాల్లోని ప్రకృతి రమణీయత, పండ్లలోకి రాజువంటిదైన మామిడి ఫలాలు, అభిమాన పాత్రమైన "ఆవకాయ" పచ్చడి—వీటన్నిటివలనా "ఉగాది" ఎల్లప్పుడూ ఉల్లాసంగానే గడిచిపోతుంటుంది పోతే మరో విషయమేమిటంటే "ఆవకాయ" పచ్చడి పెట్టుకోనిదే ఏ తెలుగు కుటుంబానికీ గ్రీష్మ ఋతువు గడవదు.

(ఇంగ్లీషు మూలానికి అనువాదం)



# ప్రగతిసాధనకై ఉత్సాహంతో ఉన్ముఖులు కండి

శాసనసభా, మండలి సభ్యులకు

గవర్నర్ శ్రీ భీమసేన్ సచార్ ఉద్బోధ

[క్రిందటి నెల 20వ తేదీన జరిగిన ఆంధ్రప్రదేశ్ శాసనసభ, శాసనమండలి సభ్యులసంయుక్త సమావేశంలో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ భీమసేన్ సచార్ చేసిన ప్రసంగం పూర్తి పాఠాన్ని యీ క్రింద యిస్తున్నాము.]

గౌరవనీయ అధ్యక్షా, సభాపతీ, శాసనమండలి సభ్యులారా!

సాధారణ ఎన్నికల తరువాత జరుగుతున్న ఈ శాసనమండలి తొలి సమావేశానికిహాజరైన మీకు స్వాగతం చెప్పడానికి ఎంతో సంతోషిస్తున్నాను. ప్రజాప్రతినిధులుగా ఎన్నుకోబడినందుకు మీకు నా హృదయపూర్వక అభినందనలు తెలుపుతున్నాను నా ప్రసంగాన్ని కొనసాగించే ముందు—ఆంధ్రప్రదేశ శాసనసభ తొలి సభాపతిగా సభాకార్యకలాపాలను హుందాతోను, నిష్పక్షపాతంగాను నిర్వహించి తమ తరువాత ఆ పదవిని స్వీకరించే వారికి ఎన్నో సత్సంప్రదాయాలను నెలకొల్పిన స్వర్గీయ డా॥ అయ్యదేవర కాళేశ్వరరావు గారికి శ్రద్ధాంజలి ఘటించడం నావిధ్యుక్తధర్మం. శాసనసభలోను, వెలుపల కూడా యావన్మందీ వారిని గౌరవించేవారు. ఆయన పదవిలో వుండగానే దివంగతులయ్యారు ఆయన మరణంవల్ల ఈ రాష్ట్ర ప్రజాజీవనంలో పెద్దలోటు ఏర్పడింది.

మన రాష్ట్రంలో సాధారణ ఎన్నికలు సాఫీగాను, శాంతియుతంగాను నిర్వహించబడ్డాయి. మొత్తంమీద సామరస్య సద్భావ వాతావరణంలో ఇవి జరిగాయి. క్రమబద్ధమైన పద్ధతిలో తమవోటు హక్కును వినియోగించిన లక్షలాది మన వోటర్లు స్త్రీ పురుషులను గౌరవ సభ్యులందరు నాతోపాటు అభినందించగలరని నావిశ్వాసం. ప్రపంచంలో అన్నిటికంటే పెద్ద ప్రజాస్వామిక దేశమైన మనదేశంలో జరిగిన ఈ మూడవ సాధారణ ఎన్నికలను ప్రపంచమంతా ఎంతో ఆసక్తితో తిలకించింది ఈ ఎన్నికలు నిర్వహించబడిన విధానాన్ని విజ్ఞలోకమంతా ప్రశంసించింది. ఈ ఎన్నికలు సాఫీగాను, సక్రమంగాను నిర్వహించబడేటట్లు చూడటానికి ఎట్టి శ్రమకుగాని వెనుదీయకుండా పనిచేసిన అనేకమంది మన ఉద్యోగులను ఈ సందర్భంలో ప్రశంసించవలసివుంది. ప్రాచీనమైన ఈ మనభూమిలో ప్రజాస్వామ్యపు వ్రేళ్లు గట్టిగా నాటుకొన్నవని దీనినిబట్టి వ్యక్తమవుతుంది.

## పరిపాలనా సంస్కరణలు

ప్రభుత్వ కార్యాలయాలు మరింత ఎక్కువ సమర్థవంతంగా పనిచేసేటట్లు చేయడానికి మన ప్రభుత్వం నియమించిన పరిపాలనా సంస్కరణల సంఘం సిఫారసులు చేసిన సంగతి గౌరవసభ్యులకు విదితమే. వీటిలో చాలా సిఫారసులు ఇదివరకే ఆమోదించబడ్డాయి. అవి అమలులో పెట్టబడుతున్నాయికూడ. మిక్కిన సిఫారసులను గురించి ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నది.

హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని వివిధ కార్యాలయాలలో పనిచేస్తున్న తెలుగురాని ప్రభుత్వోద్యోగులకు తెలుగు బోధించేనిమిత్తం ప్రభుత్వం 1961 అక్టోబరు నుంచి వివిధ తావుల్లో బోధనా తరగతులను ప్రారంభించింది. ఈ తరగతుల వల్ల ప్రయోజనం పొందుతూ ప్రభుత్వోద్యోగులు తెలుగు భాషను నేర్చుకొంటూ వుండటం ముదావహం. ఉత్తర ప్రత్యుత్తరాలకు ఉపయోగించే భాషగా తెలుగు తాలూకా స్థాయిలో మరికొన్ని ప్రభుత్వ శాఖలకు కూడా వర్తింపచేయబడింది.

## ప్రాంతీయ భాషగా ఉర్దూ

తెలుగు భాషాధ్యయనాన్ని ప్రోత్సహించడం జరుగుతుండగానే ఉర్దూను ప్రాంతీయ భాషగా పరిగణించాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని అమలు పరచడానికి కూడా చర్యలు తీసుకోబడ్డాయి. తెలుగు మాతృభాషగా వున్న ప్రభుత్వోద్యోగులు హిందీలోగాని, ఉర్దూలోగాని పరీక్షలో ఉత్తీర్ణులు కావాలి. తెలంగాణా ప్రాంతంలోని తొమ్మిది జిల్లాలలోను ప్రభుత్వానికి పంపుకొనే ఉత్తర ప్రత్యుత్తరాలను ఉర్దూలో పంపుకోడానికి వీలుంది. ఉర్దూభాషను ఇంకా ఎక్కువగా ఉపయోగించడానికి, ఇతర జిల్లాలకు దానిని విస్తరింపజేయడానికి గల అవకాశం గురించి పరిశీలించబడుతున్నది. అన్ని రాష్ట్ర సర్వీసులలోను ప్రవేశానికి ఉర్దూ ప్రాంతీయ భాషగా వున్న సంగతి మీ అందరికు తెలుసు. ఉర్దూ మాట్లాడే విద్యార్థులు ఎక్కువగావున్నచోట్ల ఇది పాఠశాలల్లో బోధనా భాషగా కూడ వున్నది.

## మూడవ పంచవర్ష ప్రణాళిక

గత ఏప్రిలు మాసంలో మనం మూడవ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించిన సంగతి గౌరవ సభ్యులు ఎరిగినదే. ఈ ప్రణాళికా ప్రమాణం రూ. 305 కోట్లు. అయితే భారత ప్రభుత్వం వాగ్దానంచేసిన సహాయక మొత్తాన్ని, మన స్వంత ఆదాయ మార్గాలను లెక్కలోనికి తీసుకుంటే మొదటి సంవత్సరపు కార్యక్రమానికిగాను రూ. 48.54 కోట్ల మొత్తాన్ని మాత్రమే సమకూర్చడం సాధ్యమైంది. ప్రాంతీయ సంఘం సిఫార్సుచేసిన తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాలకోసం ప్రత్యేకించిన రూ. 3 కోట్ల మొత్తంకూడా ఇందులో చేరివుంది. మొదటి సంవత్సరానికి కేంద్రం ఇచ్చే సహాయం రూ. 31.00 కోట్లు. ఇక మిగిలిన రూ. 17.54 కోట్ల మొత్తాన్ని మన స్వంతవనరులనుంచి సేకరించుకోవాలి. మూడవ ఆర్థిక సంఘంవారి సిఫారసులు మనకు ఇప్పుడే అందాయి. నానాటికి పెరుగుతున్న ఈ రాష్ట్ర ఆర్థిక అవసరాలను తీర్చటంలో ఈ సిఫారసులు చాలా తోడ్పడ గలవు.

మన రూ. 305 కోట్ల ప్రణాళికను పూర్తిగా అమలుపరచాలంటే వీలైన ప్రతి ఆదాయ మార్గాన్ని మనం వినియోగించవలసివుంటుంది. ప్రణాళికకు కావలసిన పెట్టుబడికోసం తగినంతగా నిధులను సేకరించడంలోను, సంకల్పించిన అభివృద్ధిని సాధించడంలోను గౌరవసభ్యులు మన ప్రభుత్వానికి హృదయపూర్వకంగా చేయూత నివ్వగలరని నా విశ్వాసం.

## రాష్ట్ర ప్రగతి నిర్ణాయక సంఘం

ప్రారంభంనుంచి ప్రణాళికా ద్రవ్యం సంపూర్ణంగాను, సక్రమంగాను వినియోగమయ్యేటట్లూ, వివిధ కార్యక్రమాల విషయంలో నిర్దేశించిన లక్ష్యాలు పూర్తిగా సాధించబడేటట్లూ చూడడానికిగాను మన ప్రభుత్వం సాధ్యమైన చర్యలన్నీ తీసుకొంటున్నది.

ప్రణాళికా పథకాలు అమలు పరచటానికి పూర్వమే వాటి అవధిని అవి దేనికి సంబధించినవో ఆ వివరాలను శ్రద్ధగా పరిశీలింపజేసే నిమిత్తం మన ప్రభుత్వం రాష్ట్ర స్థాయిలో ప్రగతి నిర్ణాయక సంఘం ఒకదాన్ని ఏర్పాటుచేసింది. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి యీ సంఘానికి అధ్యక్షులు. నిధులు పొదుపుగాను, సముచితంగాను వినియోగించబడిందీ లేనిదీ తెలుసుకొనే నిమిత్తం ఇదివరకే అమలు జరిగిన కొన్ని పథకాల విషయంలో పనితీరునుబట్టి ప్రగతిని నిర్ణయించడానికి కూడా ఈ సంఘం పూనుకొంటుంది.

## పంచాయితీరాజ్యం

ప్రజాస్వామ్య పరిపాలనా వికేంద్రీకరణకు సంబంధించిన శాసనాన్ని పురస్కరించుకొని షెడ్యూలు ప్రాంతాలలో తప్ప రాష్ట్రమంతటా పంచాయితీలు ఏర్పాటుచేయబడ్డాయని తెలపడానికి నేనెంతో సంతోషిస్తున్నాను. ప్రజాసంస్థల ప్రయోజనాన్ని ఆదివాసి ప్రాంతాలకు లేకుండా చేయడం భావ్యం కాదనీ వారికిగూడ పంచా

యతీరాజ్య నిర్వహణతో సన్నిహిత సంబంధం కల్పించాలని మన ప్రభుత్వం ఇప్పుడు నిర్ణయించింది. తదనుగుణంగా షెడ్యూలు ప్రాంతాలన్నింటిలో పంచాయతీలను ఏర్పాటు చేయడానికి ప్రత్యేక చర్యలు తీసుకోబడ్డాయి వచ్చేకొద్ది వారాలలోను ఈ ప్రాంతాలలో పంచాయితీల ఏర్పాటు పూర్తి అవుతుంది. అటు తరువాత షెడ్యూలు ప్రాంతాలలో కూడ సామాజికాభివృద్ధి బ్లాకుల్లో పంచాయితీ సమితులు స్థాపించబడతాయి.

## విద్య

తెలంగాణా మిగులు నిధులనుండి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి 1961–62 లో రూ. 189.1 లక్షలు, 1962–63లో రూ. 110 9 లక్షల ఫౌండేషను గ్రాంటు మంజూరు చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ సొమ్ము ఆంధ్రప్రదేశ విద్యుచ్ఛక్తి బోర్డువారి సెక్యూరిటీలలో మదుపు చేయబడుతుంది. దానిమీద వచ్చే వడ్డీ సైన్సు, టెక్నాలజీ శాఖల్లో పోస్టు గ్రాడ్యుయేటు కోర్సుల అభివృద్ధి నిమిత్తం వినియోగించబడుతుంది విద్యుచ్ఛక్తి బోర్డు ఆ మొత్తాన్ని మామూలు ప్రణాళికా పథకాలకదనంగా తెలంగాణా ప్రాంతంలో గ్రామీణ విద్యుదీకరణకోసం వినియోగిస్తుంది

ప్రభుత్వం హైదరాబాదులో ఈ సంవత్సరం గృహ నిర్వహణ శాస్త్రాన్ని బోధించే డిగ్రీ కళాశాలను ప్రారంభించింది ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధించబడింది కెమికల్ ఇంజనీర్ల అవసరం నానాటికి పెరుగుతుండడం వల్ల కెమికల్ ఇంజనీరింగ్ శాఖలో ఎక్కువమంది విద్యార్థులను చేర్చుకోడానికి వీలుగా ఆంధ్ర, ఉస్మానియా విశ్వ విద్యాలయాలకు అదనపు గ్రాంట్లు కూడా ఇవ్వడం జరిగింది.

ఉపాధ్యాయులకు, వారిపై ఆధారపడివున్న వారికి కలిగే ఇబ్బందులను తొలగించే నిమిత్తం భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన "ఉపాధ్యాయుల సంక్షేమ జాతీయ నిధి"కి విరాళంగా మన ప్రభుత్వం రూ. 25 వేలు ఇచ్చింది.

## నీటి పారుదల, విద్యుచ్ఛక్తి

కృష్ణా, గోదావరి నదీ జలాల పంపిణీ విషయంలో భారత ప్రభుత్వం కృష్ణా, గోదావరి కమీషనును నియమించిన సంగతి గౌరవ సభ్యులకు విదితమే. ఆ కమీషను నివేదికకోసం మనం అందరం ఆసక్తితో ఎదురు చూస్తున్నాం. ఈ సమస్య సంతృప్తికరంగా పరిష్కారం కావడంపైననే నీటిపారుదల, జలవిద్యుచ్ఛక్తి రంగాల అభివృద్ధి ఎక్కువగా ఆధారపడివున్న సంగతి మనందరకు తెలిసిందే ఇది లేనిదే రాష్ట్రం అధికంగా పురోభివృద్ధి చెందడం కష్టసాధ్యమవుతుంది.

పెద్ద తరహా ప్రాజెక్టులలో తుంగభద్ర ప్రాజెక్టు దిగువ కాలువ, ప్రకాశం బ్యారేజి, రాళ్లపాడు ప్రాజెక్టు, వైరవాని తిప్ప ప్రాజెక్టు, ఎగువ పెన్నారు ప్రాజెక్టు పూర్తిచేయబడి లాభసాటిగా ఉపయోగంలోకి తేబడ్డాయి. రాజోలిబండ మళ్లింపు పథకం పని, తుంగభద్ర ప్రాజెక్టు ఎగువకాలువకు, మధ్య పెన్నారు రెగ్యులేటరుకు సంబంధించిన పని చురుకుగా సాగుతున్నది పోచంపాడు ప్రాజెక్టుకు తాలూకు ప్రాథమికమైన పనులు చేపట్టబడ్డాయి. భారత ప్రభుత్వం ఈ ప్రాజెక్టుకు ఆమోదం తెలిపిన వెంటనే ఆనకట్ట నిర్మాణం, కాలువ త్రవ్వకం ప్రారంభించబడతాయి

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు రెండింటిలోను కూడా మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చిన మధ్యరకం నీటి పారుదల పథకాలలో చాలా భాగం ఇప్పుడు పూర్తి అయ్యాయి వంశధార, నాగావళి, శారద మొదలైనవాటికి సంబంధించి కోస్తా జిల్లాలలో వరద నిరోధక పథకాలు ఎన్నో అమలు జరపడానికి చేపట్టడం జరిగింది. గోదావరి వరదకట్టలను గట్టిపరిచారు కొల్లేరు అంచు గ్రామముల్లోని 20 వేల ఎకరాలు ముంపుకు లోను కాకుండా కాపాడేటందుకు ఉద్దేశించిన బుడమేరు మళ్లింపు పథకం పూర్తి అయింది. పెక్కు ఇతర వరద నిరోధక పథకాలకు సంబంధించిన పనికూడా కొనసాగుతున్నది.

బృహత్తరమైన నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం అత్యధిక వేగంతో సాగుతున్నది. దీని నిర్మాణం పూర్తి అయ్యేటంతవరకు పనిని ప్రస్తుత వేగంతోనే సాగించే నిమిత్తం ఈ ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన సిబ్బంది ఆయత్తం చేయబడింది *1962–63* సంవత్సరంలో కృష్ణా డెల్టాలో రెండవ పంట క్రింద 1 5 లక్షల ఎకరాలకు నీరు విడుదల చేయడానికి తలపెట్టబడింది

తెలంగాణా ప్రాంతం వెనుకబడివున్న అంశందృష్ట్యా తెలంగాణా హైడ్రోథర్మల్ పథకానికిగాను మన ప్రభుత్వం రూ. 18 67 కోట్లు ఏక అంచనా మొత్తాన్ని మంజూరు చేసింది. కొత్తగూడెం థర్మల్ పథకం, రామగుండం విస్తరణ పథకం కూడా అమలుకు మంజూరు చేయబడ్డాయి. విజయవాడ విద్యుత్కేంద్రాన్ని

23-12-1961 తేదీన స్వాధీనం చేసుకోవడంతో రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి సంస్థలన్నింటిని ప్రభుత్వం జాతీయం చేయడం పూర్తి అయిందని కూడా గౌరవ సభ్యులు గుర్తించనగును.

## భారీ పరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు

భారీ పరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు అభివృద్ధి పరచటానికి ఆంధ్రప్రదేశ పారిశ్రామికాభివృద్ధి సంస్థను, లఘుపరిశ్రమలకు తోడ్పడేటందుకు ఆంధ్రప్రదేశ లఘుపరిశ్రమాభివృద్ధిసంస్థను, రాష్ట్రంలోని ఖనిజసంపదను వినియోగంలోకి తేవడానికి ఆంధ్రప్రదేశ మైనింగ్ సంస్థను స్థాపించిన విషయం గౌరవ సభ్యులకు తెలిసినదే. భారీ విద్యుత్పరికరాల కర్మాగారాలలో ఒక దానిని హైదరాబాదులో ఏర్పాటు చేయడానికి భారత ప్రభుత్వం చేసిన నిర్ణయంకూడా ఈ రాష్ట్ర పారిశ్రామికీకరణ విషయంలో అధిక ప్రాముఖ్యం వహిస్తుంది. పారిశ్రామికీకరణ త్వరితగతిని జరగటానికి వీలుగా ప్రైవేటురంగానికి సంబంధించి మనప్రభుత్వం ఎంతో ఉదారభావాన్ని, సరళమైనరిని చూపుతున్నది. భారీ పరిశ్రమలను, మధ్యరకం పరిశ్రమలను స్థాపించి ప్రజల శ్రేయస్సుకోసం మన వనరులను వినియోగించు కొనేటందుకు ముందుకు రావడానికి రాష్ట్రంలోపలా, రాష్ట్రం వెలపలావుండేపారిశ్రామికులకు ప్రోత్సాహాన్నివ్వడమే మన సుస్థిరవిధానం ఇప్పటి సాలుసరి బొగ్గుఉత్పత్తి 26.5 లక్షల టన్నులను మూడవ ప్రణాళికాంతం నాటికి సుమారు 56 5 లక్షల టన్నుల వరకు పెంచడానికి సింగరేణి బొగ్గుగనుల కంపెనీ పథకం రూపొందించింది.

చర్మ పరిశ్రమను, టానింగు పరిశ్రమను అభివృద్ధి పరచడానికి ఎడ్ హాకు లెదర్ బోర్డుకూడా ఏర్పరచబడింది, త్వరలోనే అందుకవసరమయ్యే శాసనం పరిశీలనకోసము మీ ముందుకు రాబోతున్నది.

## వైద్యం, ఆరోగ్యసదుపాయాలు

దక్షిణమండలానికి అందుబాటులో వుండేటట్లు హైదరాబాదులో పోస్టు-గ్రాడ్యుయేటువైద్య విద్యగరిపే కేంద్ర వైద్య న్యాయ సంస్థను స్థాపించే ప్రతిపాదన రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల పరిశీలనలో వున్నది. మలేరియా నిర్మూలన కార్యక్రమాన్ని కొనసాగించడానికి రాష్ట్ర వ్యాప్తంగా మశూచి నివారణ కార్యక్రమాలను ప్రారంభించడానికి కూడా ప్రతిపాదనలు ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి.

15 లక్షల రూపాయల ఖర్చుతో ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల నిర్మాణానికి సంబంధించిన ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించింది. ఇది మూడవ ప్రణాళికా కాలంలో చేపట్టబడుతుంది. ఈ కళాశాలను ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధించే విషయంలో తగు చర్య తీసుకొనబడుచున్నది

## కార్మికులు

ఉద్యోగుల రాష్ట్రభీమా పథకాన్ని ఈ సంవత్సరంలో మరి నాలుగు పట్టణాలకు అంటే రాజమండ్రి, ధవళేశ్వరం, కర్నూలు, రేణిగుంటలకు విస్తరింప జేయడానికి ఉద్దేశించబడింది. పై ప్రదేశాలలో వైద్యశాలలను నెలకొల్పడానికి అవసరమయ్యే సిబ్బందీ, ఖర్చు మంజూరు చేయబడ్డాయి వీటివల్ల భీమాచేసుకొన్న ఒక లక్షకు పైబడ్డ కార్మికులకు, వారి కుటుంబాలకు వైద్య సదుపాయాలను కలుగ చేయటానికి వీలవుతుంది.

## ఋతు పరిస్థితులు

అనంతపురం, కర్నూలు, కడప, శ్రీకాకుళం, విశాఖపట్నం, చిత్తూరు, నెల్లూరు హైదరాబాదుజిల్లాలలోని కొన్నిప్రాంతాలుతప్ప రాష్ట్రంలో ఋతు పరిస్థితులు, పంట పరిస్థితులు మొత్తంమీద అనుకూలంగానే వున్నాయి అనావృష్టికి గురియైన ప్రాంతాలలో ఆ పరిస్థితి నెదుర్కొనే నిమిత్తం కార్మికులకు పని కల్పించడానికి సహాయ కార్యక్రమాలు ప్రారంభించడం ద్వారాను, శిస్తువసూలను మాఫీ చేయడం, నిలుపుచేయడం ద్వారాను, తక్కావీ ఋణాలుగా పంచేటందుకు అదనపు కేటాయింపులను మంజూరు చేయడం ద్వారాను ప్రభుత్వం అవసరమైనచర్యలు తీసుకొన్నది ఈ సహాయ కార్యక్రమాలకోసం ఈ సంవత్సరానికి రూ. 27.8లక్షల మొత్తం మంజూరు చేయబడింది.

## భూముల కేటాయింపు

ప్రభుత్వ బంజరు భూములను కేటాయించే విషయంలో ప్రభుత్వం తగు శ్రద్ధ చూపుతున్నది 8.61 344 40 ఎకరాలు ఇది వరకే కేటాయింపు చేయబడ్డాయి

## శాసన కార్యక్రమం

1962-63 వార్షిక బడ్జెటును పరిశీలించడమన్నది ప్రస్తుత సమావేశంలోని ముఖ్యకార్యక్రమం, అయినప్పటికీ వర్తమాన సంవత్సరంలో కొన్ని ఖర్చు పద్దులకుగాను అనుబంధపు అంచనాలూ, రాబోయే సంవత్సరానికి బడ్జెటు తయారయ్యే వరకు "ఓట్ ఆన్ అకౌంటు" వెంటనే మీ పరిశీలనకు వస్తాయి.

మీ పరిశీలనకు వచ్చే కొన్ని శాసనాంశాలు:

1952 ఆంధ్రప్రదేశ మోటారుబండ్ల (ప్రయాణీకులపైన, సరుకులపైన పన్ను) చట్టపు చెల్లుబడిని పొడిగించేబిల్లు;

మున్సిపల్ కౌన్సిలర్ల పదవీ కాలాన్ని మూడు సంవత్సరాల నుండి 5 సంవత్సరాలవరకు పొడిగించడం కోసం 1920 ఆంధ్ర ప్రదేశ (ఆంధ్రప్రాంతపు) జిల్లా మున్సిపాలిటీల చట్టాన్ని సవరించే బిల్లు; కౌన్సిల్ పునర్నిర్మాణాన్ని అనువైన కాలం వరకు వాయిదా వేయడానికి రాష్ట్రప్రభుత్వానికి అధికారమిచ్చే మరోబిల్లు;

రాష్ట్రంలో ప్రస్తుతంవున్న సహకార అపెక్స్ బ్యాంకులను విలీనపరిచే బిల్లు;

వ్యవసాయ విశ్వవిద్యాలయం, క్రమబద్ధమైన మార్కెట్లు, సహకార సంఘాలు, గిడ్డంగులు—వీటిస్థాపనకు, వడ్డీ వ్యాపారపు వినిమయ నియంత్రణకు సంబంధించిన బిల్లులు

### ముగింపు

ఇప్పుడు సాధారణ ఎన్నికల సంరంభం పూర్తి అయింది. కాబట్టి మన ప్రజలకు ప్రగతిని, వికాసాన్ని చేకూర్చేటందుకు ఉద్దేశించబడ్డ వివిధ కార్యక్రమాలకు చేయూతనిచ్చే ఉత్సాహ ప్రదమైన కార్యభాగంవైపు మీలక్ష్యాన్ని మరల్చగలరని నా విశ్వాసం. సభలోని అన్నివర్గాలవారు ఈ విషయంలో సమాన బాధ్యతను వహించవలసి వుంది ఈ బాధ్యతను నిర్వర్తించడంలో వారు ఒకరినొకరు మించగలరనడంలో నాకెట్టి సందేహంలేదు మీ కార్య కలాపాలు సహనభావంతోను, సహకారభావంతోను జరుగ గలవని. దీనివల్ల సభామర్యాద మరింత ఇనుమడించగలదని నా నమ్మకం.

మీకు శుభమగుగాక! మీ కార్యకలాపాలు జయప్రద మగుగాక!!

జై హింద్



# విశేషాలు

### ఆంధ్రప్రదేశ్ మంటపానికి ప్రథమ బహుమతి

మద్రాసులో జరిగిన రెండవ అ. జాతీయ వ్యవసాయ ప్రదర్శనంలో నెలకొల్పిన ఆంధ్రప్రదేశ్ మంటపానికి ప్రథమ బహుమతి లభించింది. ఈ ప్రదర్శనంలో పాల్గొన్న వారికి మద్రాసు ముఖ్య మంత్రి గత నెల 11 వ తేదీన బహుమతులు అందజేశారు

### గోదావరి నదిలో గొప్ప మత్స్య క్షేత్రాలు

గోదావరి నదీ ముఖ ప్రాంతాలలో మత్స్య క్షేత్రాల ఉనికిని గురించి తెలుసుకునేందుకై మొదటిసారిగా ఇటీవల పరిశీలనలు జరిపారు. గోదావరి నదీ ముఖ ప్రాంతాలలో తూర్పుతీరం మొత్తం తోనే గొప్పవైన మత్స్య క్షేత్రాలు వుండటమే గాకుండా ఈ ప్రాంతంలో లభించే రొయ్యల రకాలు ఆసియా ఖండం అంతటి లోనూ లభించే వాటి కంటే పెద్దవైనట్లు ఈ పరిశీలనలో తేలింది.

స్థానిక మార్కెట్లలో రొయ్యలు పౌను అర్ధరూపాయకు అమ్ముడవుతుండగా అమెరికాలో ఒక డాలరుకు అమ్ముడు పోతున్నట్లు తెలుస్తున్నది • • •

# సౌందర్యలహరి

డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

అరువదినాల్గు తంత్రముల నందఱు కన్నియభీష్ట సిద్ధులన్
తరగకనిచ్చు పూనికనుదాచి, జగంబును మోసగించి, ఈ
శ్వరుడురకుండె; నీబలిమి సర్వపుమర్థములన్ ఘటింప నే
ర్పరియగు నీ స్వతంత్రమగు పావన తంత్రముఁ దింపె నుర్విపై.

శివశక్తి స్మరభూములన్ నిలిపి, యా చిత్రాంశు శీతాంశు హ్రా
ద్భవ సూర్యేంద్రులఁ బిమ్మటన్ గలిపి, యాపైనిన్ బరామార మా
ధవులన్ జేరిచి, మూటికిన్ గొనల సంధానింపహ్మ్రల్లేఖలన్,
భవదాఖ్యావయవత్వ మొందు, జననీ! వర్ణమ్ములివ్వన్నియున్.

సతతాకశేషసుఖైకసక్త సమయాచారుల్ నినున్ శాస్త్ర స
మ్మతి, నీ మంత్రముముందు, కామ, భగ, పద్మాబీజముల్ నిల్పి, యం
చిత చింతామణి గుంఫితాక్షవలయుల్ చిత్తంబులన్ గొల్తురా
హుంతులస్వేల్చి శివాగ్ని స్వర్గవిసుధాజ్యోద్భూత ధారావలిన్.

రవిచంద్రస్తనమండలద్వయముతో రమ్యాకృతిన్ దాల్చు శం
భువు దేహంబవు; నీ శరీరమును శంభుండౌనవాత్మంచు భై
రవుడంచెంచెద; శేషశేషితలనన్ రాజిల్లు సామాన్య మై
నవితా! మీయెడ, సామరస్యపరతన్ సంబంధమున్నొక్కటై.

ఈవేమానస, మాకసమ్ము, మఱి, నీవేవాయు వీవగ్నియున్,
నీవేనీరును భూమి, ఈ పరిణతిన్ నీవొంద, లేదన్య మం
బా! విశ్వాకృతి నీవనిన్ బరిణమింపన్ దాల్తువా శాంతపీ
భావానన్ బరచిత్సుఖాకృతిని; సద్రుద్రాసుసంధాయినీ!

రవి సోమానల కాంతిపుంజములు చేరన్ లేని యాలోక మం
దవలోకింపగరాని చంద్రికలలోకావాస మేదేవునిన్
సవిధిన్ గొల్వగఁగల్గు భక్తులకు, నా చంద్రార్కకోటిద్యుతిన్
భవదాజ్ఞావలయస్థునీశు, పరచిత్పూర్ణ్యున్ శివున్ గొల్చెదన్.

అమలస్ఫాటికకాంతిఁ వెల్గుచు విశుద్ధాబ్జమ్ము నందుండి వ్యో
మముఁగల్పించెడియీశుఁ, దత్సమరసన్ మాతన్ నినున్ గొల్చెదన్,
దమినేద్వంద్వము మేని వెన్నెలలఁ విధ్వస్తాంతరాంతస్తమ
స్సముదాయమ్మయి వెల్గుఁజక్కవ వలెన్ సర్వప్రపంచమ్మునఁ.

ఏ మిథునంపు పల్కు పదునెన్మిది విద్దెలలోనిసారమౌ
నో, మఱి నీటఁబాల నటులొయ్యన దోసమునం గుణంబు దా
నేమిథునమ్ముదెల్పునో, చిదేక సరోజమరందభావుక
మ్మముని మానసాగ్రచరహంసయుగమ్ము, నెదఁభజించెదన్

క్రోధారక్తము, యేనిచూపుసకల క్షోణుల్ దహించుఁ, గృపన్
సాధించున్ శిశిరోపచారములనే సమ్యగ్దయాదృష్టి, నీ
స్వాధిష్ఠానమునఁ మహాగ్నిగతునా సంవర్తరూపేశ్వరుఁ
మాధుర్యమ్మొలికించు నాసమయయఁ మాహేశ్వరిఁ గొల్చెదన్

వరమణి పూరచక్రమున వర్తిలుచుఁ దిమిరప్రతారణో
ద్ధురమగుశక్తియన్ మెఱుపుతో నవరత్నవిభూషణాద్భుత
స్ఫురణమహేంద్రచాపముగగల్గి, హరాగ్నిఁ దపించు లోకమున్
దరికొని వర్షమున్ గురియు నల్లని మేఘమొకండుగొల్చెదఁ

మూలాధారమునన్నటన్మధురమౌ మూర్తిఁ కళన్ గూడి, చి
ల్లీలాతాండవలోలుడౌ నవరసాలీఢైకచిత్తున్, శివుఁ,
గాలాధిష్ఠితు, భైరవున్ దలతు; బల్ కారుణ్యతన్ లోకముల్
పాలింపన్ బితలైన వేలుపుల దాంపత్యంబునెంతుఁ మదిన్

దినమణిపుంజమున్ మణులతీరునఁ జెక్కి ఘటించి నట్టినీ
కనకకిరీటమున్ సొగసుగా వినుతించినవాఁడు తత్ఫలల్
గనిపలువన్నెలీను శశిఖండము నింద్రధనుస్సటన్నయూ
హనుగలిగింపకుండులెటులమ్మ, హిమాచలకన్యకామణీ!

బలభిత్పుంజరనందనోపవన కల్పక్ష్మాజపుష్పవ్రజ
మ్ములు సామోదముగన్ స్వభావమధురామోదానకై చేరునే
లలితస్నిగ్ధవినీల సాంద్రతర సల్లావణ్యమై తోచునీ
దలితేందీవరకేశపాశమది. మూర్ధాంతమ్ముచెందాడుతన్

పలిమలపట్టి, నీకురులు వాలెడి చీకటి మూకలౌచుదా
యల, జెరబెట్టి, బట్టుపడునంబుజ బంధుమయూఖమోయనన్
తెలువయి పాపటంగులుకు చెందిరమద్దిర! మోముసోయగం
బొలసెడునగ్గుజాలనగ నొప్పుచుమాకు శుభమ్ములిచ్చుతన్

దరహాసాంచితదంతకేసరరుచిన్ దళ్కొంది సౌగంధ్యని
ర్భరమౌ నీముఖబింబమా స్మరహరవ్యాలోలదృగ్వల్లరిన్
మరులంగొల్పుచు, నైజమౌ కుటిలతన్ మార్కొన్న రోలంబవి
స్ఫురణంగ్రమ్మెడు ముంగురుల్ ముసర, నవ్వాన్ బద్మసౌందర్యమున్.

లావణ్యద్యుతులీనునీవిమల ఫాలమ్మంతు కోటీరమం
దావాసించెడి చంద్రఖండమున కన్యంబంచు, నట్లేయగున్
దేవీ! యొండొకడంచులంగలిపి వాసిన్ మేల్సుధాలేపమున్
గావింపన్ బరిణామమొందెగద రాకాచంద్రబింబమ్ముగన్.

భువనభయమ్ముబాపు తమిపూనిన తల్లిరో! తేటిజంటకున్
సవతగునీదు కన్గవగొనంబుగ, వంగిననీదు కన్బొమల్
శివ! కుసుమాస్త్రుడయ్యెడమచేత ప్రకోష్ఠము ముష్టిగ్రమ్మనిం
పవునటు పట్టుకొన్నధనువంచు దలంచెదనమ్మనెమ్మదిన్

అరయన్ నీ కుడికన్నుగూర్చు పవలయ్యర్కస్వరూపాన, దా
తిరినీ దాపలికన్నుగూరుచుగదే దీపించి చంద్రాత్మతన్;
దరవిస్మేరనవారుణాంబుజరుచిన్ దళ్కొత్తు నీఫాలనే
త్రరుచుల్ మించి, తదంతరమ్మునను సంధానించు సంధ్యాద్వయిన్.

కననీచూపువిశాల, విస్ఫుటరుచిన్ గల్యాణి, యక్కాల్వలన్
దనరుందల్లి! యయోధ్యయై, వరకృపాధారాప్తి కాధారయౌ,
జననీ! యొప్పునవంతియై, మధురయై, సత్యమ్ముయందందమిం
చిన పేరొంది మహాపురీవిజయమై శ్రీభోగవత్యాఖ్యయై.

సరసకవీంద్రకావ్యసుమసాంద్రమరంద రసైకపానత
త్పరమగు కర్ణయుగ్మమును బాయక యంటి రసప్రలుబ్ధతా
భరమున పీనుకోనలకుఁ బ్రాకెడి చూడ్కుల తేంట్లజూచి, నీ
స్ఫురదురు ఫాలలోచన మసూయమెయిన్ సగమెట్టివారెడిన్.

భవుశృంగారరసార్ద్రితన్, బరులభీభత్సమ్మునన్, జాహ్నవిన్
సవతిన్ గ్రోధముతోడ, నద్భుతమునన్ సర్వజ్ఞఫాలాక్షమున్,
శివసర్పంబులభీతిచే, సరసిజశ్రీవంకబీరమ్మునన్,
స్వవయస్యాళిని నవ్వులన్ గనుకనుల్ సారించు నాపైఁగృపన్

చెవిదాకంజని పక్ష్మసంతతిగరుచ్ఛ్రీ నొప్పునీనేత్రముల్
భవచిత్తప్రశమాపనోదన మహాభాగ్యమ్ముచేఁబట్టి, ఆ
శ్రవణాకృష్టసుమాస్త్రసాయక మహాసౌందర్యమున్ లోచనో
త్సవమున్ జేయు, ధరాధరాధిపకులోత్తంసాగ్రరత్నప్రభా!

కనులకునోయగంబొదవగానిడు కాటుకరేకసొంపునన్
జననిరొ! మూడు వన్నెలనెసంగెడి నీనయనత్రయమ్మునున్;
మునువిలయమ్మునొందిన త్రిమూర్తుల విష్ణువిరించిరుద్రులన్
మనుపగఁబూనికూర్చెనొ గుణంబుల సత్వరజస్తమంబులన్

అరుణసితాసితద్యుతిసమంచితముల్ కరుణాంతరంగముల్
పరమమహేశ్వరప్రవణభావ! భవన్నయనమ్ములన్ మమున్
గరముపవిత్రులన్ జలుపగంగను శోణను భానుకన్యనున్
సరసనమూడుతీర్థముల సంగమమున్ వెలయింతు వొక్కటిన్

ఓయగరాజకన్య! జగమొయ్యన నీకనుమూఁతలోనఁ గ
న్మూయను, విచ్చువిప్పుకొనఁ: మున్నటు నీకనువిప్పులోనమే
లై యనువొందు సృష్టినిదయన్ బ్రలయమ్మునుండి గావగా
నీయెడనిర్నిమేషతవహించెను నీకనులంచునెంచెదన్

చెవిదరిఁజేరి కొండెములెసెప్పును నీకనులంచుఁదెప్పవా
ల్పవు శఫరుల్ భయమ్మున జలమ్ములనక్కియ; తేకుతల్పుల
య్యవి యటుమూసికల్వనెలవల్లన వేకువవీడిలచ్చి తా
నవిమగుడంవడిందెఱచి యందతటాలునరాత్రి చొచ్చెడిన్

నిడుపయినల్లనై కలువనిగ్గుల దొంగిలు నీదుకన్గవన్
వెడలుకృపారసమ్మనను వేదడుపంగదెదీనుడైన న;
న్నడరెడి దానధన్యుడను ; అందునన్నికొక నేగిరాద: కొ
రడవిని మేడపై సరిగనానెల వెన్నెల గాయుఁ గాదటే!!

నీపాళీయుగళంబరాళమగుటన్, నీహారశైలాత్మజా!
చాపం బిద్దిస్మరీయమంచు నెవడా శంకింప డద్దమ్మగా
నాపాంగీనవిలాసముల్ శ్రవణ సమాక్రాంతతన్ బొంది సం
దీపింపన్. మరుతీక్ష్ణసాయకములెంతేఁ దీవ్రమైనట్టులన్

నిగనిగలీనుచెక్కిళుల నీ చెవికమ్మలు తళ్కులీన, నీ
మొగమును నాల్గుచక్రములు పూన్చినయమ్మరు తేఱటందునే
నగజ! రవీందుచక్రధృతమైన ధరారథమెక్కి వచ్చునీ
మగఁనసైన్యునిన్ మరుఁడు మార్కొనుటందనకాదెయొక్కఁడున్

అలదివ్యామృత వీచికావిభవ సంహారంబుఁ గావించునీ
పలుకున్ దేనియ. వీనుదోయిఖలచేఁ బల్మారు సేవించుచున్
దలపంకింపగ నీచమత్కృతికి మోదమ్మొంది వాగ్దేవి. యు
జ్వలతత్కుండల నాదముల్ ప్రతి వచస్పందమ్ములట్లయ్యెడిన్

ఉరునీహారధరాధరేంద్ర పృథువంశోద్యత్పతాకా! సుధా
కరనిశ్వాసపరంపరా విధృతముక్తాజాలమున్ లోన, ద
త్సరణిన్ వెల్పలిముత్యమున్ గులుకునాసావంశమత్యన్నమున్
దరిలోనున్నఫలమ్ము మాకుచితమున్ నాతల్లి! పండించుతన్

జనని! స్వభావ రక్తమగు చక్కని నీయధరాన కీడుప
ల్కెన? పవడంపుతీగయ ఫలంబును బంః పలెంటుమమ్మ; తా
నెనయనవాదు బింబఫల, మేలన. త్వత్ప్రతిబింబభాగమా
త్రనగద మెత్తనయ్యెనది. తానెనయోటకు సిగ్గుచెందదే!

నీ వదనేందుబింబమున నిగ్గులుదేరెడు నవ్వువెన్నెలల్
ద్రావుచకోరచంచువులు, తన్మధురాతిశయాన లోచవుల్
వోవగ. పుల్లనై పొలుచు పూర్ణసుధాకరకాంతిపూరముల్
వావిరిఁ ద్రావురేలఁ దరవాణిగ వాచవులూఁరదార్వతీ!

(సశేషము)



# 1962-63 వ సం. పు ఆంధ్రప్రదేశ్ తాత్కాలిక బడ్జెట్

ఆర్థిక శాఖామంత్రి

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

సమర్పణ:

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక శాఖా మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి క్రిందటి నెల 22 వ తేదీన, 1962–63 వ సంవత్సరపు ఆంధ్ర ప్రదేశ్ తాత్కాలిక బడ్జెటును రాష్ట్ర శాసనసభలో సమర్పించారు 1962–63 వ సంవత్సరంలో మొత్తం రెవెన్యూ జమ రూ 111.22 కోట్లు వుండగా, మొత్తం సర్వీసుఖర్చు రూ. 113 35 కోట్ల వరకు వుండగలదనీ, కాబట్టి రెవెన్యూ ఖాతా క్రింద జరిగే వ్యవహారాల వలన రూ 2.13 కోట్ల తరగు ఏర్పడవచ్చునని ఆర్థిక మంత్రి వెల్లడించారు.

తృతీయ ప్రణాళికా కాలంలో రూ. 45 కోట్లను సమకూర్చటానికి రాష్ట్ర ప్రభుత్వం ఉద్దేశించిందనీ, వివిధ కారణాల వల్ల 1961–62 వ సంవత్సరంలో ఎలాంటి కొత్త పన్నులు ప్రవేశ పెట్టడానికి వీలులేకపోయిందనీ, ఆ విధంగా ఒక సంవత్సరకాలం గడిచిపోయిందనీ, కాబట్టి వచ్చే నాలుగేళ్ళలో రూ 45 కోట్లను సమకూర్చుకోటానికి గాను మనం పన్నుల విధానాన్ని ధైర్యంగా రూపొందించుకోవలసిన అవశ్యకత వున్నదని ఆర్థిక శాఖామాత్యులు తమ ప్రసంగంలో తెలియజేశారు

కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన మూడవ ఆర్థిక సంఘపు సిఫార్సుల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు, వచ్చే నాలుగేళ్ళు ఏడాదికి రూ. 6 4 కోట్లు అదనంగా లభించగలవని అయన చెప్పారు.

రాజ్యాంగపు 275 (1) వ సూత్రం ప్రకారం సహాయక గ్రాంటు క్రింద రాష్ట్రానికి ఈ ఏడాది (1962–63) రూ 9.50 కోట్లు లభించవచ్చని చెప్తూ ఈ విధంగా లభించే సహాయక గ్రాంట్ల విషయంలో దేశంలో ఆంధ్రప్రదేశ్‌ది ద్వితీయ స్థానం అని శ్రీ బ్రహ్మానందరెడ్డి వివరించారు

కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించే పథకాలతో సహా ప్రణాళికా పథకాలకు గాను కేంద్రప్రభుత్వపు గ్రాంట్లు వచ్చే ఏడాది రూ 10 84 కోట్లు వుండవచ్చని కూడా అయన తెలిపారు.

వచ్చే ఏడాది ప్రణాళికా పథకాలకు, ప్రణాళికకు చెందని పథకాలకు అయ్యే పెట్టుబడి వినియోగం రూ 29 83 కోట్లు వుంటుందనీ, వివిధ పద్దుల క్రింద అప్పులు, అడ్వాన్సుల ఖాతాప పంపిణీలు రూ. 16.48 కోట్ల దాకా వుంటాయని ఆర్థికమంత్రి చెప్పారు.

1962–63 కార్యక్రమం క్రింద వివిధ ప్రణాళికా పథకాలకు రూ. 49.97 కోట్లు ఖర్చవుతాయనీ, ఈ మొత్తంలో రూ. 19.33 కోట్లు తెలంగాణా ప్రాంతంలోనూ, మిగతా రూ. 30.64 కోట్లు ఆంధ్ర ప్రాంతంలోను వివిధ అభివృద్ధి కార్యక్రమాలకై వినియోగించబడతాయని ఆర్థిక మంత్రి వివరించారు.

ప్రణాళికా సమితి 1962–63 సంవత్సరానికి రూ. 33 కోట్ల కేంద్ర ప్రభుత్వ సహాయం లభించగలదని సూచించిందనీ, 1962–63 ప్రణాళికా కార్యక్రమానికి డబ్బును సమకూర్చుకోటానికి కనబడే నికర వసతులు రూ. 39.34 కోట్ల వరకు వుండగలవనీ, కాగా మొత్తం లోటు సుమారు రు 10.63 కోట్లు అనీ, ఈ ఏడాది ఈ మొత్తాన్ని భర్తీ చేసుకోటానికి మార్గాలను ఆలోచించాలనీ, కాబట్టి వచ్చే ఏడాది ప్రణాళికా పథకాలను రెండు అంచెలుగా అమలు జరపటానికి నిశ్చయించబడిందని శ్రీ బ్రహ్మానందరెడ్డి తెలిపారు.

మొదటి దశ రూ. 42 కోట్లకు పరిమితమై వుంటుందనీ, రెండవ దశకు మరో రూ. 8 కోట్లు అవసరమవుతాయనీ, వచ్చే శాసనసభ సమావేశంలో పన్నులకు గాను ప్రభుత్వ ప్రతిపాదనలు ఆమోదించబడిన తరువాత రెండవ దశ విషయం చూసుకోవచ్చని ఆయన చెప్పారు.

ఆర్థిక శాఖా మంత్రి బడ్జెటు ప్రసంగం పాఠం దిగువ ఇవ్వబడినది:

"అధ్యక్షా,

1962–63 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ బడ్జెట్‌ను సమర్పిస్తున్నాను.

అయితే ఇది తాత్కాలికపు బడ్జెట్ మాత్రమే. ప్రస్తుతానికి వేసుకొన్న బడ్జెట్ మాత్రమే. ఇప్పుడు వున్న సిబ్బంది వగైరాల నిర్వహణకు, ఇదివరకే అమలు జరుగుతున్న పథకాలను కొనసాగించడానికి కావలసిన ధనాన్ని, ఇప్పటి రివిన్యూను, ఇతర ఆదాయాన్ని లెక్కలోకి తీసుకొని, ఈ బడ్జెటును తయారుచేయటం జరిగింది. కొత్త మంత్రి వర్గపు నూతన విధానాలనుగాని, నిర్ణయాలనుగాని ఈ బడ్జెట్ ద్యోతకం చేయదు. కొత్త మంత్రివర్గం ఏర్పడింది ఇటీవలనే గాబట్టి, రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని గురించి వివరంగా పరిశీలించటానికి వ్యవధి లేకుండెను.

ఈ సంవత్సరం, అనగా ఆర్థిక సంవత్సరం త్వరలో ముగింపుకు వస్తోంది, సమగ్రమైన బడ్జెటును పరిశీలించటానికై గౌరవ సభ్యులు సమావేశమయ్యేంతవరకు, ప్రస్తుత సిబ్బంది వగైరాల నిర్వహణకు గాను తగినంత ధనాన్ని ప్రభుత్వానికి సమకూర్చటం అవసరం. అందుకని, ఈ సంవత్సరం జులై 31 వ తేదీ వరకు ఖర్చులు సమ్మతిని పొందాలని అనుకున్నాం."

1962–63 వ సం. పు బడ్జెటు అంచనాలను గురించి చెప్తూ ఆర్థిక మంత్రి ఇలా అన్నారు:

"ఈ సంవత్సరపు మొత్తం రివిన్యూ జమ రూ. 111.22 కోట్లు ఉండగలదని భావిస్తున్నాం. వివరాలు:–

| | 1961–62 సవరించిన అంచనాలు | 1962–63 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|
| | రూ. కోట్లు | |
| (అ) మామూలు రివిన్యూ | 79.15 | 93.87 |
| (ఆ) మూడవ ఆర్థిక సంఘపు తీర్పు ప్రకారం రివిన్యూలో వచ్చే పెరుగుదల | ... | 6.41 |
| (ఇ) ప్రణాళికా పథకాలకుగాను లభించగల కేంద్ర గ్రాంట్లు | 8.39 | 10.94 |
| మొత్తం | 87.54 | 111.22 |

"ఈ తారతమ్యాల కారణాలగురించి, బడ్జెటుపై ఆర్థికశాఖ కార్యదర్శి సమర్పించిన వివరణ నివేదికలో వివరంగా తెలియజేయటమైంది.

"ప్రభుత్వపు వ్యాపార సంస్థలకు సంబంధించిన నిర్వహణ ఖర్చులను ప్రభుత్వపు లెక్కల్లో చూపించే విధానంలో కొన్ని మార్పులను చేయటం జరిగింది. ఇదే ముఖ్యకారణం–వచ్చే సంవత్సరపు మామూలు రివిన్యూలోని పెరుగుదలకు. ఇంతవరకు నిర్వహణ ఖర్చులను (డిప్రీసియేషన్, వడ్డీలతోసహా) మొత్తం జమల్లో తగ్గింపులుగా చూపుతూ వచ్చాం. కాని కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ సలహామీద, కేంద్ర ప్రభుత్వ విధానంబట్టి, మొత్తం జమలను బడ్జెట్ రివిన్యూ పద్దుకింద చూపాలని, నిర్వహణ ఖర్చులను ఖర్చువైపు చూపాలని నిర్ణయించటం జరిగింది. అందుమూలంగా, రివిన్యూ జమ ప్రభుత్వ వ్యాపారసంస్థల నిర్వహణ ఖర్చుల మొత్తానికి సమానంగా పెరిగింది. ఎందుకంటె ఈ ఖర్చుల అంకెలను

ఖర్చు వైపుకు మార్చటం జరిగింది. ఆయా పద్దులను నిర్ణయించే విషయంలో చేసిన ఈమార్పుల మూలంగా, జమవైపున రూ.12.03 కోట్ల పెరుగుదల కనబడుతోంది అదే పెరుగుదల ఖర్చువైపున కనబడుతుంది. ప్రభుత్వ ఎక్సైజ్ సుంకాలకింద (రూ. 0.83 కోట్లు), నిలవనిధుల్లోంచి తీసుకునే మొత్తంకింద (రూ. 1.40 కోట్లు). మిగతా పద్దులకింద (రూ. 0.46 కోట్లు) వచ్చే అధిక ఆదాయాన్నికూడా 1962–63 బడ్జెట్ అంచనాల్లో లెక్కలోకి తీసుకున్నాం.

"వచ్చే ఏడాది రివిన్యూ పెరుగుదలకు సంబంధించిన మరొక ముఖ్యమైన అంశం మూడవ ఆర్థిక సంఘపు తీర్పు. రెండవ ఆర్థిక సంఘపు సిఫార్సుల ప్రకారం చేసుకున్న ప్రస్తుతపు ఏర్పాట్లబట్టి వివిధకేంద్రపన్నుల్లో రాష్ట్రానికి వచ్చేవాటా, మొత్తం రూ. 16.36 కోట్లు–రాజ్యాంగపు 275 (1) వ సూత్రం ప్రకారం ఏడాదికి సహాయపు గ్రాంటు క్రింద వచ్చే రూ. 4 కోట్లు కాక, మూడవ ఆర్థిక సంఘంవారు కొన్ని నెలలక్రితం మన రాష్ట్రానికి వచ్చారు. మన ఇబ్బందులను అవగతం చేసుకున్నారు. మూడవ ప్రణాళికకు సమకూర్చుకోవలసిన డబ్బు విషయంలో అదనపు వసతుల అవశ్యకతగూడా వారి దృష్టిలోకి వచ్చింది. కేంద్రప్రభుత్వపు పన్నుల్లో లభించే మామూలు వాటాకు అదనంగా, ఆంధ్రప్రదేశ్ కు సహాయ గ్రాంటుకింద అధికమొత్తాన్ని మంజూరు చేయవలసిందిగా సిఫార్సు చేశారుకూడా. ఇందుకుగాను, వారికెంతో కృతజ్ఞులం, గౌరవ సభ్యులకు కూడా ఈ సందర్భంలో మా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. అలాగే వివిధ సంస్థలకు పత్రికలకుకూడా. ఎందుకంటె వివిధ ప్రతినిధులు ఆర్థిక సంఘాన్ని కలుసుకుని, కేంద్రప్రభుత్వపు పన్నుల్లోంచి ఇంకెక్కువ వాటాను కేటాయించ వలసిందని, అలాగే సహాయ గ్రాంట్ల క్రింద అధికమొత్తాన్ని మంజూరు చేయాలని ఉద్ఘాటించారు."

సర్వీస్‌ఖర్చును పేర్కొంటూ ఆర్థికమంత్రి ఇలా అన్నారు:

"ఖర్చువైపున బడ్జెట్‌లో మొత్తం సర్వీస్ ఖర్చు రూ. 113.35 కోట్లు అని చూపబడింది. అయితే సవరించిన అంచనా రూ. 93.31 కోట్లు. వివరాలు దిగువ విధంగా ఉంటాయి:–

| | 1961–62 సవరించిన అంచనాలు | 1962–63 బడ్జెట్ అంచనాలు |
|---|---|---|
| | రూ. కోట్లు | |
| 1. మామూలు అంచనా | 76.83 | 94.35 |
| 2. ప్రణాళికా ఖర్చు | | |
| (అ) రాష్ట్ర ప్రణాళిక | 15 03 | 16 00 |
| (ఆ) కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించే పథకాలు | 1 45 | 3.00 |
| మొత్తం | 93.31 | 113.35 |

"ఈ అంకెల మార్పులను గురించి ఆర్థిక కార్యదర్శి వివరణ నివేదికలో వివరించారు. మామూలు ఖర్చులోని పెరుగుదలకు సంబంధించిన ముఖ్య కారణాన్ని ఇంతకుముందే సూచించాను. ప్రభుత్వ వ్యాపార సంస్థల నిర్వహణ ఖర్చులను లెక్కల్లో చూపించే పద్ధతిలో మార్పు తెచ్చాం. అదే ప్రధాన కారణం. ఆ విధంగా రూ. 12 03 కోట్ల పెరుగుదల ఏర్పడింది ఇక ప్రభుత్వోద్యోగుల జీతాలను సవరించటం, కరువు భత్యాన్ని జీతంలో కలపటం, గ్రామోద్యోగుల జీతాలను పెంచటం, (ఈ మూడింటికి గాను పూర్తి సంవత్సరానికవసరమైన మొత్తాలను కేటాయించటం) జిల్లా పరిషత్తులకు, పంచాయతీ సమితులకు విద్యా సంస్థల విషయమై గ్రాంట్లను అధికం చేయటం, వివిధశాఖల పనిపాటలు పెరగటం, గ్రేడ్ల ప్రకారం ఇచ్చే ఇంక్రిమెంట్లు—మిగతా పెరుగుదలకు ఇవి కారణాలు. పంచదార చెరకు ప్రాంతంలో రోడ్ల నిర్మాణానికి, (రూ. 10 లక్షలు), రోడ్లనిర్వహణకు (రూ. 35 లక్షలు) బడ్జెట్‌లో కేటాయింపులు చేయబడినై.

"రివిన్యూ ఖాతా క్రింద జరిగే వ్యవహారాలవలన రూ. 2 13 కోట్ల తరుగు ఏర్పడవచ్చు. వివరాలు:—

| | | రూ. కోట్లు |
|---|---|---|
| రివిన్యూ జమలు | ... | 111 22 |
| ఖర్చు ... | ... | 113 35 |
| | తరుగు | 2.13 |

"వచ్చే ఏడాది ప్రణాళికా పథకాలకు, ప్రణాళికకు చెందని పథకాలకు అయ్యే పెట్టుబడి వినియోగం రూ. 29 83 కోట్లు ఉంటుంది. వివిధ పద్దులకింద అప్పుల, అడ్వాన్సుల ఖాతాన పంపిణీలు రూ. 15 48 కోట్ల దాకా ఉంటయి.

"తిరిగి చెల్లింపుకు చేసే కేటాయింపు పోగా, వచ్చే ఏడాది ప్రజా ఋణం రూ. 8.72 కోట్లను సమకూర్చగలదని భావిస్తున్నాం. చిన్న పొదుపు ఉద్యమంవల్ల లభించేదాంట్లో రాష్ట్రానికి వచ్చే

ఖాతా రూ. 3 కోట్లు నిలవనిధుల కింద, మిగతా అప్పుపద్దులకింద జరిగే వ్యవహారాల వలన రూ. 17.74 కోట్లు నికరంగా లభించవచ్చు. ఈ రివిన్యూపద్దు, పెట్టుబడిపద్దు, అప్పుపద్దు—వీటన్నిటి వ్యవహారాల మొత్తం ఫలితంగా నికరమైన తరుగు రూ 2.50 కోట్లు ఉంటుంది.

## ప్రణాళికా వినియోగం

"ఆంధ్రప్రదేశ్ మూడవ పంచవర్ష ప్రణాళిక మొత్తం వినియోగం రూ. 305 కోట్లు, ఇందులో రూ. 48.54 కోట్లు ప్రస్తుతపు ఆర్థిక సంవత్సరంలో ఖర్చు అవుతయ్. 1962–63 కార్యక్రమం కింద రూ. 49.97 కోట్లు ఖర్చు అవుతయ్. ఇందులో రూ. 16 కోట్లు రివిన్యూ ఖాతాకింద, మిగతా రూ. 33.97 కోట్లు వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన అప్పులు, అడ్వాన్సులతోసహా పెట్టుబడి ఖాతాకింద ఖర్చు అవుతయ్. ఈ రూ. 49.97 కోట్ల మొత్తంలో, రూ. 19.33 కోట్లు తెలంగాణాలో ఖర్చు అవుతయ్. మిగతా రూ. 30.64 కోట్లు ఆంధ్ర ప్రాంతంలోని వివిధ అభివృద్ధి కార్యక్రమాలకై వినియోగింపబడుతై.

"ప్రణాళికా సమితి 1962–63 సంవత్సరానికి రూ. 33 కోట్ల కేంద్ర ప్రభుత్వ సహాయం లభించగలదని సూచించింది. ఇప్పటి అంచనాలు, నిర్ణయాల ప్రకారం, రాష్ట్ర ప్రభుత్వం రూ. 13.49 కోట్లను సమకూర్చుకోగలుగుతుంది. ఇందులో రూ. 7.15 కోట్లు వెంటనేకావాలి—ఎందుకంటె సంవత్సర ప్రారంభంలోవున్న తరుగును వెంటనే రద్దుచేసుకోవాలి అంటే 1962–63 ప్రణాళికా కార్యక్రమానికి డబ్బును సమకూర్చుకొనటానికి కనబడే నికర వసతులు రూ. 39.34 కోట్లదాకా వుండగలవు. కాని అనుకొన్న వ్యయం రూ. 49.97 కోట్లదాకా వుంటుంది అనగా మొత్తం తరుగు—ఉన్నవసతులకు, ప్రణాళికా వినియోగానికి మధ్యనున్న లోటు మొత్తం—రూ. 10.63 కోట్లు వుంటుంది ఈ ఏడాది ఈ మొత్తాన్ని భర్తీచేసుకొనటానికి మార్గాలను ఆలోచించాలి కొబట్టి వచ్చే ఏడాది ప్రణాళికా పథకాలను రెండు అంచెలుగా అమలు జరుపాలని నిశ్చయించాం. మొదటిదశ రూ. 42 కోట్లకు పరిమితమై ఉంటుంది. రెండవదశకు మరొక యెనిమిది కోట్లు అవసరమౌతయ్. వచ్చే శాసనసభ సమావేశంలో సప్లిమెంటరీ ప్రతిపాదనలుగా... సన్నుతకుగాను ప్రభుత్వ ప్రతిపాదనలు అమోదింపబడిన తర్వాత, రెండవదశ విషయం చూసుకోవచ్చు.

తన ప్రసంగాన్ని ముగిస్తూ ఆర్థికమంత్రి ఇలా అన్నారు:

" రాష్ట్రపు ఆర్థిక పరిస్థితిని స్థిరపరచటంలో ప్రభుత్వం గౌరవ సభ్యులనుండి సంపూర్ణమైన సహాయ సహకారాలను పొందగలదనే నమ్మకం నాకువుంది.

"ఇంతకు మునుపు చెప్పినట్లు వచ్చే నాలుగు నెలల్లో అనగా 1962 ఏప్రిల్ నుంచి జూలైదాకా కాగలదనుకున్న ఖర్చుకు అవసరమైన మొత్తానికి శాసనసభ ఓటును (ఓట్ ఆన్ ఎక్కౌంట్) అభ్యర్థిస్తున్నాను. నాప్రసంగాన్ని శ్రద్ధగా విన్నందుకు నేను గౌరవ సభ్యులను అభినందిస్తున్నాను.

జై హింద్ !"



# పంచాయతీరాజ్య పురోగమనం

## వయోజన విద్యా వ్యాప్తి

మండపల్లి పంచాయతీసమితిలోని అప్పాపురం, గన్నవరం, ఇలపర్రు, రాఘుగుంట, వెల్వాని పుట్ల చెర్వు, పెదకమూడి, వడలి, గోకినంపాడు, చినగొన్నూరు గ్రామాలలో గత ఫిబ్రవరి మొదటి తేదీన వయోజన విద్యా కేంద్రాలను తెరిచారు. ఈ గ్రామాలలోని నిరక్షరాస్యులైన వయోజనులు ఈ కేంద్రాల నుండి పూర్తిగా ప్రయోజనం పొందుతున్నారు. సాధారణ విజ్ఞానం, లెక్కలు మొదలైన విషయాలను వారు చాలా ఆసక్తితో అభ్యసిస్తున్నట్లు తెలుస్తున్నది. వసుమర్రు గ్రామంలో ఎలిమెంటరీ పాఠశాల విద్యార్థులకు మంచి వసతి సౌకర్యం కల్పించే నిమిత్తం సుమారు రూ 9,000 ల వ్యయంతో ఒక పాఠశాల భవనాన్ని నిర్మించారు.

## గొర్రెల పెంపకం కేంద్రాలు

ఆలూరు పంచాయతీసమితిలోని గుల్యం, హులెబీడు గ్రామాల ప్రజలు గొర్రెల పెంపకం పట్ల చాలా ఆసక్తి చూపుతున్నారు. గత ఫిబ్రవరి నెలలో గుల్యంలో రెండు గొర్రెల పెంపకం కేంద్రాలనూ, హులెబీడులో ఒక కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ కేంద్రాలకు ఒక్కొక్కదానికి ప్రజలు సగం ఖర్చును భరించే పద్ధతి మీద 16 లేక 16 గొర్రెలను సరఫరా చేశారు.

ఇదే బ్లాకులోని యేమూరు గ్రామంలో ప్రజలు ఎలిమెంటరీ పాఠశాల భవన నిర్మాణంలో పాల్గొన్నారు. నెమకల్‌లో నెలకొల్పిన గ్రామీణ పశు చికిత్సాలయం ఇప్పుడు సంతృప్తికరంగా పనిచేస్తున్నది. కొద్ది రోజుల్లోనే దీనిని చిన్నతరహా పశు చికిత్సశాల క్రింద మార్చడానికి యోచిస్తున్నారు.

## స్వయం సహాయం

పరకాల సమితిలోని అన్ని గ్రామాలలోనూ గత ఫిబ్రవరిలో స్వయం సహాయం కార్యక్రమాన్ని అమలు జరిపారు. ఈ కార్యక్రమం క్రింద బ్లాకు ప్రాంతంలో 70 కంపోస్టు గోతులు త్రవ్వారు. 20 సంవత్సరాల రోడ్డు ప్రణాళిక క్రింద రూ. 10,000 లు ఖర్చుపెట్టారు. సంవత్సరానికి 100 గజాల చొప్పున రోడ్డు నిర్మించడాన్ని లక్ష్యంగా పెట్టుకోగా ఆ లక్ష్యాన్ని మించి సుమారు 114 గజాల కచ్చారోడ్డు నిర్మాణాన్ని సాధించారు. ఇంతే గాక నహీంపేట గ్రామంలో ఈ కార్యక్రమం క్రింద 60,000 ఇటుకలు తయారు చేశారు.

## మంచినీటి బావి

ఉర్యాలగూడెం పంచాయతీసమితిలోని సెట్టిపాలెం గ్రామ పంచాయతీ గత ఫిబ్రవరిలో హరిజనుల కొరకు ఒక మంచినీటి బావిని నిర్మించింది. దీనితో అచ్చటి ప్రజల చిరకాల వాంఛ సిద్ధించింది. రాగిడ, లెదకిపల్ళ్ళ గ్రామ ప్రజలు తమ తమ గ్రామాలలో వరుసగా 20,1 గజాల మేరకు రోడ్లు మరమ్మతు చేసుకున్నారు. అంజనపల్లి సర్కిలులో మూడు తిన్నబావులు త్రవ్వారు. ఇదే విధంగా మాడు గులపల్లి సర్కిలులో మూడు ఎకరాల భూమికి నీటి పారుదల చేయగల ఒక మోట బావిని కూడా త్రవ్వారు.

## పైలట్ ప్రాజెక్టు

ఉద్యోగావకాశాలను కల్పించడానికీ, ఆహార సమస్యను పరిష్కరించడానికీ ఉద్దేశించిన రూ. 3 లక్షల పైలట్ ప్రాజెక్టును అమలు జరుపడానికి చిత్తూరు జిల్లా రామకుప్పం బ్లాకును ప్రభుత్వం ఎన్నిక చేసింది. జిల్లా కలెక్టరు నాయకత్వం క్రింద ఉన్న అధికార బృందం ఒకటి గత మార్చి 8 వ తేదీన బ్లాకును సందర్శించి ఈ పథకం యొక్క వివిధ అంశాలను గురించి తెలుసుకున్నది.

రూ. 46 000 ల వ్యయంతో నిర్మించదలిచిన పంచాయతీ సమితి కార్యాలయ భవనానికీ, అనిగనూరులో రూ. 6,000 ల ఖర్చుతో నిర్మించ నుద్దేశించిన పాఠశాల భవనానికీ కలెక్టరు పునాది రాళ్ళు వేశారు. పాఠశాల భవనం వ్యయంలో సగం మొత్తాన్ని ప్రజలు భరిస్తారు. బ్లాకు ప్రాంతంలో 500 ఎకరాల మేరలో సహకార వ్యవసాయాన్ని ప్రారంభించడానికి సంబంధించిన పథకానికి తుది మెరుగులు దిద్దుతున్నారు.

గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే కార్యక్రమం క్రింద, బ్లాకు ప్రాంతంలో పెక్కు గ్రామాలకు విద్యుత్ సౌకర్యాలను లభింపజెయ్యడానికై రూ. 32 లక్షల ఖర్చుతో చూడిన ఒక పథకాన్ని సిద్ధం చేశారు.

## గ్రామీణ ఉత్పత్తి సంఘాలు

ములుగు పంచాయతీసమితి ప్రాంతంలో గత ఫిబ్రవరిలో నిర్ణీతమైన పది గ్రామాలలో గ్రామీణ ఉత్పత్తి సంఘాలను స్థాపించారు. తీవ్రతర అభివృద్ధికై వాటిని వివిధ విస్తరణాధికార్లకు కేటాయించారు. ఇరవై సంవత్సరాల రోడ్డు ప్రణాళిక క్రింద సుమారు పది ఫర్లాంగుల కచ్చారోడ్డు నిర్మించారు. ఈ కార్యక్రమం తీవ్రంగా కొనసాగుతున్నది.

## తక్కావీ ఋణాలు

కొల్లాపూరు పంచాయతీసమితి ప్రాంతంలో గత ఫిబ్రవరిలో రూ 31,885 ల మేరకు ఖర్చుపెట్టారు. దీనిలో రూ 6,085 ల మొత్తాన్ని బావుల త్రవ్వకానికి తక్కావీ ఋణాలుగా పంపిణీ చేశారు ఈ పథకం క్రింద ప్రస్తుతం 30 బావుల నిర్మాణం సాగుతున్నది. నాలుగు రేడియో శ్రోతల బృందాలు, మూడు భజన మండలులు ఏర్పడ్డాయి.

## మోటారు పంపు సెట్లు

ఆర్మూరు పంచాయతీసమితి ప్రాంతంలో గత ఫిబ్రవరిలో సేద్యపు నీటి పారుదల నిమిత్తం 43 విద్యుచ్ఛక్తి మోటారు పంపు సెట్లను నెలకొల్పారు. రైతులు పెద్ద ఎత్తున కూరగాయలు పండించి నిజామాబాదు ఆర్మూర్ సంతలలో విక్రయిస్తున్నారు. ఈ ప్రాంతంలో మోటారు పంపు సెట్ల సహాయంతో 55 ఎకరాలను సాగుచేస్తున్నారు



ప్రకృతి నీవు, నా ప్రణయ రూపమ్ము నీవు,

వప రిసమ్ముల నీవు, ఆనంద మీవు;

సుందరీ! నీవు నాలోన కందళించి

పంవశింతును నేను నీ పరిమళమున.

"మధుగీత"

## సంగ్రహ ప్రకటనలు

### విద్యుచ్ఛక్తి రేషనింగు

తెలంగాణా ప్రాంతంలో. 1962 ఏప్రిల్ మొదటి తేదీనుండి 1963 జనవరి 25వ తేదీవరకు గానీ లేదా తరువాత ప్రకటించబడే మరేదైనా తేదీవరకుగాను విద్యుచ్ఛక్తి రేషనింగును అమలు పరచడానికి ప్రభుత్వం ఉత్తర్వు చేసింది. ఈ ఉత్తర్వు (1) హైద్రాబాదు, (2) మహబూబ్ నగరం, (3) ఆదిలాబాదు (4) నిజామాబాదు (5) కరీంనగరం, (6) మెదక్, (7) వరంగల్, (8) నల్గొండ, (9) ఖమ్మంజిల్లాలకు వర్తిస్తుంది.

విద్యుచ్ఛక్తి వినియోగదారు నెలసరిసగటు వాడకాన్ని, 1961 జనవరి మొదటి తేదీనుంచి డిశంబరు 31వ తేదీ వరకుగల 12 నెలలలో జరిగిన వాడకాన్నిబట్టి నిర్ణయిస్తారు. ఒకవేళ వినియోగదారు విద్యుచ్ఛక్తి సరఫరాను 1961 జనవరి మొదటితేదీ తరువాత పొందినట్లయితే అతడు సరఫరా పొందిన తేదీనుంచి వరుసగా 12 నెలల వరకు జరిగిన వినియోగాన్ని బట్టి ఈ నెలసరి సగటు వాడకాన్ని నిర్ణయిస్తారు. ఈ విధంగా లెక్కకట్టి తేల్చిన నెలసరి సగటు వాడకంలో 80 శాతాన్ని కోటాగా నిర్ణయిస్తారు

డిప్యూటి చీఫ్ ఎకౌంటెంటు నిర్ణయించిన కోటాల వల్ల అసంతృప్తి చెందిన వినియోగదార్లు, హైద్రాబాదులోని సూపరింటెండింగు ఇంజనీరు (ఆపరేషన్)కు దరఖాస్తు చేసుకోవచ్చు. వారినిర్ణయమే తుది నిర్ణయం కాగలదు

### పొగాకు కొట్లకు నెంబర్లు:

గుంటూరు, గోదావరి, కృష్ణా ఆపరిసర ప్రాంతాలలో పొగాకు బాగుచేయడానికి బొగ్గు జారీచేస్తారనే విషయం ప్రజలకు తెలిసిందే. దీనికొరకు నిర్మించబడిన కొట్ల ఆధారంగానే బొగ్గును సరఫరా చేస్తారు. కొట్ల సంఖ్య, యాజమాన్య వివరాలు యివ్వకుండా కొట్ల యజమానులు బొగ్గు పర్మిట్లకొరకు పంపే దరఖాస్తులను పరిశీలించడం యెంతో కష్టం. అందువల్లనే 1962_63 వ సంవత్సరంలో బొగ్గుకావలసిన కొట్ల యజమానులు తమకొట్ల గదులపైన నెంబర్లను స్పష్టంగా వ్రాయాలని కంట్రోలు వరుకుల డైరెక్టరు ఉత్తర్వులు జారీ చేశారు. 1961_62వ సంవత్సరానికి జారీచేసిన 'కోలుకార్డు' లపై నెంబర్లు లభ్యమౌతాయి. 1962_63వ సంవత్సరానికీ, ఆ తర్వాతా బొగ్గు కావలసిన రైతులు తమ కొట్లపై ఉన్న నెంబర్లు చెడిపోకుండాజాగ్రత్త వహించాలనికూడా ఆ ఉత్తర్వులో తెలియచేశారు

### గోవాకు బియ్యం ఎగుమతి

1957 వ సం॥ పు బియ్యం (దక్షిణమండలం) రవాణా కంట్రోలు ఉత్తర్వులో ఉన్న యే అంశంతో కూడా నిమిత్తంలేకుండా, దక్షిణమండలంలో ఏ ప్రాంతం నుంచైనా గోవాలోని యే ప్రాంతానికైనా, బియ్యం, వడ్లు, వాటి ఉత్పత్తులను తరలించడాన్ని న్యాయబద్ధమైన చర్యగా భారత ప్రభుత్వం ప్రకటించింది.

### ప్రాంతీయ రవాణా సంస్థలు

కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల ప్రాంతీయ రవాణా సంస్థల అనధికార సభ్యుల సభ్యత్వగడువు 1963 ఆగస్టు 31 వ తేదీ వరకు పొడిగించబడింది.

### పునరవాసం

జైళ్లు, ధృవీకృత పాఠశాలలు, బోర్స్టల్ స్కూళ్లు, అనాథశరణాలయాలు, వికలాంగుల గృహాలు మొదలైనవాటినుంచి విడుదలై వచ్చే వ్యక్తుల పునరావాసానికి ఉద్దేశించిన "సాంఘిక, నైతిక పునరుద్ధరణ మొదలైన కార్యక్రమా"లను రాష్ట్ర ప్రభుత్వం అమలు పరుస్తున్నది. పై సంస్థల నుండి విడుదలయ్యే వ్యక్తులలో చాలామంది సమాజంలో ఇమడిపోలేని వారుగా వుంటారు. ప్రభుత్వ సాంఘిక సంక్షేమశాఖ వారికి సహాయం చేస్తుంది. పురుషులకు ఉద్దేశించిన కార్యక్రమాలు సాంఘికసంక్షేమ శాఖ డైరెక్టరు అధ్వర్యం క్రిందా, స్త్రీలకు ఉద్దేశించిన కార్యక్రమాలు మహిళా సంక్షేమ శాఖ డైరెక్టరు అధ్వర్యం క్రింద అమలు జరుగుతున్నాయి.

### ఓటర్ల జాబితాలలో పేర్లు

1962 మార్చి 2వ తేదీతో ఎన్నికలు ముగిశాయి. ఈ తేదీ

తరువాత, ఓటర్ల జాబితాలో తమ పేర్లు చేర్పించుకోడానికై దరఖాస్తులు పెట్టేవారు, తమ దరఖాస్తులను ఎన్నికల ప్రధానాధి కారికి గాక తమ ప్రాంతానికి సంబంధించిన ఓటర్ల నమోదు అధికారికి దాఖలు చేయాలి. దరఖాస్తుతోపాటు ఎనిమిది అణాల ఫీజును నాన్ జుడీషియల్ స్టాంపు రూపంలో చెల్లించవలసి వుంటుంది ఎన్నికల ప్రకటన ప్రచురణ తేదీ, ఎన్నికల ముగింపు తేదీల మధ్య కాలంలో దాఖలు చేసుకున్న దరఖాస్తులను మాత్రమే మూడు రూపాయిల విలువగల నాన్ జుడీషియల్ స్టాంపుతో పాటు ఎన్నికల ప్రధానాధికారికి దాఖలు చేయవలసి వుంది. ఉప ఎన్నికల సందర్భంతో కూడా ఈ నియమమే వర్తిస్తుంది.

## తక్కువఆదాయ వర్గాలవారి గృహాల కేటాయింపు

తక్కువ ఆదాయ వర్గాలవారి గృహ నిర్మాణ పథకం క్రింద నిర్మించిన ఇండ్లను, అద్దెకొనుగోలు పద్ధతిమీద కేటాయించడాన్ని క్రమబద్ధం చేసే నియమావళి క్రింద, మహబూబ్ నగరం మునిసిపాలిటీ కొరకు దిగువ వ్యక్తులతో కొత్త కేటాయింపు సలహాసంఘాన్ని నియమించడానికి ప్రభుత్వం ఆదేశించింది. (1) కలెక్టరు, అధ్యక్షుడు, (2) డిప్యూటీ కలెక్టరు, ఉపాధ్యక్షుడు, (3) మునిసిపల్ కమిటీ అధ్యక్షుడు, (4) శ్రీ పి. హన్మంతరావు, ఎం.పి., (5) శ్రీ మహమ్మద్ ఇబ్రహీంఅలీఅన్సారీ, మహబూబ్ నగరం నగర మునిసిపాలిటీ సభ్యుడు; (6) శ్రీ ఎస్. చంద్రయ్య, గృహ నిర్మాణ సహకార సంఘం కార్యదర్శి, వర్తకుడు, మహబూబ్ నగరం.

## ఆస్తుల మార్పిడిచట్టం సవరణ

1882 వ సం. పు ఆస్తుల మార్పిడిచట్టం సవరణకు తగు సిఫార్సులు చేసే నిమిత్తం న్యాయమంత్రిత్వశాఖ (లెజిస్లేటివ్ డిపార్టుమెంటు) లాకమీషను ఈ చట్టాన్ని సవరించడానికై తీసుకోదగు చర్యలను పరిశీలిస్తున్నది. ఈ సందర్భంలో ఎవరైనా ఏమైనా సూచనలు చేయదలిస్తే వాటిని కమిషనుకు తెలియజేయవచ్చు. తమ సూచనలను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శికి 1962 సెప్టెంబరు మొదటి తేదీ వరకు అందజేయాలి.

## కార్యాలయ వేళలమార్పు

క్రమ శిక్షణ వ్యవహారాల న్యాయస్థానం కార్యాలయం 1962 మార్చి 15వతేదీనుంచి 1962 జూన్ 7వ తేదీవరకు ఉదయం 8 గం॥ల నుంచి మధ్యాహ్నం 1-30 గం. వరకు పనిచేస్తుందని ప్రభుత్వం ప్రకటించింది.



పండుటాకెంతకాలము బ్రతికి యుండు
నంత కాలము రెండవయాకు చిగురె;
శిశిర మాసమ్ము ప్రతిఘటించెదవ యేని
పొంద నేర్తువు నిత్య నవోదయమ్ము.

"మధుగీత"

ప్రణాళిక ద్వారా మీకు కలిగే ప్రయోజనాలు

# ప్రతి ఒక్కరి
# సరిపడినంత
# ఆహారం



ఆహార ధాన్యాల ఉత్పత్తిని 7 కోట్ల 60 లక్షల టన్నుల నుంచి 10 కోట్ల టన్నులకు హెచ్చించడం తృతీయ ప్రణాళిక లక్ష్యం. ఇందువల్ల సగటున ప్రతి ఒక్కరూ రోజూ భుజించే ఆహారం పరిమాణం 16 ఔన్సులనుంచి 17.5 ఔన్సులకు పెరగగలదు.

ప్రణాళిక విజయానికి తోడ్పడండి తద్వారా

**మూడవ పంచవర్ష ప్రణాళిక** | **ప్రతి ఒక్కరికీ ఆనందదాయకమైన జీవితం**

DA-61/745

# పారిశ్రామిక విశేషాలు

(1962 ఫిబ్రవరి)

[రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామికవేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్యపారిశ్రామిక విశేషాలు యీ శీర్షిక క్రింద యివ్వబడుతున్నవి.]

## కేంద్ర ప్రాజెక్టులు

సింథటిక్ ఔషధాల ప్రాజెక్టు, భారీవిద్యుత్పరికరాల ప్రాజెక్టులకు ఎన్నిక చేసిన స్థలాలను చదును చేసే పనులు చురుగ్గా కొనసాగుతున్నవి.

## ప్రైవేటు రంగం

కాకినాడలో బస్సులు, లారీలు, స్టేషన్ వ్యాగన్ల బాడీలను ఉత్పత్తి చేయడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఇనుప గుండ్లు మొదలైనవాటిని ఉత్పత్తి చేసే నిమిత్తం విశాఖపట్నంలో ఒకఫ్యాక్టరీని స్థాపించడానికికూడా లైసెన్సు ఇచ్చారు.

రోజుకు 40టన్నుల గోధుమలు విసిరే శక్తిగల రోలర్ పిండి మిల్లులను నెలకొల్పుకోడానికి ఆంధ్రప్రదేశ్‌లోని రెండు సంస్థలకు భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. దీనితో రోజుకు అదనంగా 200 టన్నుల పిండి విసిరే శక్తి గల మరలను ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో స్థాపించుకోడానికి భారత ప్రభుత్వం ఆమోదించింది. నికొటానిక్ అసిడ్ హైడ్రాజిడ్ ఉత్పాదకశక్తిని నెలకు 400 కెజీలకూ, ఐబ్యుటజైడ్ ఉత్పాదక శక్తిని 80 కెజీలకూ పెంపొందించడానికి ఒక స్థానిక మందుల ఉత్పత్తి సంస్థకు అనుమతి ఇచ్చారు.

గుంటూరు జిల్లాలో లభించే మాగ్నసైటు ఖనిజంవినియోగం విషయంలో సూచనలు చేసే నిమిత్తం ప్రభుత్వం ఒకసంఘాన్ని నియమించింది. దక్షిణప్రాంతం సూపరింటెండింగ్ జియాలొజిస్టు, గనులశాఖ డైరెక్టరు, పరిశ్రమలు, వాణిజ్య శాఖడైరెక్టరు, ఇంకా కొందరు రాష్ట్ర అధికార్లు ఈ సంఘం సభ్యులుగా వున్నారు.

## బొగ్గు అవసరమైన పరిశ్రమల అభివృద్ధి

సింగరేణి బొగ్గుగనుల (ప్రభుత్వ కంపెనీ) లో బొగ్గు ఉత్పత్తి పెరుగుతూ ఉన్నది. 1960 వ సంవత్సరంలో 25,02,993 టన్నులు మాత్రమే ఉత్పత్తి కాగా 1961 లో 27,95,402 టన్నుల ఉత్పత్తి జరిగింది.

రాష్ట్రంలో బొగ్గు అవసరమైన పరిశ్రమల అభివృద్ధి విషయంలో సలహాలు యిచ్చే నిమిత్తం ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ప్రాంతీయ పరిశోధనశాల డైరెక్టరు శ్రీ హుస్సేన్ జహీర్, సింగరేణి కాలరీస్ జనరల్ మేనేజర్ శ్రీ నర్గూండ్కర్‌లను యీ సంఘానికి యితర అధికారులతో పాటు నామినేటు చేశారు.

చక్కెర పరిశ్రమ :—నిజాం చక్కెర ఫ్యాక్టరీ విస్తరణ పథకం అమలు పూర్తి అయిన తర్వాత, రెండు యూనిట్లు 1962 జనవరిలో 1,00,855 టన్నుల చెరకును పిండాయి

పనివారలకై నిర్మింపబడే 2 గదుల గృహాల నిర్మాణం అభివృద్ధి దశలో ఉంది.

## చేతి పరిశ్రమలు

గుంటూరుజిల్లాలోని దుర్గిగ్రామంలో మెత్తని రాతితో అక్షరాలను చేసే పరిశ్రమను అభివృద్ధిపర్చే పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది. పురాతనమైన యీ చేతి పరిశ్రమను పునరుద్ధరించి యీ పరిశ్రమ పనివారలకు పనులు కల్పించడానికే యీ పథకం ఉద్దేశించబడింది.

* * *

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

22 ఫిబ్రవరి :- విజయవాడ వద్ద కృష్ణానదిపై నిర్మింప బడుతున్న రెండవ రైల్వే వంతెనకు శంఖు స్థాపన జరిగింది

25 ఫిబ్రవరి :- మూడవ సార్వత్రిక ఎన్నికల సందర్భంలో ఈ రోజుతో రాష్ట్రంలో పోలింగు ముగిసింది.

26 ఫిబ్రవరి :- ఆంధ్రప్రదేశ్ శాసనసభాధ్యక్షులు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, విజయవాడలోని తమ స్వగృహంలో పరమపదించారు.

27 ఫిబ్రవరి :- ఆంధ్రప్రదేశ్ శాసనసభ 12 వ సమావేశాన్నీ, శాసనమండలి 5వ సమావేశాన్నీ, ఫిబ్రవరి 23వ తేదీనుండి ముగింపు చేసినట్లు గవర్నరు హైదరాబాదునుండి ఒక ప్రకటన జారీ చేశారు.

28 ఫిబ్రవరి :- శ్రీ సంజీవయ్య తన మంత్రి మండలి రాజీనామాను గవర్నర్‌కు సమర్పించారు.

2 మార్చి:- మహిళలు, బాలికల రాష్ట్ర విద్యామండలి ఆధ్వర్యాన "స్త్రీ విద్య" అనే విషయంపై రాష్ట్ర రాజధానిలో గోష్ఠి ప్రారంభమైంది.

5 మార్చి :- నాల్గవ ప్రాంతీయ ఖూసారి పరిశీలన సమావేశానికి హైదరాబాదులో ప్రారంభోత్సవం జరిగింది.

7 మార్చి :- ఆంధ్రప్రదేశ్ క్రొత్త శాసనసభలో కాంగ్రెస్ పార్టీ నాయకుడుగా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

8 మార్చి :- మంత్రివర్గాన్ని యేర్పాటు చేయాల్సిందిగా శ్రీ యన్. సంజీవరెడ్డిని గవర్నరు ఆహ్వానించారు.

11 మార్చి :- ముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డి, మంత్రివర్గ సభ్యులు, స్టేట్ మంత్రుల పేర్లను హైదరాబాదులో ప్రకటించారు.

12 మార్చి :- రాజభవనంలో గవర్నరు, ఆంధ్రప్రదేశ్ క్రొత్త మంత్రుల చేత పదవీ ప్రమాణస్వీకారం చేయించారు.

19 మార్చి: తాత్కాలిక స్పీకరు, శాసనసభ క్రొత్త సభ్యులచేత ప్రమాణ స్వీకారం చేయించారు.

20 మార్చి :- శ్రీ బి.వి. సుబ్బారెడ్డి, ఆంధ్రప్రదేశ్ శాసనసభాధ్యక్షుడుగా ఏకగ్రీవంగా యెన్నికైనారు. శాసనసభ, శాసన మండలుల సంయుక్త సమావేశంలో గవర్నరు ప్రసంగించారు.

## భారతదేశంలో

5 మార్చి : గోవా, దయ్యూ డామన్‌లను కేంద్రపాలిత ప్రాంతాలుగా పరిపాలించడానికి, అందుకు సంబంధించిన మరికొన్ని విషయాలకు వర్తించగల ఆర్డినెన్సును రాష్ట్రపతి జారీచేశారు

ఆరవ అఖిల భారత అగ్నిమాపక దళాలసప్తాహం ప్రారంభమైంది.

6 మార్చి : నూతన బర్మా ప్రభుత్వాన్ని భారత ప్రభుత్వం పరిగణించింది.

12 మార్చి : పార్లమెంటు సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ ప్రసంగించారు.

మూడవ ఆర్థిక సంఘం సిఫార్సులనూ, వాటిపై ప్రభుత్వం గైకొన్న నిర్ణయాలను లోక్‌సభ ముందు ఉంచారు.

అమెరికా అధ్యక్షుని భార్య శ్రీమతి జాక్విలెన్ కెన్నెడి ఢిల్లీ చేరుకున్నారు

14 మార్చి :- గోవా, డామన్, దయ్యూలను కేంద్ర పాలిత ప్రాంతాలుగాప్రకటిస్తూ 12వ రాజ్యాంగ సవరణ బిల్లును లోక్‌సభలో ఏకగ్రీవంగా ఆమోదించారు.

13 మార్చి :- 1962-63 వ సంవత్సరానికి సంబంధించిన రైల్వే బడ్జెటు శ్వేత పత్రాన్ని లోక్‌సభకు సమర్పించారు

14 మార్చి: 1962-63 వ సంవత్సరానికి రూ. 63 5 కోట్ల లోటుబడ్జెటును ఆర్థికమంత్రి లోక్‌సభకు సమర్పించారు.

## విదేశాలలో

2 మార్చి :- బర్మాలో పరిపాలనాధికారాన్ని సైనిక వర్గాలు గతఅర్ధరాత్రి కైవసంచేసుకున్నట్లు సైనిక ప్రధానాధికారి జనరల్‌నేవిన్ ప్రకటించారు.

6 మార్చి : "ఇకేఫ్" 18 వ సమావేశం టోక్యోలోఆరంభమైంది.

11 మార్చి : నిరాయుధీకరణ సమస్యను గురించి చర్చించడానికి అమెరికా, బ్రిటన్, రష్యా దేశాల విదేశాంగ మంత్రులు జెనీవాలో సమావేశమయ్యారు.

18 మార్చి : అల్జీరియాలో యుద్ధ విరమణను అమలు చేయడానికి ఫ్రాన్సు, అల్జీరియా ప్రతినిధుల మధ్య ఒప్పందం కుదిరింది *

## గ్రంథ సమీక్ష

# అమూల్యమైన దేశ చరిత్రలు

మధ్య ప్రాచ్యంలో అతికీలకమైనస్థానాన్ని ఆక్రమించి ఉన్న దేశం ఈజిప్టు. ఇది చరిత్రయొక్క తొలికాలంనుండి మానవ చరిత్రలో ప్రధానపాత్రను వహిస్తూ ఉన్నది. ప్రాచ్య ప్రపంచాన్ని పాశ్చాత్య ప్రపంచంతో కలిపే కీలకమైన జలమార్గం "సూయజ్ కాలువ" ఈజిప్టులోనివే. మూర్తీభవించిన అరబ్ జాతీయతకు చిహ్నమైన ఈజిపు క్రీస్తుకుపూర్వం ఏడువేల సంవత్సరములనుండి ఇండియా, చైనాలతో సన్నిహితసంబంధం కల్గి ఉజ్వలమైన నాగరికతను నిర్మించుకున్నది. ఆ కాలంలో నిర్మింపబడిన యీ దేశంలోని పిరమిడ్లు, దేవాలయాలు శిల్పచాతుర్యానికి ఇంజనీరింగుకు ప్రపంచమునకెల్ల ప్రసిద్ధివడసి యీనాటికి అన్ని దేశాలవారిని ఆకర్షిస్తూ ప్రసిద్ధ యాత్ర స్థలాలుగా అలరారుతున్నవి. అక్కడి అలెగ్జాండ్రియా విశ్వ విద్యాలయం క్రీస్తుశక ప్రారంభంలోనే గొప్ప వైజ్ఞానిక పరిశోధనలకు, సుప్రసిద్ధమైన శాస్త్ర గ్రంథాల రచనకు ఆకరమైనది. ఈజిప్టు రాజధాని కైరో నగరంలోని అల్ అజ్హార్ విశ్వ విద్యాలయం సుప్రసిద్ధ వైజ్ఞానిక కేంద్రం ఇట్టి ప్రధాన దేశంయొక్క చరిత్రను లోగడ ఆంధ్రప్రదేశ్ శాసనసభాపతిగా ఉండి యిటీవల కీర్తిశేషులైన శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు గారు "ఈజిప్టు దేశచరిత్ర" అన్నపేరుతో అతి ఆకర్షకమైన విధంగా రచించారు. చరిత్ర శాస్త్రముల తెలుగు అకాడమీ హైదరాబాదు ప్రచురణ అయిన యీ గ్రంథరాజం వెల రు 4 00. దీనిని ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ వారు ముద్రించారు.

ఈజిప్టు వైశాల్యం 3 లక్షల 86 వేల 198 చదరపు మైళ్లు 1955 సంవత్సరంలో సేకరించిన జనాభా లెక్కల ప్రకారం యీ దేశ జనసంఖ్య రెండుకోట్ల 32 లక్షలు. ఇది వ్యవసాయ ప్రధానమైన దేశము. ఇక్కడ ప్రత్తిపంట విశేషము

మధ్యప్రాచ్య దేశాలపై పాశ్చాత్య సామ్రాజ్యవాద దేశాలకు మొదటినుండి కన్ను ఉండనే ఉన్నది. సూయజ్ కాలువ నిర్మాణంతో యీ దేశపు ఇబ్బందులు పెంచి రచ్చకీడ్వబడ్డది. బ్రిటిషువారు ఈజిప్టును ఆక్రమించారు. ఈజిప్టుకూడా ఇండియా వలెనే పోరాడి ఆంగ్లేయులనుండి స్వాతంత్ర్యాన్ని పొందింది.

1952 లో ఈజిప్టు రాజకీయ రంగంలోకి కల్నల్ నాసర్ వచ్చాడు. రక్తపాత రహిత సైనిక విప్లవాన్నిజరిపి ఆ దేశంలోగల రాజరికాన్ని రద్దుపరచి ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని స్థాపించాడు. ఈజిప్టునుంచి ఆంగ్లేయులను ఇతర సామ్రాజ్య వాదులను వెళ్లగొట్టి విప్లవాత్మకమైన సంస్కరణలను తీసుకొనివచ్చాడు అరబ్ దేశాల ఐక్యతకు కృషిచేస్తున్నాడు. బ్రిటిష్ ఫ్రెంచివలస పెత్తనదారులకు ఎదురొడ్డి నిలచి సూయజ్ కాలువను జాతీయం చేసిన ధీశాలి కల్నల్ నాసర్.

1956లో సూయజ్ కాలువవద్దనుండి బ్రిటిష్ సైన్యాలు శాంతముగా వెళ్లిపోవలసివచ్చినా యీకాలువను జాతీయం చేయడంలో బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వములు మరొకవైపు ఇస్రాయిల్ యీజిప్టుపై యుద్ధానికి దిగిన సంఘటన మరువదగినది కాదు. ఈ విధంగా కూడా బలమైన రాజ్యాలు తమపై కత్తికట్టినా కల్నల్ నాసర్ నాయకత్వంలో ఈజిప్టు ప్రజలు పోరాడి తమ స్వాతంత్ర్య రక్షణకు నడుం కట్టారు. చినికిచినికి గాలివానగా యీ వివాదం ప్రపంచ యుద్ధానికి దారితీయగలదా? అన్న భయ సందేహాలు గూడా వ్యాపించాయి. ఈజిప్టు వైపు సహాయానికి రష్యాముందుకు దూకుతాననసరికి పాశ్చాత్య సామ్రాజ్యవాదుల ఆటలు కట్టాయి. ఐక్యరాజ్యసమితి జోక్యంవల్ల ఈజిప్టు దురాక్రమణకు సిద్ధపడిన రాజ్యాలు తమసైన్యాల ఉపసంహరించుకొనక తప్పిందికాదు. ఉజ్వలమైన అధ్యాయాలతో కూడుకొని సమగ్రమైన రూపంలో ఈజిప్టుదేశచరిత్రను పది అధ్యాయాలలో తెలుగు పాఠకులకు అందించిన చరిత్ర శాస్త్రములు తెలుగు అకాడమీ వారు అభినందనీయులు.

## తురుష్క ప్రజాస్వామికము-మధ్యప్రాచ్య దేశములు

ప్రచురణ కర్తలు శాస్త్రవిజ్ఞానము చరిత్ర తెలుగు-ఉర్దూ, అకాడెమీ హైద్రాబాదు, గ్రంథం వెల రు. 3-00. దీని రచయిత కూడా శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారే. ముద్రాపకులు ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ

తురుష్కదేశమనగా టర్కీ. ఇది ఆసియా ఆఫ్రికా యూరోపా ఖండముల కూడలిస్థలముగా ఉన్నది. క్రీ.శ. పదునాలుగవ శతాబ్దంనుండి ఈదేశం ప్రాముఖ్యంలోనికివచ్చి గొప్ప సామ్రాజ్యాన్ని స్థాపించుకున్నది. ఈ సామ్రాజ్యం బ్రిటిష్ ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్రాబల్యం క్రిందికివచ్చి క్రమంగా క్షీణించి తరువాత తొలి ప్రపంచయుద్ధపు తాకిడికి పూర్తిగా విచ్ఛిన్నమైంది

1914 లో ప్రారంభమైన తొలి ప్రపంచ యుద్ధంలో టర్కీ జర్మనీ పక్షాన చేరడంవల్ల దానికి చెడురోజులు సంప్రాప్తించి 1918వ సంవత్సరంలో కుదిరిన సంధివల్ల అరబ్ దేశాలపై తనకు గల సామ్రాజ్యాధికారమును వదులుకోవలసి వచ్చింది. ఉన్న సామ్రాజ్యం పోవడమేకాక ఎడతెగనియుద్ధం, వేలు లక్షలు మరణించడం. క్షతగాత్రులవడంతో టర్కీలో నిరాశానిస్పృహలు పెరిగాయి, పేదరికంకూడా హెచ్చింది తమ దేశపు స్వాతంత్ర్యాన్నైనా రక్షించుకోగలమా అన్న సందేహము ఏర్పడింది. అంతకుముందే సుల్తానుల పాలనవల్ల ఆర్థికంగా చిక్కిపోయిన యీదేశం పొందిన నైరాశ్యానికి అంతులేదు. ఇట్టి స్థితిలో ముస్తాఫా కమాల్ పాషా కారుచీకటిలో కాంతిరేఖగా టర్కీ ప్రజల సముద్ధరణకు పైకివచ్చాడు. తమ జాతికి నాయకత్వాన్ని వహించి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని తమదేశానికి నిలబెట్టగలిగాడు టర్కీ అప్పటినుండే క్రమంగా అభివృద్ధిని పుంచుకుంటున్నది

మధ్యప్రాచ్య దేశాలలో సైనిక తిరుగుబాట్లు, రాజకీయంగా ఒడుదొడుకుల కలుగుతూ ఉండటం తిరిగి సర్దుబాటు అవుతూ ఉండటం మొదటినుంచీ వస్తూనే ఉన్నవి. కమాల్‌పాషా మృతి తర్వాత టర్కీ పాశ్చాత్య రాజ్యకూటముల వైపు మొగ్గింది.

ఈ చరిత్రఅంతా సవివరంగా రూపొంది ఉన్నాయీ గ్రంథాన్ని చరిత్రపిపాసులు తప్పక చదవవలసి ఉన్నది

—సి హెచ్ ఆచార్య.

గ్రంథ సమీక్ష:

# నిర్వచన సుందరకాండము

(గ్రంథకర్త—శ్రీ సోమంచి వాసుదేవరావు. డెమ్మి అక్టేవో XXXIV + 21 + 326 + 8 పుటలు. వెల: ఐదురూపాయలు. కాపీలకు— గ్రంథకర్త పేట, కానుకుర్తి వారివీధి, శ్రీకాకుళము అని వ్రాయవలెను.)

వాల్మీకి రామాయణాంతర్గత సుందర కాండమును శ్రీ సోమంచి వాసుదేవరావుగారు నిర్వచన సుందరకాండమను పేర పంచమాశ్వాస కావ్యముగా 1670 పద్యములలో అనువదించినారు ప్రథమాశ్వాసమున మొదటి సర్గనుండి పదమూడవ సర్గవరకును, ద్వితీయాశ్వాసమున పదునాల్గునుండి ముప్పదియవ సర్గవరకును, తృతీయాశ్వాసమున ముప్పదియొకటి మొదలు నలుబదియవ సర్గ వరకును, చతుర్థాశ్వాసమున నలుబదిఒకటినుంచి నలుబదిఏనిమిదవ సర్గ వరకును, పంచమాశ్వాసమున నలుబది తొమ్మిది మొదలు అరువది యెనిదవ సర్గవరకును సలక్షణముగా అనువదించినారు అంతేగాక ఏ సర్గమునకాసర్గము నను వదించుటయు పాఠకుల కుపయోగకర ముగా నున్నది పీఠిక పేరిట మరొక తొంబదియారు పద్యములు గలవు. ఇందువీరు తమయిష్టదేవతాది సంస్మరణము చేయుటయేగాక కొంతమంది అజ్ఞాతకవి మిత్రుల నాంధ్రలోకమునకు బరిచయము చేసినారు గ్రంథకర్తలకుపాస్య దైవము నారాయణుడు. శ్రీరామాయణ ప్రశంసమని, కవితా ప్రశంసయని వేర్వేరు శీర్షికలలో తమకు రామాయణము పైన, కవిత్వముపై గల సదభిప్రాయము లను దెలియజేసినారు. వీరీ పీఠికయందు,

"సమకాలికులగు కవిచం
ద్రములన్ వాల్మీకి రచితరామాయణ కా
వ్యము దెనిగించిన సుకవుల
నమేయులన్ గొల్తునాదు స్వాంతమునందున్"

అని వ్రాసినందున, వారు సుందరకాండమును దెనిగించు చుండియు నీవిధముగ రామాయణము నాంధ్రీకరించిన కవితల్లజులను పూజ్యభావమున గొలుచుట వీరి సౌహార్ద్రతకు తార్కాణమని వేరుగా చెప్పనక్కరలేదు.

శ్రీ సోమంచి వాసుదేవరావుగారు నిర్వచనకావ్యమునకు పూర్వమే శివానందలహరి, సౌందర్యలహరియను యనువాద కావ్యములను, శ్రీ వేంకటేశ్వరస్తవము, స్తుతిరత్నమాలిక యను స్వతంత్ర పద్యరచనలు చేయుటద్వారా ఆంధ్రసాహితీ లోకమునకు చిరపరిచితులు వీరి సుందరకాండానువాదము చక్కనిశైలిలో నున్నది. వీరిది స్వేచ్ఛానువాదమయ్యును వాల్మీకిమూలానుసారమై యున్నది. వీరు మానిని, మాలిని, ఉత్సాహ, వనమంజరి, సుగంధి. లయపద, తరళ, మత్తకోకిల, తరువోజ, స్రగ్విణి, మహామానిని, కవిరాజవిరాజితము మొదలగు వృత్తములను వాడి యుండుటవలన వీరులక్షణశాస్త్రమును నిష్కృష్టముగ నధ్యయనము చేసిరని చెప్పకతప్పదు. వీరి పద్యములలో ప్రౌఢదీర్ఘసమాసపద ఘాయిష్టమగు శైలియును, మృదుమధుర కోమలకాంతపదావళీ సలసితమును గన్పించును. మచ్చునకు నుదాహరణలు:—

"నిశితక్రూరమహోరగాభశరవహ్నిస్ఫారకేలన్"

(ఆ—II, ప—165, పుట. 118)

"తరుణాదిత్య సువర్ణకుండల గణోదారుండు"

(ఆ—II, ప—186, పుట 122)

"రాజతపంజరాంతర విరాజిత రాజమరాళలీల"

(ఆ—I, ప—212, పుట 40]

ఇట్లింకెన్నియో చూపవచ్చును. ఈ విధముగ వీరి రచన మనోహరముగా నుండుటచే రామాయణమనిన శిరః కంపము చేయు వారలందరకును అభిమానింప తగినదై యున్నది. హనుమత్సందేశమువంటి సుందరకాండానువాదములున్నను తమభక్తి ప్రపత్తులను వెలార్చుటకు శ్రీ సోమంచి వాసుదేవరావు గారు నిర్వచన సుందరకాండమును రచించినారు. వారి సమీర సందేశ కావ్యము కూడా త్వరలో సూర్యాలోకనభాగ్యము నందగలదని ఆశించు చున్నాను

—"వెల్దండ"

# ముఖ్యమంత్రి ఉగాది సందేశం

(6వ పేజీ తరువాయి)

తమ నిర్మల హృదయానికి, బుద్ధికి అనుగుణంగా కష్టపడితే, మనం పెట్టుకున్న శ్రేయోరాజ్య సంకల్పానికి అనుకూలంగా శ్రమిస్తే, మనం రూపొందించుకొనే నానా విధ సంస్థలన్నీ కూడా ప్రజలకు నిజమైన సంక్షేమ కేంద్రాలుగా వర్ధిల్లుతయ్. ఇంకొకరికి ఏదో విధమైన అన్యాయం, ఇబ్బంది కలిగించకుండా జీవించలేక పోతున్నామనే పూర్వ విచారంకూడా శ్రేయోరాజ్యంలో సమసి పోతుంది. ఎందుకంటె, వైజ్ఞానిక సహాయంతో ప్రకృతి తరగనట్టి పెన్నిధి అవుతోంది. ఉన్నదికొంచెమే అయినప్పుడు, అదీ అందరకూ సరిపోనప్పుడు, దాన్ని పెంచుకొనే దారి తెలియనప్పుడు, ఆ ఉన్నదానినే ఎవరు ఎక్కువగా చేజిక్కించుకుంటామా అని తల పోస్తూ ఉంటారు. ఇప్పుడు ఆర్థిక పరిణామంలో ఆ పూర్వ దశ తొలగిపోయింది. మనిషికి ఎంత సంపద కావాలంటె అంత సంపదను ఇవ్వటానికి సిద్ధంగావుంది ప్రకృతి. ఈ భౌతిక సంపదను సాంఘిక వికాసంగా, మానసిక ఆనందంగా మార్చుకోవలసిన ధర్మం, మార్చుకోగలిగిన అవకాశం మనది.

ఈ ఉగాదినాడు చెట్టు చెట్టున, చిగురు చిగురున ప్రకృతి ఎలాగైతే నవ్వుతూ, కేరింతలు కొట్టుతూ ఉన్నట్టు, పాటలుపాడు తున్నట్టు కనబడుతోందో, అలాగే మనంకూడా స్వార్థమనే శీతా కాలంలోంచి, దాని చలిగాలుల్లోంచి బైటపడి, అందరి శ్రేయస్సు అనేవసంత–ఆగమనాన్ని ఆనందపూర్వకంగా ఆహ్వానిస్తాం. శతశతాబ్దాలక్రితం మన పూర్వీకులు, మనదేశాన్ని మానవ చరిత్రకే పతాకశీర్షికగా శోభిల్లేట్టు ఎలారూపొందించారో, మనము దానిన్న తరాలవారుకథలుగా, కావ్యాలుగా, ఇతిహాసాలుగా, ఆటలో, పాటలో బొమ్మల్లో కమ్మగా చెప్పుకునే విధంగా దేశాన్ని రూపొందించు కుందాం. ఆమధ్య దేశమంతా పర్యటించాను–బాటసారిగా, కన్యా కుమారి నుంచి కాశ్మీరందాకా. నాలుగుదిక్కులు ఏకమైపోయి, మన మనస్సును క్షణమాత్రం పరవశం చేసే కన్యాకుమారివద్ద నిలబడ్డప్పుడు, నాకు భారతమాత చరణపద్మాలముందు నుంచున్నట్టు వుంది ఏదో ఆనందం, ఏదో మహాప్రశాంతి, దేశంలోని తేజస్సు తటిత్తుల మెరిసింది. అలాగే హిమాలయ పర్వతాల హిమపూరిత హిరణ్మయకాంతులను చూసినప్పుడు, భారతమాత ప్రసన్నదృష్టిని చూస్తున్నట్టువుంది. దేశమే అజరామరమైన జీవశక్తితో నాముందు నిలువునాలేచి నిలబడ్డట్టు, నేనే ఆతేజోమయ రూపానికి ఒక చిన్న నీడనని అన్పించింది. అది నిజంగా అపూర్వ అనుభవం. మనం వస్తూవుంటాం పోతూవుంటాం కాని దేశం మాత్రం నిలిచి వుంటుంది. దేశానికి మరింత వర్చస్సు, తేజస్సు కలిగేట్టు చేయటంలోనే మన జీవితాలకు సార్థకత ఉంది. ప్రకృతి అంతకూ పండగ అయిన ఈ పర్వదినాన, మనం ఈ ప్రతిజ్ఞనే తీసుకుందాం. ఏ దేశం మనను కని, పెంచి పెద్ద జేస్తోందో, ఆ దేశాన్ని దారిద్ర్యం, వ్యాధి, అన్యాయం, అజ్ఞానం లేకుండానూ, సంపదసంస్కృతి పోటీ పడుతూ, శోభిల్లుతూ వుండేవిధంగానూ రూపొందించుకొని తీరుతామని మాటయిద్దాం భారతమాతకు. కులం, మతం, వర్గం, భాష, ప్రాంతం వగైరా సంకుచిత ధోరణులను వదిలేసి, ఒకే జాతీయ భావాన్ని మనోవాక్కాయ కర్మల్లో ప్రతిబింబించుకుందాం. కొందరికి పనిలో చొరవ వుంటుంది. కొందరికి కొత్త పరిశ్రమలను పెట్టటంలో చురుకు వుంటుంది. కొందరికి మంచి పథకాలను వేసే ప్రతిభవుంటుంది ఇలా మనందరికి వున్న అనేకమైన నైపుణ్యాలను ప్రజాశ్రేయస్సు, దేశపురోగమనం అనే చరిత్ర రథచక్రాలకు పూన్చుకుందాం. ఐకమత్యంతో సాధించుకోలేనిదంటూ వుండదు.

మనందరితో సహకరించి, శుభకృత్ అన్నివిధాలా అందరికీ శుభకరంగా పరిణమించగలదని ఆశిస్తున్నాను. కొత్త సంవత్సరం మీ అందరకూ సంతోషదాయకంగా ఉండాలని ప్రార్థిస్తున్నాను. ఈ శుభకృత్ పర్వదినాన, మీ అందరకూ, నా అభినందనలు.

—జై హింద్"

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్ డివిజన్లు (1961 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... ... | 20 |
| తాలూకాలు | ... ... | 189 |
| పట్టణాలు, నగరాలు | ... ... | 223 |
| జనసాంద్రత ( చదరపు మైలుకు) | ... | 340 మంది |

## పంచవార్షిక పశుగణన-1961

| | | ( వేలలో ) |
|---|---|---|
| పశువులు | ... ... | 121,80 |
| గేదెలు | ... ... | 69,52 |
| గొర్రెలు | ... ... | 83,73 |
| మేకలు | ... ... | 42,56 |
| గుర్రాలు | ... ... | 73 |
| ఇతర జంతువులు | ... ... | 6,82 |

## సమూజాభివృద్ధి కార్యక్రమం

| | 1959_60 | 1960_61 |
|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 |
| సగటున వేయి గ్రామాలకు గల బ్లాకులు | 10.66 | 15.52 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 15.52 |
| బ్లాకులక్రింద వున్న గ్రామాలు ... | 17,887 | 20,823 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 1,87,31,000 | 20.701,000 |

## ఖనిజోత్పత్తి

| | | 1959_60 | | 1960_61 | |
|---|---|---|---|---|---|
| బొగ్గు | ... ... | 2260,000 | టన్నులు | 2596,000 | టన్నులు |
| ముడిఇనుము | ... ... | 199,000 | ,, | 236,000 | ,, |
| మాంగనీస్ | ... .. | 16,000 | ,, | 23,000 | ,, |
| అభ్రకం | ... ... | 3,000 | ,, | 3,000 | ,, |
| సున్నపురాయి | ... ... | 766,000 | ,, | 1,011,000 | ,, |

